

"శ్రీ కృష్ణవిజయము"లో హేమమాలిని.

పడుచు వయసులో ప్రణయం సహజం!
ప్రణయంలోని. మాధుర్యం ఎవరికి స్వంతం?

అశోక్ మూవీస్

# పవిత్రబంధం




సొంతడిస్ట్రిబ్యూటర్స్: అనీల్‌ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్

# ఉత్తరాలు

## వ్యాసాలు

ఢిల్లీలోని పటేల్ ఇన్‌స్టిట్యూట్ వారు తెలుగులో వెట్టిపాల అనబడే ఆకు మీద పరిశోధనలు జరుపుతున్నట్లు టయిమ్స్ వీక్లీలో వచ్చిన వ్యాసాన్ని ఆంధ్రసచిత్ర వారపత్రిక [12—2—71]లో వేసినందుకు కృతజ్ఞత తెలుపుతున్నాను. ఈ ఆకు మా ప్రాంతంలో [ఉదయగిరి నెల్లూరు జిల్లా] విరివిగా దొరుకుతుంది. దీనిని పాల ఆకు అంటారు. టయిమ్స్ వీక్లీ ఫోటోలో వున్న ఆకు లాగే వుంటుంది ఈ ఆకు కూడా అయితే, వెట్టిపాల, పాల అనబడే ఈ ఆకు ఒకటేనో లేక వేరువేరు ఆకులున్నాయో తెలియదు. తెలిసిన పెద్దలు వివరింపగలరు.

మాలు చెన్నకేశవులు, [మదరాసు]

*　　*　　*

తెలివైన వాళ్ళని మూర్ఖులుగా చేయడంలో అందె వేసిన చేయి మహేష్ గారిది.

ఉబ్బసానికి కొత్త [?] చికిత్స ఉపయోగకరమయినది. అది నవంబరు 29, 1970 టైమ్స్ వీక్లీలో ప్రచురించినపుడు వెట్టిపాల ఆకును, తైలోఫోరా ఇండికా అని ఉన్నది కాని మీ సంచికలో తైలోఫోరా ఆస్మాటికా అన్నారు. ఈరెండు ఒకటేనా కాదా అన్నది మా సందేహం. తెలుగులో తైలోఫోరా, ఇండికాకు అర్థం కనబడలేదు. తైలోఫోరా ఆస్మాటికాకు కుక్క పాలాకు వెర్రి పాలాకు అని ఉన్నది. కాని మీరు వెట్టి పాలాకు అన్నారు ఏది నిజం. తైలోఫోరా ఇండికా [ఆస్మాటికా] గురించి పరిశోధన చేసిన డా: శ్రీ ద్వారకానాథ శివపురి వారిని ఎంతయిన అభినందించవచ్చును. భారతదేశం ఈ పరిశోధనలకు విదేశి సంస్థల కన్న ఎక్కువ ప్రోత్సాహమిచ్చి ఫలితాలు ప్రకటించితే ఎంతయిన సంతోషించవచ్చును.

మల్లాది వెంకటశాస్త్రి [కాకినాడ]

* * వా ఖ

రెండు పేర్లూ ఒక దానివే! ఈ సంగతి వివరంగా చెప్పి ఉండవలసింది.

మదరాసు వాలంటరీ హెల్త్ సర్వీస్‌లో కూడా టయిలోఫోరా అస్‌త్మాటికా లేక ఇండికాకి సంబంధించిన పరిశోధన జరుగుతోందని ఈ విలేఖరికి తెలిసింది.

> **గేయాల రచయితలకి**
>
> **మనవి**
>
> ఆంధ్రసచిత్రవారపత్రికకి గేయాలు పంపేవారు వీలయినంతవరకూ 15 పంక్తులు మించనివి పంపగోరుతాము.
>
> —సంపాదకుడు.

శ్రీయుతులు చోప్రా, నయార్, చోప్రా తయారు చేసిన గ్లాసరీ ఆఫ్ ఇండియన్ మెడిసినల్ ప్లాంట్స్‌లో వెట్టిపాల అన్న పేరు మాత్రమే ఉంది. ఈ పుస్తకంలో తమిళ నామం వాయుప్పాల అని ఉన్నప్పటికీ శ్రీ ఎస్. కె. జెయిన్ రాసిన, మెడిసినల్ ప్లాంట్స్‌లో దీనినే అరవంలో కాగితం చెట్టు అంటారని ఉంది! —రా.

*　　*　　*

ఆంధ్రసచిత్ర వారపత్రిక నిర్వహిస్తున్న 1970 సం.పు సినిమా బాలట్ ఫలితాలు [గత సంవత్సరం మాదిరిగా కాకుండా] పూర్తి వివరాలతో ప్రచురిస్తారని ఆశిస్తున్నాను. మన తెలుగు చిత్రపరిశ్రమలో నాయకులు శ్రీరామారావు నాగేశ్వరరావుగారలే కాకుండా హరనాద్, శోభన్‌బాబు, కృష్ణ మొదలైన, వృద్ధిలోనికి వస్తున్న యువ నటులు కూడ ఉన్నారు. కావున ఉత్తమ నటునిగా అక్కినేని వచ్చినా [ఎలాగూ శ్రీ రామారావు బాలట్ల నుండి విరమించారు గనుక], ద్వితీయ, తృతీయస్థానాలను కూడా ప్రకటించాలని కోరుతున్నాను. ఎప్పటిలా బాలట్ విజేతలకు వచ్చిన వోట్ల శాతాలు, సినిమా డైరీ కూడ ప్రచురించి బాలెట్ సంచికను విందుగా మాకందించగలరని విశ్వసిస్తున్నాను.

యల్. వి. వి. సత్యనారాయమూర్తి, [కాకినాడ]

*　　*　　*

కొందరు చదువరులు ఉత్తరాలు వ్రాసినప్పుడు—ఇది వేసి మీ [సంపాదకుడి?!] నిజాయితీ నిరూపించుకొనండి—అని సవాలు చెయ్యటం గమనించాను. ఈ రకం సవాలు అనవసరం అని నాకు అనిపి

Statement about ownership and other particulars about newspaper

ANDHRA SACHITRA VARA PATRIKA

*FORM IV* (SEE RULE 8)

1. Place of publication: Madras
2. Periodicity of its publication: Weekly
3. Printer's Name: Sri S. Nageswara Rao
   Whether citizen of Indhia: Yes
   If foreigner state the country of origin: —
   Address: 16 Luz Avenue, Mylapore, Madras-4.
4. Publishers Name: Sri S. Nageswara Rao
   Whether citizen of India: Yes
   If foreigner, state the country of origin: —
   Address: (As above)
5. Chief Editor's Name: Sri S. Sambhu Prasad
   Whether citizen of Indhia: Yes
   If foreigner state the country of origin: —
   Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 16 Luz Avenue, Mylapore, Madras-4. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | Do |

I, S. Nageswara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. NAGESWARA RAO

1-3-71 Signature of Publisher

# ఉత్తరాలు

స్తుంది. దానికి భయపడే వారూ ఉండరు, రోషం వచ్చేవారూ ఉండరు....

అ. రామన్న [మాయవరం.]

## రాజధాని కబురు

రాజధాని కబుర్లు ద్వారా మాకు విపరంగా పత్రికాముఖంగా అందజేస్తున్న శ్రీ బి. నాగేశ్వర రావుకి మా కృతజ్ఞతలు.

గుడిమెట్ల చెన్నయ్య, బొందల నాగేశ్వరరావు, [మద్రాసు]

* * *

మీరు రాజధాని కబుర్లు శీర్షికను తిరిగి ప్రవేశ పెట్టుట చాలా ముదావహమయిన విషయం రాజధానికి దూరంగా నివసించే నాలాంటి తెలుగు ప్రజలకు ఆ కబుర్లు వినాలనే కుతూహలం ఎంతేనా ఉంటుంది. రోజూ పేపర్లు చదువు తున్నా రాజధాని విషయాలను, సమగ్రంగా అర్థం చేసుకుందుకు మీరు ప్రచురించే వ్యాసాలు ఎంతో గానో సహకరిస్తాయి. కొత్త కాంగ్రెస్ రాజ కీయాలలో తెలంగాణా పేరుతో వెలువడ్డ వ్యాసం నాకెంతగానో నచ్చింది.

శివమోహన్ [వేలంగి]

## కథలు

మూడుముళ్ళు కథ చాలా బాగున్నది. కథ చిన్నదైనప్పటికీ మంచి పద ధోరణిలో చాలా ఇంపుగా ఉన్నది. ఇటువంటి చిన్నకథలను ప్రతివారం ప్రచురించుట వలన చాలా సమంజసముగా ఉన్నదని నా అభిప్రాయము.

పి. రమేష్ [అనంతపురం.]

* * *

అకొండి వెంకటరత్నంగారి కలం నుండి మెట ఫర్లు మె[కు]రిసినయ్ నడక నేర్చిన వాడిలో డబ్బుకి టానిక్కులిచ్చి పెంచుతున్నాడు... సైన్! తమ ప్రతి కథలో నో నీతిని ప్రభోదించి, తప్పుకుపోతున్నారు మహేశ్ చంద్రరావ్ వేషంలో!! పత్రిక్కి రెండే నిండు!!!

శివ, [తెనాలి]

> **శ్రీ హేమంతకుమార్ బాసు మరణం**
>
> అఖిలభారత ఫార్వర్డ్ బ్లాక్ అధ్యక్షుడు శ్రీ హేమంతకుమార్ బాసు ఉత్తర కలకత్తాలో ఎన్నికల ప్రచారం చేసుకుంటూండగా కొందరు దుండగులు ఆయనను పొడిచి చంపారు. ఈ దుర్వార్తని ప్రముఖ రాజకీయ నాయకులందరూ తీవ్రంగా ఖండించారు.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 5-3-'71

శ్రీసాధారణనామ సం॥ ఫాల్గుణమాసం॥ శు॥ దశమి

సంపుటము: 64 సంచిక: 26

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: ఇద్దరు తారలు జమున, వాణిశ్రీ.


తమిళనాడు
ఎన్నికల
పందెం
ప్రజాస్వామ్య దళం
తీవ్రమైన పట్టుదల


మాగతేమిటో
పశ్చిమ
బెంగాల్
ఎన్నికల ముందు
ఈ అగ్నిని
చల్లార్చండి!


నిరుద్యోగ సైన్యం
మన
పథకాలు
భోజనానికి
చాలా
మంది
అతిథులు

13కే అధికార కాంగ్రెసు అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. వీటిలో నాలుగైనా [పోటీ పెట్టని హైదరాబాదు స్థానం కాక] తమకు వస్తాయని నమ్మకంగా నిన్న మొన్నటి దాక చెప్పిన అధికార కాంగ్రెసు నాయకులు, తమ నమ్మకం క్షీణించినట్లే మాట్లాడుతున్నారు. తెలంగాణాలోని ముఖ్యమైన పట్టణాల్లో జరుగుతున్న ఎన్నికల ప్రచార ధోరణి, వాతావరణం బట్టి చూస్తే, ప్రత్యేక రాష్ట్రవాదులదే పైచేయి ఐనా ఆశ్చర్యపడ నవసర ముండదు. కాని రాజకీయాలు జోస్యం చెప్పరానివి. అట్లాగే ఎన్నికల ఫలితాలు కూడా. దేశంలో మిగతా భాగాల్లో వలెనే ఇక్కడ కూడా సాధారణ ప్రజలకు శ్రీమతి ఇందిరా గాంధిలో ఆశాజ్యోతి కనిపిస్తున్నది.. వీధి మానసిలో ప్రబల శత్రువులకు వ్యతిరేకంగా, ఆమె ఏకాకిగా పోరాడుతున్నది. ఆమెకండగా నిలవాలన్న అభిలాష సర్వత్రా ఉంది. దీనికి తోడు, ఎన్నికల్లో గెలుపు ఒక నేర్పు. స్థానికంగా ప్రబలంగా ఉన్నవారు వేసే ఎత్తులకు పైఎత్తులు వేయగలగడం పైన, పోలింగు సమీపిస్తున్న దనగా చూపే సమర్థత, వేసే పాచికల పైన చాలా వరకు ఫలితం ఆధారపడుతుంది. ఈ నేర్పు కాసు బ్రహ్మానందరెడ్డి గారికి చాలా ఉందని అందరూ అంగీకరించినట్టిదే.

## ప్రగాఢమైన ఆలోచన

సికిందరాబాదు నియోజకవర్గం నుంచి తెలంగాణా ప్రజాసమితి టికెట్టుపై పోటీ చేస్తున్న ఎం. ఎం. హాషిమ్. నగరం గోడల పైన తాను తన గుర్తుకు వోటు చేయమని కోరుతూ ఉర్దూ, తెలుగు భాషల్లో ఈ విధంగా వ్రాయించుకున్నారు: కులం తెలంగాణా, మతం తెలంగాణా, ధ్యేయం తెలంగాణా, గమ్యం తెలంగాణా, తెలంగాణా యువతీ యువకుల్లో అత్యధిక భాగం ఇలాగే ఆలోచిస్తున్నారు. ఇది వరొక్కం కావచ్చు. కాని నిజం. ప్రగాఢంగా ఉన్న ఈ ఆలోచనా భావనతోనే యువకులు ఖైరతాబాదు, సిద్దిపేట అసెంబ్లీ నియోజకవర్గాల్లో ప్రజాసమితికి ప్రజాసమితి నాయకులకు కూడా విస్మయాన్ని గొలిపే విధంగా విజయాన్ని చేకూర్చి పెట్టారు. ప్రధానమంత్రి సభలో గలభా చేసినందుకు అరెస్టు ఐన యువకుల్లో ఎల్. ఎల్. బి పరీక్ష ఇస్తున్న విద్యార్థి ఒకరున్నారు. పరీక్ష నాడు అతన్ని విడుదల చేయలేదన్న నెపం పైన ఇతర విద్యార్థు లెవరూ ఆనాటి పరీక్షల్లో కూర్చోలేదు. ప్రత్యేక రాష్ట్ర వాదానికి పట్టుగొమ్మలుగా నున్న విద్యార్థుల ఆలోచనలో మార్పు రాలేదనడానికి ఈ ఉదంతం తార్కాణంగా భావించవచ్చును. విద్యార్థుల ఈ కృతనిశ్చయం ముందు, ప్రత్యేక వాద నాయకుల్లోని అభిప్రాయ భేదాలు, అనైక్యత ప్రభావం ఎన్నికల ఫలితంపై హెచ్చుగా నుండక పోవచ్చును. ఏమైనప్పటికీ, దేశ భవిష్యత్తుతో పాటు రాష్ట్ర భవిష్యత్తు కూడా వోట్ల ద్వారా తేల నుండడం సంతసించదగినది. వోట్లు వేసే ముందు ప్రజలు సాలోచనగా వేస్తారని ఆశిద్దాము..

—వి. నాగేశ్వరరావు ●



# నువ్వే నాకు కావాలమ్మా!

కౌపవరపు అలివేలుమంగ

రోహిణీ కార్తె....ఎండలు మండిపోతున్నాయి. అందులో మిట్టమధ్యాన్నం. ఒంటిగంట అయింది.

మధ్యాన్నంపూట పనంతా ముగించుకుని,అప్పుడే గదిలోకివచ్చి మంచంపై 'ఉస్' అంటూ నడుం వాల్చాను. పైన ఫ్యాను తిరుగుతోంది. గదిచుట్టూ వట్టి వేళ్లతడికల చల్లదనం అలముకునివుంది. కానీ,ప్రకృతి సిద్ధమైన, చండభాను నితీవ్ర జ్వాలలనుంచి తప్పించుకోవటం సాధ్యమా! అందుకే నాకేమిటో తెలియని ఆవేదన, నన్ను వుక్కిరి బిక్కిరిచేయసాగింది. చదువుకుందామని చేత పుచ్చుకున్న పుస్తకంలో, ఒక్క అక్షరంకూడా నా మనస్సుకి ఎక్కటంలేదు. చటుక్కున పుస్తకం మూసేసి, ఐద్ధకంగా ఆవులిస్తూ, కళ్లు మూసుకుని, మంచంపై ఇటునుంచి అటు వత్తిగిల్లినిద్రపోవాలని చూశాను. ఇంతలో ప్రక్కభాగంలోంచి, దత్తు ఏడ్పు వినిపించింది. ఎందుకో, గుక్కలు పట్టి ఏడుస్తోంది. ఏమిటో 'కావాలి! కావాలి!' అని ఏడుస్తోంది. బాగా మారాం చేస్తోంది.

ఆ ఏడుపు వినేసరికి నా మనస్సు చలించి పోయింది...కళ్లు చెమ్మగిల్లినాయి.

'హే భగవంతుడా! నీ సృష్టిలో ఎన్ని విచిత్రాలు నాయనా! తల్లిలేక ఏడ్చేపిల్లలు. పిల్లలులేక ఏడ్చే తల్లులు. తల్లిలేని పిల్లల్ని వేదించే సవతి తల్లులు. .కడుపున పుట్టిన బిడ్డలవల్ల సౌఖ్యం పొందలేక, వారిచే బాధలు పడే తల్లిదండ్రులు...తిన్నది అరగక మద మెక్కి తిరగేవారు...తినటానికి లేక డొక్కలు మాడి ఆకలి చావులకి గురిఅయేవారు... ఇంకా ఎందరో, ఎన్నోరకాల నిర్భాగ్యులు. అందరూ నీకు బిడ్డలేకదా తండ్రీ! అమాయిక ప్రాణుల్ని ఎందుకు హింసి స్తావు...ఏమిటీ లీలా వినోదం! — తప్పు, అపరాధం, మన్నించు తండ్రీ. నీవు ఏదో చేస్తున్నావనుకోవటం ఇంకా చాలా తప్పు— నీదేముంది! ఎవరి ఎవరి కర్మ ఫలితాలను వారి వారికి అనుభవింప చేయిస్తావు. అంతే! ఇందులో...ఈ జగన్నాటక రంగంలో నీవు సూత్రధారివి మాత్రమే...'

అని, అనేక ఆలోచనల్తో నా మనస్సు పరిపరివిధాలుగా పలుదిక్కులకు పరుగులు తీయసాగింది. నా మనస్సులోని ఆలోచనలన్నీ ఒక్కసారిగా రెండేండ్లనాటి వేసవికాలంలో జరిగిన సంఘటనలమీదికి పోయాయి...ఆరోజు లన్నీ కళ్లముందు గిర్రున తిరుగ నారంభిం చాయి.

* * *

రెండేండ్ల క్రిందట వేసవికాలంలో, ఇదే రోజుల్లో ఇలాగే ఒకనాడు పనీ పాటా ముగిం చుకుని, హాల్లోకివచ్చి కూర్చున్నాను. ఇం తలో ఫోన్ మ్రోగింది. ఫోను అందు కున్నాను.

ఆఫీసునుంచి ఆయన ఫోను చేస్తున్నారు. 'సాయంత్రం ఆరు గంటలకి, మా సెక్షన్ లోనే పని చేస్తున్న మూర్తి అనే అతను, మన ఇంటిని చూట్టానికి నీకి వస్తాడన్నమాట! అద్దెకిచ్చే పోర్షన్ సంగతి తెలిసిందా '...ఒకవేళ నేను ఇంటికి రావటం ఆలస్యమయినా, ఆ త ని కి ఇల్లు చూపించి, మాట్లాడు' అని చెప్పారు. నేను 'సరే' నన్నాను.

సాయంత్రం ఆరుగంటలు అ వ నూ అయింది. ఆ మూర్తి అనే అతను భార్యా సమేతంగా ఇల్లు చూడ్డానికి రానూవచ్చాడు. వరండా మెట్లమీద నిలబడి 'సుందరేశం గారూ ... సుందరేశంగారూ' అని పిలు స్తున్నాడు.

వంటఇంట్లో చపాతీలు కాలుస్తున్న, నేను ఆ పిలుపువిని, చేతులు కడుక్కొని తువ్వాలుకి తుడుచుకుంటూ, వాకిట్లోకి వచ్చాను. ముందుగా నా కళ్లు ఆతనిప్రక్కన నిలబడిన ఆవిడని ఆకర్షించినాయి. 'చక్కని విగ్రహం ... అందులో గర్భవతి కాబోలు, ఇంకా అందంగావుంది. అందమైన విగ్ర హానికి గర్భంతెచ్చిన హుందాలో ఎంతో ముగ్ధ మనోహరంగా వుందామె. సొగసైన కను దోయి. పిరుదులవరకూ వేల్లాడే జడా ... మనిషి దేహచ్ఛాయకి సరిపోయే చక్కని వైట్‌స్కై కలర్ వాయిల్‌చీరా, దానికి 'టచ్'అయ్యేట్లుగా తెల్లని గ్లాస్కోజాకెట్టు, జడలో ఒకే ఒక తెల్లగులాబీ, ఆ గులాబీ కంటే ఎక్కువ పరిమళాన్ని వెదజల్లే, చిన్న చిరుదరహాసం చిందించే ఆ ప్రశాంతమైన ముఖ వర్చస్సు' ఇదే ఆమెయొక్క ఆకారం, అలంకారాలు. ఎంత చక్కని అలంకరణ! అని అనిపించింది నాకు.

ఇంతలో అతను నన్నుచూసి 'నమ స్కారమండీ! సుందరేశంగారు, ఇంట్లో లేరాండీ ..నేను' అని చెప్పబోయే లోపల.

అతన్ని పరికిస్తున్న నాకు 'చక్కని ఈడూ జోడూ, ఎంత ము చ్చ ట గా వున్నారో!' అని అనిపించింది. నా కెందు వల్లనో కాని, ఆ అమ్మాయివంకే అలా చూస్తూ వుండాలనిపించింది. ప్ర థ మ వీక్షణంలోనే నా మనస్సు ఆమెని ఆకర్షిం చింది. ఆమె అంటే అదో నిధమైన ప్రేమ భావం కల్గింది ఆమెనే అలా చూస్తూ నిలబడ్డ నాకు ఆతని నమస్కారం, చైతన్యం కల్గించింది. వెంటనే తమాయించుకుని, 'ఆ. ఆ. మీ పేరు మూర్తిగారు కదండీ! ఏ. జి. ఆఫీసులోనే మీరూ పనిచేస్తున్నా రటగా! మధ్యాన్నం, మావారు ఫోనుచేసి చెప్పారు, విషయమంతా! రండి, లోపలికి. ఇల్లు చూద్దురుగాని' అని అంటూ లోనికి దారితీశాను.

ఆమె చిన్నగా నవ్వుతూ నన్ను అనుస రించింది. ఆతనుమాత్రం, ఆఫీసరుగారి ఇల్లుకదా అనే భయంవల్లనో ఏమో! అతి నెమ్మదిగా పిల్లిలాగా నడుస్తూ ఇంటిని నాల్గుమూలలా పరికించ సా గే డు. ఆమె మాత్రం చలాకీగా, హు షా రు గా నాతో మాట్లాడింది. వారి కివ్వబోయే పోర్షన్ అంతా, బాత్‌రూమ్ లెట్రిన్‌లతో సహా చూపించాను. వారిరువురికీ ఇల్లు నచ్చినట్లే అనిపించింది. అద్దె సంగతి అడిగారు. చెప్పాను. 'ఒక పదిరూపాయలు తగ్గించండి! ఏదో మధ్యతరగతి వాళ్లం!' అంది ఆమే, ఆమె గొంతు సన్నగా, వీణాతంత్రుల ధ్వనిలాగా వుంది.

నేను ఎందుకనో కాదనలేకపోయాను. వారితో చెపుతాననే మాటకూడా అనకుండా 'సరే'నని వప్పుకున్నాను. అడ్వాన్సు ఇస్తా మన్నారు. ఏమిటో నాకు వద్దనాలనిపించింది. 'ఫరవాలేదు...అడ్వాన్సు ఇవ్వక్కర్లేదులెండీ' అని అన్నాను. అంతా యాంత్రికంగా జరిగి పోయింది...వాళ్లిద్దరూ సంతోషంగా వెళ్లి పోయారు.

రాత్రికి వారికి చెపితే 'పది రూపాయలు తగ్గించి వప్పుకున్నావా...ఊఁ, పోనీలే, పాపం! ఆతనికి వచ్చే జీతమే తక్కువ... అందులో సిటీ లైఫ్. వెనుక ఆస్తిపాస్తు లున్న వాళ్లేమీకారుట...' అని నెమ్మదిగా అనటం ప్రారంభించేరు.

నేను అందుకుని 'అతని హిస్టరీ అంతా బాగా తెలుసల్లేవుందే, మీకు!' అన్నాను.

'ఆ. తెలుసు. అతనే, నిన్న నాతో అంతా చెప్పుకున్నాడు. అ దుకే నాకు చాలా జాలి వేసింది. చాలా మంచివాడు! చాలా సిన్సియర్‌గా వర్కుచేస్తాడు...భార్యకి కొద్ది రోజుల్లో ప్రసవించేరోజు లొస్తాయట...అతను ఇప్ప డుంటున్న ఇల్లు చాలా చిన్నదట. అత్తారి వూరు కుగ్రామమట, అందుకని ఈ వూళ్లోనే పురుడూ పుణ్యం, అవి చేసుకుం టాడట. అందుకని ఇల్లుకోసం వెతికి వెతికి, ఎక్కడా దొరకక నానా అవస్థా పడుతున్నా డట. మరి హైద్రాబాదులో ఇల్లు దొరకటం అంటే మాటలా! పైగా ఎక్కువ అద్దె భరించలేడాయే...తన గోడంతా నిన్న నాతో మాటల సందర్భంలో వెళ్ళబోసుకున్నాడు... అప్పుడు నేను, మనం కొత్తగా కట్టించు కున్న ఈ ఇంటి గురించి చెప్పి, అడ్రస్ చెప్పి, వెళ్లి ఇల్లు చూసుకోమన్నాను. అంతే, వెంటనే సాయంకాలం, చూసుకోవటానికి వచ్చేడు' అని ఆ దంపతులగాధని క్లుప్తంగా నాకు విశదీకరించారు మా వారు.

మర్నాడు సాయంత్రం ఒక ఎద్దుబండిలో సామాను వేసుకుని తీసుకువచ్చి సామానంతా

ఇంట్లో పెట్టించి వెళ్లాడు...మరో అర గంటసేపటికి ఒక రిక్షాలో భార్యని తీసుకుని వచ్చాడు. భార్యా భర్త లిద్దరూ రిక్షా దిగారు.

నేను వరండా మెట్లమీద నిలబడి, వాళ్లను చూస్తున్నాను. ఆమె రిక్షా దిగి లోనికి వస్తోంది. మెట్లదగ్గిరకి వచ్చింది. మొదటి మెట్టుపైన కాలు పెట్టబోయింది. కాలి కున్న మట్టెకి చీర కుచ్చెళ్లు తగులుకుని చిక్కుపడిపోయి, బందాలుపడి ముందుకు పడబోయింది...అక్కడనుంచి నాలుగోమెట్టు మీద నుంచుని చూస్తున నాకు, 'అయ్యో పాపం! ఒట్టిమనిషికూడాకాదు, పడిపోతుం దేమో' అని అనిపించింది. వెంటనే అమాం తం రెండు అంగల్లో నాల్గుమెట్లు దిగి, ముందుకు పడబోయిన ఆమెని బలంగా పట్టుకుని, నా కౌగిట్లోకి చేర్చుకున్నాను.

ఆమె 'అక్కయ్య...గారూ!' అంటూ నిస్సహాయంగా నా మీద వాలిపోయింది.

నాకు ఆ పిలుపు అమృత సోనలను, నాచెవిలో కురిపించింది. నా క్షణంలో ఆమె ముక్కు మొఖం ఎరగని పరాయివ్యక్తి అని అనిపించలేదు. ఎవరో పరమ ఆత్మీయు లని కల్సుకున్నట్లుగా, సంతోషానుభూతిని పొందాను. ఆ అనుభూతి అ నిర్వచనీయ మైనది. చెప్పడానికి వీలుపడదు. ఆ సంఘ టన అలా జరిగి, అనుభవించినవారికే తెలు స్తుంది.

అప్పుడు ప్రేమతో 'లేమ్మా! లే, ఇంకా నయం కొంచెంసేపట్లో ముందుకి పడి పోయే దానివి! నిండుమనిషివి కూడా!' అని అన్నాను.

ఆమె మెల్లిగాలేచి నిలబడి 'అయ్యో! అక్కయ్యగారు, మీ మీ ద పడిపోయానా!' అంది ఎంతో నొచ్చుకుంటూ.

'ఏం ఫరవాలేదమ్మా! నీవు నామీదేమీ పడలేదు. నేనే పట్టుకున్నాను.' అన్నాను. అందరం కలిసి ఇంట్లోకి దారితీశాము—

ఈ సంఘటన జరిగినది కొద్ది నిమిషాల సేపు మాత్రమే. కానీ మా ఇద్దర్నీ స్నేహ బంధంతో పెనవేసింది. ఆ తర్వాత ఇద్దరం ఎంతో మంచిస్నేహితులం, అతి సన్నిహి తులం అయిపోయినాము. మా స్నేహంఎంత వరకు వచ్చిందంటే, నన్ను ఆమె 'అక్కయ్యా' అనీ నేను ఆమెని 'ఆనందం' అని పిలిచేవరకు వచ్చిందన్న మాట!

## సుమ్మా నాకు...

ఆ భార్యాభర్త లిద్దర్నీచూస్తే నాకెంతో ముచ్చటవేసేది. తగినంత హోదా తెలివి కల్గిన ఆనందం, పొదుపుగా సంసారాన్ని గడుపుకుంటూ భర్తయందు ఎంతో అను రక్తి కల్గివుండేది. అతనూ అంతే. ఆనం దని ఎంతో ప్రేమ గా చూసుకునేవాడు. 'చక్కని దాంపత్యం!' అని అనుకునే దాన్ని.

ప్రతీ విషయం నాతో సంప్రదిస్తూ 'అక్కయ్యా, అక్కయ్యా!' అంటూ ఎంతో ఆప్యాయంగా, పల్కరిస్తూ, ప్రేమమూర్తి లాగావున్న ఆనందనిచూసి మురిసిపోయేదాన్ని. ఆనందం ఒకనాడు మాట్లాడుతూ హఠా త్తుగా, ఎంతో నీరసంగా 'అక్కయ్యా! ఇంత మంచిమనసువున్న నిన్ను ఆ భగవం తుడు ఎంత చిన్నచూపు చూస్తున్నాడు! వద్దు మొర్రోఅని ఏడిచేవాళ్లకి, తిండిపెట్ట లేక ఏడ్చేవాళ్లకి అమిత సంతానాన్ని, ఇస్తు న్నాడు...ఇంత సిరికల్గికూడా నట్టింట్లో చిలిపిగంతులు వేసేందుకు, చిన్నారిపాపల్ని లోటుచేశాడు ... పెండ్లయి ఇన్నేళ్లయినా, ఒక్కనలుసు కలుగక పో యె గ దా!' అని బాధతో వాపోయింది.

అప్పుడు నేను 'ఊ. పోనిస్తూ ... ఆ భగవంతుడుమాత్రం ఏం చేస్తాడు! నాకు విధాత ఈ విధంగా లిఖించాడు. అంతే ఆప్రకారం జరుగుతున్నది. ఎవరికర్మ ఫలి తాన్ని వారు అనుభవించ వద్దా! ఎంత పెట్టి పుట్టామో, అంతే అనుభవించాలి.' అని అన్నాను పైకిమాత్రం,

కానీ నన్ను అనుక్షణం పీడించే బాధే ఇది! చక్కగా బంగారు తల్లులవలే వున్న గర్భిణిస్త్రీలను చూచినపుడల్లా, నా మనస్సు బాధతో మూలిగేది. 'ఈ సమయమే కదా! స్త్రీకి విలువైనది...ఈ స్థానం చేరుకోలేని స్త్రీ జన్మ వ్యర్థమే!' అని బాధపడే దాన్ని. పండులాగావుండి, వెన్నెలవంటి బోసినవ్వు లను వెదజల్లే చిన్నారిపాపలని చూసి. నా హృదయం పుప్పొంగిపోయేది. పోయే ది ఏమిటీ ఇప్పటికీ అంతే,' ఆనందంవాళ్లు మా ఇంట్లోకివచ్చిన కొన్ని రోజులకి, ఒక నాడు వుదయం, నాకు తలనెప్పి వచ్చింది. మాత్ర వేసుకుని కాఫీత్రాగి, వంటఇంట్లో గోడకానుకుని కూర్చుని దొడ్లోకి చూస్తు న్నాను.

ఇంతలో ప్రక్కభాగంలోంచి మాటలు వినిపించాయి. అప్రయత్నంగా చెవులు ఆ మాటలను వినసాగాయి.

ఆనందం, భర్త మాట్లాడుకుంటు న్నారు. 'అదికాదు! అనూ, మనఇల్లుగలామెని అందరూ మధురమ్మగారనీ, ఆఫీసరుగారేమో, మధూ అని పిలుస్తారుకదా! ఇంతకి అసలు ఆవిడ పేరేమిటి!' అంటున్నాడు మూర్తి.

అందుకు 'ఆమె పూర్తిపేరు, 'మధురాం బిక' ఆవిడ నాన్నగారు మదురలో వుద్యోగం చేస్తుండగా, అక్కడే ఆమె పుట్టిందట. అందుకే ఆ పేరు పెట్టారు' అంది ఆనందం.

'హోహో! అలాగా అవునుకానీ, ఆనందూ, నువ్వు ఆవిడని ఏకవచనంతో పిలుస్తావు కదా! తప్పుకాదూ. ఎంత స్నేహమయితే మాత్రం, ఆమె వయస్సుకీ, ఆమెహోదాకి అన్నా నీవు గౌరవం ఇవ్వాలికదా!' అన్నాడు సన్నగా స్వరం తగ్గించి మూర్తి.

'అ, అలా అడగండి. అదా మీ సంశయం! ఆమె నాకంటే ఏమంత పెద్దదిగాదుకూడా, మహాఅయితే ఏనాలుగయిదేళ్లు పెద్దది కావచ్చు అంతే. ఇక హోదాసంగతి అంటారా ఆమెకి అలాంటి పట్టింపులేమీ లేవండీ. తాను భాగ్యవంతురాలిననీ, ఆఫీసరుగారి భార్యననీ, ఇంచుకైనా ఆమెలో గర్వం కను పించదండి! పైగా భర్తగారు ఆఫీసులో ఆఫీసరయితే, భార్య ఇరుగుపొరుగులవాళ్లతో తనగొప్ప ఎందుకు చూపించాలి అని అంటుం దామె. అందుకే నేను ఆమెను ఎంతో ఆప్యాయంగా అక్కయ్య అని పిలుస్తాను. అలా పిలిస్తే ఆమె ఎంతో సంతోషిస్తుంది కూడా! ఆమెని చూస్తే ఏమిటో అవ్యాజమైన ప్రేమ నాలోపొంగి పొర్లు తుంది మా ఇద్దరి మధ్యా ఇంత కొద్ది కాలంలోనే, ఏమిటో ఇంతటి అనురాగ బంధం ఏర్పడింది...దైవలీల!' అని అంది ఆనందం.

నాకు ఆమె ముఖం కన్పించటం లేదు కానీ, ఆనందం మొఖంలో అప్పుడు ఎంతటి ప్రేమవాహిని పొంగి పొర్లిందో నేను వూహించగలను...అటువంటి నిర్మల స్నేహ మూర్తి ఆనందం. ఆమె మనస్సు అంత మంచిది. అంత చల్లనిది...

ఆనందం వాళ్లు మా ఇంటికివచ్చి అప్పుడే రెండు నెలలు గిర్రున తిరిగిపోయినాయి.

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి

వివా త్రాగండి—వేడిగా లేక చల్లగా, పగలో లేక రాత్రి! మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో పుష్టివంతముగా చేయబడినదే వివా. అది స్నాయువులను బలపరుస్తుంది, నరములకు ఉపశమనమును కలిగిస్తుంది, కండరములకు సేదదీరుస్తుంది.

ప్రొద్దున్న వివా త్రాగితే రోజంతా ఉత్సాహముగా ఉంటారు! రాత్రి వివా త్రాగితే గాఢముగా నిద్రపడుతుంది! వివా సులభముగా జీర్ణమవుతుంది. అది రోగులకు, రోగము నుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సు చేయబడినది.

**రుచిగా ఉంటుంది కమ్మగా—**
**జీర్ణమవుతుంది త్వరగా!**







భారతదేశములో తయారుచేయువారు:
జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్
సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
హోమ్ ప్రొడక్ట్స్ మార్కెటింగ్ ఏజెన్సీ

# నువ్వే నాకు...

ఆనందానికి తొమ్మిది నెలలు పూర్తిగా నిండినాయి...నిండుగా, బరువుగా నడిచే ఆనందాన్నిచూసి, ఎందుకో నా మనస్సు పరవశించేది. అద్భుతమైన అనుభూతి పొందేదాన్ని!

ఒకనాడు తెల్లవారుఝామున, మూర్తి మా భాగంవైపుకి వచ్చి మా పడకగది కిటికీ వద్ద నిలబడి 'సార్! సార్' అని పిలిచేడు.

నాకు మెలకువవచ్చి వారితో 'ఏమండీ! ఎందుకో మూర్తి...అదే ఆనందం భర్త మిమ్మల్ని పిలుస్తున్నాడు.' అంటూ ఆయన్ని లేపాను.

ఆయన లేచివెళ్ళి, మూర్తితో కాసేపు మాట్లాడివచ్చి నాతో, 'వూ, లేలే. ఇంకా ఏం పడుకుంటావు, నీ ఆనందానికి కొడుకో కూతురో పుట్టబోతున్నారు. పదపద. పాపం మూర్తి, సహాయం రమ్మంటున్నాడు' అన్నారు.

నాకు ఎక్కడలేని కంగారు పుట్టింది. అమాంతం లేచివెళ్ళి ఆనంద దగ్గిర వాలాను. నన్నుచూసి 'అక్కయ్యా! ఏమిటో బాధగా వుంది' అన్నది కళ్ళనిండా నీళ్ళు నింపుకుని ఆనందం. నేను 'ఏం ఫర్వాలేదమ్మా!' అని పైకి ధైర్యంచెప్పాను. కానీ, నా గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి.

ఇంతలో మూర్తి టాక్సీ తీసుకుని వచ్చాడు, నేనూ ఆనందం వెనక సీట్లో కూర్చున్నాం, ముందు మూర్తి కూర్చున్నాడు. ఆస్పత్రికి అరగంటలో చేరుకున్నాం ...జరగవలసిన కార్యక్రమాలన్నీ జరిగినాయి. నేనూ,మూర్తీ బయట ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, వినబోయే వార్తకై ఎదురు చూస్తూ కూర్చున్నాం...

తెల తెలవారుతూ వుండగా, సూర్యోదయంతోపాటు ఆనందానికి పుత్రికోదయం కూడా అయింది.

మా మనస్సులు కదుటపడ్డాయి. గంపెడు సంతోషంతో ఇల్లుచేరుకుని, మా వారికి శుభవార్త అందించాను.

ఆ నాటినుండీ తల్లీ పిల్లా ఇల్లు చేరే వరకూ, రోజూ ఆనందానికి కావల్సినవన్నీ నేనే సమకూర్చేదాన్ని. మూర్తి ఎంతో బాధ పడుతూ, 'ఎందుకండీ మీకీ శ్రమ' అని అనేవాడు. కానీ, నాకు ఆమెకు సపర్యలు చేయటం శ్రమ అనిపించేది కాదు. ఏదో తెలియని ఆత్మీయతా, అనురాగం, నన్ను అలా చేయించేది. ఆనందం, ఎంతో సంతోషంతో మురిసిపోతూ బంగారపు బొమ్మలాగావున్న ఆ చిన్నారి పసికందుని ఎత్తుకోమని నాకు అందించేది.

ఆ పసిగుడ్డుని పొత్తిళ్ళలో పొదివి పట్టుకుని, నా హృదయానికి హత్తుకుని, ఎనలేని మధురానుభూతిని పొందేదాన్ని.

ఆనందంతల్లి యిదురోజుల తర్వాత వచ్చింది. కానీ, పాపం ఆపిడ వృద్ధురాలు. అందుకని, పురిటినీళ్ళుపోసి, ఆ తర్వాత ఒక నెలో నెలా పదిహేనురోజులో వుండి వెళ్ళిపోయింది.

ఆనందం పనిపాటలు చేసుకునేటప్పుడు, బాలింతరాలుకదా అని, నేను సాయం చేస్తానంటే, నన్ను వద్దనేది, చెయ్యనివ్వకుండా పైన 'అక్కా! నీకు అంతగా నేను అలసిపోతానని భయమయితే, నా పసిదాన్ని నీకు అప్పగిస్తా. దాన్నిచూసుకో!' అనేది చిన్నగా నవ్వుతూ.

అప్పటినుంచీ, ఆనందం పనిపాటలు చేసుకుంటూ పిల్ల ఏడుస్తుంటే, నా దగ్గర పడుకోబెట్టి వెళ్లేది. ఆనందం వంటపనీ ముగించుకుని భర్తని ఆఫీసుకిపంపి నా దగ్గిరకి వచ్చేలోపల నేను పాపకినీళ్ళుపోసి,పౌడరు పూసి, బొట్టూ కాటుకపెట్టి, గౌను తొడిగి ఆడిస్తూ వుండేదాన్ని, ఆ తర్వాత ఆనందంవచ్చి పాలిచ్చి నిద్రబుచ్చేది.

ఈ విధంగా పాపాయి, దాదాపు నాదగ్గిరే ఎక్కువగా వుండేది. నాకూ కొంత కాలక్షేపంగా వుండేది. పాపాయికి చేసే సపర్యలు నాకు ఒక వింతను భూతిని కల్గించేవి... అందుకే ఆనందంకూడా పాపని నాదగ్గర కావాలనే ఎక్కువగా అట్టేపెట్టేది...

వారు దత్తాత్రేయుని భక్తులు. అందుకని పాపకి దత్తకుమారిఅని పేరుపెట్టారు అందరం దత్తు అని పిలిచేవాళ్ళం. ఈ విధంగా రోజులు, ప్రశాంతంగా, హాయిగా గడుస్తున్నాయి...

నా దగ్గిర దత్తు ఎంతగా అలవాటయిందంటే...నాకే ఆశ్చర్యమేస్తుంది ఆ సంఘటన గుర్తుకివస్తే! దత్తుకి పదినెలలు వచ్చాయి. ఒకసారి మేము అంటే ఆయనా నేనూ పనివుండి మా స్వంతవూరు వెళ్ళి పదిహేను రోజులకి వచ్చాం. ఇంటి కొచ్చేసరికి దత్తుకి వారంరోజులనుంచీ జ్వరంగా వుందని ఆనందం చెప్పింది.

'నా గుండెలు దడ దడ లాడిపోయినాయి. వెంటనే దత్తుదగ్గిరకి వెళ్ళిచూశాను. జ్వరం పేలిపోతున్నది. కళ్ళు మూతవేసుకుని, అచేతనంగా పడివున్న దత్తునిచూసి కన్నతల్లి కంటే ఎక్కువగా తల్లడిల్లి పోయాను. బాధగా 'దత్తూ! దత్తూ! నేవచ్చానమ్మా, నన్నుచూడు తల్లీ!' అన్నాను పొర్లుకువచ్చే దుఃఖంతో నాగొంతుక పూడిపోయి, స్వరం జీరపోయింది...ఒక రెండు నిమిషాలాగి మళ్ళీ పిలిచాను...

అంతే, వెంటనే మెల్లిగా కదిలింది దత్తు, మరో నిమిషానికి కళ్ళు చటుక్కున తెరచింది, నన్నుచూసి 'మా...మా...వూ' అని ఏడవసాగింది.

'నా బంగారు దత్తూ! ఏడవకమ్మా! రా, నా దగ్గిరకి రామ్మా!' అని చేతులు చాచాను. నీరసంతో ఒరిగిపోతూ, నా చేతుల్లోకి వాలింది. రెండు చేతుల్లోనూ పొదువుకుని, నా హృదయానికి గట్టిగా అదుముకుని ముద్దు పెట్టుకున్నాను. ఒళ్ళు కణకణ లాడిపోతోంది. నాకు భయంతో ఒళ్ళంతా ఒణికిపోయింది. నా 'దత్తూ, దత్తూ' అని దత్తు బుగ్గలన్నీ ముద్దులతో ముంచెత్తాను.

రెండు రాత్రుళ్ళు, నా ప్రక్కలోనే పడుకోబెట్టుకుని 'దత్తూ,' అని పలకరిస్తూ ఆడిస్తూ, మందులు, పాలు అన్నీ పోసేదాన్ని. ఇలా మరో రెండురోజులు గడిచినాయి. నేనువచ్చిన అయిదురోజులకి అంత జ్వరమూ మటుమాయమయి పోయింది. చక్కగాలేచి ఆడి పాడి తిరగసాగింది.

అదిచూసి అందరం నవ్వుకున్నాం, 'నీ మీద బెంగతోనే ఇలా జ్వరపడి పోయింది. చూడక్కా! నీదగ్గిర దీనికెంత చనువు ఏర్పడిపోయిందో!' ఆనందం మాటలకి నేను ఎంతో పొంగిపోయేను ...

ఆ తర్వాత, ఏమిటీ అనుబంధం ... దత్తుకి, నాకూ ఎందుకీ సంబంధం ... అంతా వింతగావుంది! ఏనాటిదో ఈ అనురాగబంధం...అంతా దైవమాయకదా! అని అనుకునేదాన్ని. అంత ఇదిగా నా దగ్గిర అలవాటయిపోయింది దత్తు ... నా చిట్టితల్లి, చిన్నారిదత్తు.

కాలం గడిచిపోయింది, అతి త్వరగా.

దత్తుకి ఏడాదివెళ్ళింది ... బుడి బుడి నడకలతోనూ, చిట్టి చిట్టి మాటలతోనూ మా అందరి మనస్సులనూ సంతోషంలో ముంచెత్తేది, ముఖ్యంగా నన్ను ఎన్నో మధుర స్మృతులతో వోలలాడించేది. ఎన్నో ఎన్నో వెలలేని వింతాను భూతులను పల్కించేది నాకు...

కాలం ఒక్కరీతిగా గడువదని అందరికీ తెలుసు. అనంతమైన ప్రకృతికే వెలుగు నీడలు తప్పలేదు...మానవ జీవితాలకికూడా, కష్టసుఖాలు తప్పవుగదా!

వున్నట్టుండి ఒకనాటి సాయంకాలం ఆనందుకి కొద్దిగా తలనెప్పిగావుంది అంది. సాయంత్రందాకా బాగా తిరిగి పనిపాటలు చేసుకున్న ఆనందం, ఆ రాత్రికి కొద్దిగా ఇబ్బందికంగా, పడుకుంది. తెల్లవారుఝానుకి జ్వరంవచ్చింది, ఆ జ్వరం టైఫాయిడ్‌క్రిందకిమారి, నెలరోజులకి తగ్గింది...

ఈ నెలరోజులూ, దత్తుకి పాలుపోళ్ళు పోసి చూస్తూ, ఆనందుకి నాశక్తిననపర్యము చేశాను. నామొరలు భగవంతుడు విని, ఆనందుకి జ్వరం తగ్గించాడుకదా! గడిచి గట్టెక్కాము అని సంతోషించేను. ఇక రెండు రోజులకి పత్యం పెడదామనుకుంటూ వుండగా, మళ్ళీ ఆనందుకి ఆ రోజు రాత్రి జ్వరం తిరగబెట్టింది. అది డబుల్ టైఫాయిడ్‌గా వచ్చిందని డాక్టరు అన్నాడు...

పదిహేను రోజులు తిరిగేసరికి అంతా సాంతమయిపోయింది. హఠాత్తుగా ఒకనాటి తెల్లవారు ఝామున టెంపరేచరు తగ్గిపోయింది. చలునలు క్రమ్మి, ఆనందం నాకు లేకుండా, కాదు కాదు... మూర్తి గారికి లేకుండా...ఊహూ కాదు...దత్తుకి, చిన్నారి దత్తుకి లేకుండా, ఎక్కడికో, దత్తుకి, ఇంకెవ్వరికీ కనిపించని, సుదూరతీరాలకు, ఏదో తెలియని లోకాలకు వెళ్ళి పోయింది

నమ్మలేని ఈ నిజాన్ని చూస్తూ, చూస్తూ ఎలా నమ్మకుండా వుండగలను. నా మనస్సు అంతా అయోమయిపోయింది. నాలోని ఆలోచనలన్నీ, దత్తుపై కేంద్రీకరింపబడి పోయినాయి. ఆ చిన్నారి మోము లోని అమాయికత చూసి, నా కళ్ళు చెమ్మగిల్లేని...కానీ ఏం చేయగలను? దత్తుకి నేనేమీ సహాయం చేయలేని, నిస్సహాయురాలిగా నిలబడి పోయాను.

యదావిదిగా బంధువులొచ్చారు. వోదా

**గ మ ని క**

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ క్రింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥



# నువ్వు నాకు...

ర్చారు. సముదాయించారు. అన్నీ అయినాయి... దత్తుని వెంటబెట్టుకుని ఆనందం తల్లి తమ వూరికి వెళ్లి పోయింది. ఈ ఘోరమైన దుస్సంఘటన జరిగిన తర్వాత ఎన్నో రోజులకి గానీ, మొద్దుబారి పోయిన నా హృదయం తిరిగి చైతన్యంలోకి రాలేదు. ఆనందుని మర్చిపోదామని ఎన్నో విఫల ప్రయత్నాలు చేశాను. కానీ ... మ రు వ లే క పోయాను...ఎక్కడున్నా ఏమి చేస్తున్నా, నా ఆనందు ప్రతిబింబం నవ్వుతూ నా ముందు నిలబడేది...ఎలా మరిచిపోవాలో నాకు తోచక, నా పరిస్థితి అయోమయంగా వుండేది ... అలాంటి పరిస్థితిలోనే ఏదో సంఘటన జరిగింది.

ఇంట్లో వంటరిగా మూర్తిగారు వండుకుని తింటున్నారు ఏ బంధు ప్రముఖుని ఆదేశానుసారంగానో మూర్తిగారు తిరిగి రెండో వివాహం చేసుకున్నారు. ఆనందం చనిపోయిన ఆరునెల కల్లా, ఆమె స్థానాన్ని సువర్చల ఆక్రమించుకుంది.

ఎంత చిత్రం! ఏమిటీ ఘోరం, మూర్తిగారు అప్పుడే ఆనందుని మర్చిపోయారా! లేక, పరిస్థితుల ప్రాబల్యం వల్ల, జీవితగమనం సాగించటానికి తోడు కావాలిగదా! అందుకేనా భార్య...అందుకేనా ఈ అనుబంధం.' నాకు పరిపరివిధాల బాధాపూరితమయి పోయింది.

ఏమిటీ సృష్టి వైచిత్ర్యం! ఈ మాయ ప్రపంచంలో స్త్రీ అనే పాత్ర, ఎన్నివేషధారణలు చేసి, ఎన్ని రకాల జీవితాన్ని గడుపుతుంది...తల్లి, కూతురు, అత్త, వదిన, ఆడబిడ్డ, కోడలు, ఇంకా అనేక బంధుత్వపుపేర్లు ... అవన్నీ గాక సవతి తల్లిగా, ఇంకా ... ఎన్నిరకాలు, ఎన్నెన్ని భావానుబంధాలు...ఆహా! దేముడు లేడనే వారికి ఇవన్నీ దైవలీలలు అని అనిపించవు కాబోలు...కాకపోతే మరి ఈ నాటకాన్ని ఎవరు నడిపిస్తున్నారు...దేముడున్నాడు ... ముమ్మాటికీ వున్నాడు...వాడులేనిదే ఈ ప్రపంచమే లేదు...

అయినా, కూడా, ఏ వ్యక్తి అయినా, ఏ వస్తువు పోగొట్టుకున్నా జీవితంలో తిరిగి ఆ వస్తువును అదృష్టవశాన పొందవచ్చు ... కానీ, తల్లిని పోగొట్టుకున్న నిర్భాగ్యులకి మళ్ళీ ఆ వెలలేని అమూల్య వస్తువు లభ్యమవదు. అది మాత్రం తథ్యం ... అందుకేకదా! లోకంలో అన్నిటి కంటే విలువైనది తల్లి. అంటారు తల్లి ప్రేమకు సాటి ఏముందిజగత్తులో!'

మూర్తిగారికి ఆరునెలలకల్లా భార్య వచ్చింది...కానీ, 'దత్తుకి తల్లి ... దత్తుకి తల్లి ఏదీ? ఎక్కడి నుంచి వస్తుంది?... రాదు. అందుకే తల్లిప్రేమ ... అపుమ ... కానీ, మరి నాకూ పిల్లలులేని క్షోభ, నా కడుపుని తరిగిపోస్తుంది. దాన్నెవరు తీరుస్తారు? తల్లికి పిల్లలు లేకున్నా, పిల్లలకి తల్లి లేకున్నా ... ఒకటే బాధ ... ఊహూ, కానేకాదు...ఒకటి ఎలా అవుతుంది. నాకు పిల్లలు కల్గితే పిల్లవచ్చు...కానీ, దత్తుకి, ఆనందు రాదుగా! అవును...రాదు...నిజమే!' అని అనుకుంటూ ఏమిటో పిచ్చి పిచ్చి ఆలోచనలు, అర్థం లేని ఆవేశంతో నా హృదయం బరువెక్కిపోయేది...

సువర్చల కాపురానికి వచ్చి, ఆరునెలలయింది. కాని ఒక్కనాడన్నా మాటా మంచీ లేదు. అసలు నేను ఇంట్లో వున్నానని గమనించేదికాదు. అసలుకి ఆమెకి 'హస్తిమశకాంతరం' అన్న తేడా వుంది. ఏమిటో ఆమె స్వభావం మరి?...సరే...కొన్ని రోజులకి అంటే రెండు నెలల క్రిందట, అత్త వారింటి నుండి దత్తుని తీసుకుని మూర్తిగారు వచ్చేరు. అమ్మమ్మగారు పోషించటం ఆయనకు ఇష్టంలేక తీసుకుని వచ్చారట. ఇక అసలు సిసలయిన యుద్ధం అప్పటి నుండి ప్రారంభమయింది, సువర్చలకి దత్తుని చూస్తే గిట్టదు. ఆ చిన్నారి చిలిపి మోముని చూసినా ఆమె స్త్రీ హృదయం కదిలేదికాదు. ఎప్పుడూ కసరటం, తిట్టటం, కొట్టటం చేస్తోందిప్పుడు సువర్చల.

ఇలాంటి సవతి తల్లులుండబట్టే, సవతి తల్లి అనేపేరు అంత క్రూరంగా వినిపిస్తుంది. బహుశా ఎక్కడన్నా మాటికొక్కరు సహృదయులైన సవతి తల్లులున్నా...వారిని కూడా నమ్మడం చాలా కష్టం! అందుకే అని నాకనిపిస్తుంది.

ఈ విధంగా రోజులు గడుస్తున్నాయి... నా దగ్గిరకి కూడా దత్తుని రానీయకుండా కట్టుదిట్టాలు చేసింది సువర్చల. ఎందుకో, ఆమెకేమి లాభిస్తుందో, నాకు మాత్రం

తెలియడం. కానీ ఆమె మాత్రం దత్తుని నానా హింసలు పెట్టి చండశాసనం వెలిగిస్తోంది...

దత్తుని చూడకుండా వుండలేకా, దత్తు పడే బాధలు చూడలేకా, దత్తు యొక్క దీనాతిదీనమైన ఏడుపులు వినలేక, వారిని ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపొమ్మని చెప్పమని మా వారికి ఎన్నోసార్లు చెప్పాను. కానీ ఆయన అకారణంగా మూర్తిని ఎలా ఖాళీ చేయమని చెప్పను...పాపం, అతను చాలా మంచివాడు. నాకు చెప్పడానికి మనస్సు వప్పటం లేదని, ఆయన అనేవారు. నేను ఏమీ చేయలేక అలాగే బాధపడేదాన్ని...బా ధ ప డు తు నే వున్నాను...కానీ ఏం చేయగలను?...

ఈ విధంగా రెండు సంవత్సరాల వెనక్కి పరిగెత్తిన నా ఆలోచనలన్నిటికీ, ఒక్కసారి కళ్ళెంవేసి ముందుకి లాగి మనస్సుని స్థిర పరుచుకోవాలని ప్రయత్నించాను. గతంలోని ఆనందం జ్ఞాపకాలను, వర్తమానంలోని సువర్చల ప్రవర్తననూ, భవిష్యత్‌లోని దత్తు జీవితగమనాన్ని తలచుకుని, ఆలోచించుతూ, వూహిస్తూ...ఇంకా ఏమిటో చెప్పలేని ఆవేదన అనుభవిస్తూ బాధగా కళ్ళు రెండూ గట్టిగా మూసుకున్నాను...

ఇంతలో పొద్దువాటారింది కాబోలు, ఎండ తీవ్రత తగ్గింది.

ఇందాకటినుండీ నాకు ఈ ఆలోచనా పరంపరలో దత్తు ఏడుపు సరిగ్గా నా మనస్సుకి నాటుకోలేదు. కానీ, దత్తు ఏడవటం ఆపలేదు. ఇంకా ఏడుస్తూనే వుంది. మధ్య మధ్య ఆయాసం వచ్చి ఆగి ఆగి, వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఆ ఏడుపు వింటూంటె నా మనస్సు ఆర్ద్రమైపోతోంది. సాయంత్రం అయిదు గంటలయింది.

మూర్తిగారు వచ్చిన సందడి వినబడింది. 'ఎందుకు దత్తు ఏడుస్తోంది?' అన్నాడు సువర్చల నుద్దేశించి.

వెంటనే తారస్థాయిలో గొంతుని పెంచి, 'నిన్నటినుంచీ జ్వరంగా వుంది కదా! బయటికి పోవద్దు, ఇంట్లో కూచోమని కొప్పడ్డాను...అంతే అప్పట్నించీ ఏడుస్తూ కూచుంది.' అంది సువర్చల. దత్తు మీద ఆమెకున్న కసి అంతా ఆమె గొంతులోనే ప్రతిధ్వనించింది.

అది విని, దత్తుని కాసేపు సముదాయించి, ఆడించి మళ్ళీ ఎక్కడికో వెళ్ళినట్లున్నాడు మూర్తి. తండ్రి వెళ్ళగానే మళ్ళీ ఏడుపు ప్రారంభించింది దత్తు.

'అమ్మ...కావాలీ...కావాలి!' అని ఏడుస్తోంది.

దాంతో సువర్చల అమాంతం వచ్చి, 'ఏమిటే అమ్మ కావాలి? కావలిస్తే, పో మీ అమ్మ దగ్గిరకే పో!' అని గద్దించి తిట్టి, ఇంకా పైన ఆ చిన్నారి లేత వీపుపైన, చెళ్ళు చెళ్ళన నాల్గు దెబ్బలేసింది. కఠినంగా సువర్చల కొట్టిన దెబ్బలకి తాళలేక, దత్తు ఎలుగెత్తి ఏడ్వటం మొదలెట్టింది.

ఆ మాటలు విన్న నా హృదయం తరుక్కుపోయింది. దత్తు వీపు మీద పడ్డ దెబ్బల చప్పుడు నాకు కూడా వినిపించింది. నా గుండెల్లో సమ్మెటలుపెట్టి కొట్టినట్లుగా బాధతో మెలికలు తిరిగిపోయాను. నాకు ఎక్కడలేని దుఃఖం ముంచుకొచ్చింది. ఒక్కసారిగా భోరున ఏడ్చేసాను. అమాంతం దత్తుని తెచ్చుకుని నా హృదయానికి హత్తుకుని, దత్తుని వూరడించాలని, ఎంతో ఆతురతపడ్డాను...కానీ సువర్చల జ్ఞాపకానికి వచ్చి, ఆమెచేత అవమానం పొందవలసి వస్తుందని, ముందుకి అడుగు వేయలేక పోయాను. అంత దుఃఖాన్ని దిగమింగుకుని, నాలో నేనే కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ అలాగే పడుకుని నిద్రపోయాను...

ఆయన రాత్రి అయినాక, ఎప్పుడు వచ్చారో నాకు తెలియదు. భోజనాలు ఇద్దరం చేయలేదు. ఆయనా పడుకుని నిద్రపోతున్నారు. నిద్రపోతున్న నన్ను లేపటం ఇష్టంలేక అలా ఆయనా పడుకుని వుంటారు. 'అయ్యో పాపం! ఇలా మొద్దు నిద్రపోయానేమిటే...' అని అనుకుంటూ ఏడు గంటలప్రాంతాల పడుకున్న నాకు మెలకువ వచ్చి చూసేసరికి టైము పదిన్నర దాటుతోంది.

ఇంతలో...

మా గది కిటికీ దగ్గరున్న పూల కుండీల దగ్గర ఏదో చప్పుడయింది. ఏమిటో చూద్దామని, బ్యాటరీ చేతపుచ్చుకుని, లేచివెళ్ళి చూ శా ను. అంతే! ... దిగ్భ్రాంతురాలి నయ్యాను. నేను చూసేది నిజమా! కాదా! అని క్షణంసేపు నమ్మలేక పోయాను. వెంటనే తెప్పరిల్లి మరి కొస్త దగ్గిరకి వెళ్ళిచూశాను.

ఒక పూలచెట్టుక్రింద పడుకుని వుంది దత్తు. మధ్య మధ్య నిద్రలో 'అమ్మా, అమ్మా!' అని కలవరిస్తోంది. పగలంతా ఏడిచి ఏడిచివున్న దత్తుకి ఇంకా వెక్కిళ్ళు వస్తూనే వున్నాయి. మాటి మాటికీ నాలుకతో పెదిమలు తడుపుకుంటోంది.

ఆ దృశ్యంచూసి నా మనస్సు నీరయిపోయింది. నాకు విపరీతమైన ఏడుపు పొర్లు

(52 వ పేజీ చూడండి)

### పి. యు. కరీచేడు

**మీతో కలం స్నేహం చేయాలని ఉంది లక్ష్మిగారూ అంగీకరిస్తారా?**

మై గాడ్. అంగీకరిస్తే అటు ఖర్గపూరు నుంచి శ్యామలారాణి ఇటు ఛత్రపూరునుంచి రామలక్ష్మి, ఇటు హైదాబాదునుంచి కళావతి అటు బెజవాడ నుంచి సీతాదేవి— ఇంకా స్టేట్సు నుంచి కోమల, విజయలక్ష్మి, సర్వలక్ష్మి, విజ్జీ— వీళ్ళంతా కలిసి ఎంతధైర్యం, మాకు జవాబు రాయడానికి దిక్కులేదుగాని నీ ముఖానికో కలం స్నేహాలూఅంటూ హుంకరిస్తారు. సారీ సోదరీ. వీళ్ళందరి పర్మిషన్ తీసుకుని అప్పుడు చెప్తాను. సరేనా?

### కె. కె. కె చీరాల

**...సోడాబుడ్డి అని నిక్‌నేమ్‌తో పిలుస్తారు...కాంటాక్టు అద్దాలు పెట్టారని విన్నాను...**

ఎవరో పేర్లు పెట్టారని భయపడితే ఎలా చిట్టితల్లీ. నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు అని తోసి పారేయాలి. ఏ ప్రముఖ పట్నంలో పెద్ద కళ్ళడాక్టరైనా కాంటాక్టు అద్దాలు పెట్టించ కల్గుతారు.

### టి. వి. ఎల్, తెనాలి

**ఈ పది సంవత్సరాలు ఆత్మాభిమానం చంపుకొని బతుకున్నాను. నాకు విముక్తి కావాలి—వార్ధాలో బాబాజీ నిర్మించిన ఆశ్రమం ఒకటి ఉందని విన్నాను.**

సబర్మతీ ఆశ్రం. వార్ధా. అని వ్రాయండి.

### ఎస్ ఎస్. కె పి. చిట్యాల్

**కుండలుచేసే కుమ్మరి గొప్పవాడా? అతనిచేతిలో కుండగా తయారయ్యే మట్టి గొప్పనా? జవాబు తప్పదను కుంటాను.**

కుమ్మరి లేకపోతే మట్టి మట్టిగానే ఉంటుంది. మరి కుమ్మరే గొప్పవాడు అనాలి.

### ఎ. వి. ఆర్. నారాయణపురం

**మీరు మీ భర్తగారితో ఎప్పుడైనా కలహం తెచ్చుకున్నారా?**

రోజూ ఉండేదే అది!




### బి. వి జి. కె, బోధన్

**ధనవంతునికి సామాన్య మానవునికి వ్యక్తిత్వంలో తేడా ఏమిటి?**

పరిస్థితులకి తలవంచి వ్యక్తిత్వాన్ని అప్పుడప్పుడు మరిచి పోతాడు సామాన్యుడు. ధనం ఉంటే కొనేస్తాడు ధనికుడు.

### సి ఎస్. ఆర్, హైద్రాబాదు

**మానవులందరు తినకుండా బ్రతుక కల్గుతారు అనుకొందాం. అప్పుడు వారి చర్యలు ఎలా ఉంటాయి. తెలుపండి. తేలికగా తీసుకోకుండా ఆలోచించి సమాధానం ఇవ్వండి**

చిత్తం ఈ ప్రశ్నకి రెండు కేజీల తూకంరాయి కట్టి బదులిస్తున్నాను. నమ్మండి! తినకుండా బతకగల్గితే ఇక చర్యల అవసరం ఏమిటి? హాయిగా పడిఉండొచ్చు. తిండి కోసమే కదా పడే పాటంతా!

### ఎమ్. ఎన్. ఎమ్, ఏటికొప్పాక

**రచనచేసి చిత్రపరిశ్రమలో ప్రవేశించారు కొంపతీసి వెండితెరపై ఇకపై...**

వస్తా. భయం లేదు. వైడ్‌స్క్రీను రానీయ్. అప్పుడు భయపడ్డం ప్రారంభిద్దువు గాని!

### ఐ. డి. ఆర్. బుచ్చిరెడ్డిపాలెం

**అచ్చు తప్పులనుకూడ రచయితల తప్పులు క్రింద పరిగణించే మన విమర్శక మహాశయులను ఏమనాలి?**

ఎందుకనడం అదో దండుగ. విమర్శనంటే చీల్చి చెండాడడం అని కొందరనుకుంటే, తమతెలివి తేటలని ప్రదర్శించడం అని కొందరనుకుంటున్నారు. అదీకాదు ఇదీ కాదు— చేతికి చిక్కిన శత్రువు— వో వారు వారేయి అన్నట్టుంటారు కొందరు. వీరందరిమధ్య ఒకటో అరా మంచి విమర్శకులు నిలబడాలని చోటు కోసం ప్రయత్నిస్తున్నారు పాపం.

### ఎ. ఆర్, ఘంటశాల

**లంచం తీసుకోనడం తప్పు అంటారు ఎందుచేత?**

అందరూ చూడకూడదు కనుక తమ్ముడూ. రెండో కంటికి తెలియకుండా పుచ్చుకోవచ్చు. దొరికిపోకుండా నేర్పుగా ధన వస్తు వాహనాది రూపాలలో స్వీకరించవచ్చు. దొరికి పోతేనే సన్నాసి అనేస్తారు. జాగత్త.

### సి. యస్. ఆర్. అనంతపురం

**ఎవరండీ దారిన వెళుతున్నదీ అంటే నేనండీ తమ్ములుతిసేది అన్నాట్ట. కండకు లేని దురద కత్తిపీటకి ఎందుకు? అర్థం చేసుకోకుండా వ్యర్థంగా మాట్లాడే అప్రయోజకుల నేమనాలి మేడమ్?**

ఎవరిమీద ఈ కోపం రావుగారూ, అలా ముక్కుమీన కోపం ఉంటే ఎలా బతకగలరు చెప్పండి. కోపంతో మండిపడిపోతూ పనికొస్తే ఏపనీ చెయ్యకూడదు. మేం ఆడవాళ్ళం అయితే ఆకోపం అంట్లు గిన్నెల మీదనో ఉతికే బట్టల మీగనో చూపించేస్తాం పిల్లలమీద చూపిస్తే వాళ్ళూరుకోరు! మీలాంటి వాళ్ళు అలా కాస్సేపు తిరిగి రావాలి. సిగరెట్టు కాలుస్తారా? ఒకటి అంటించి కాస్సేపు అటూ ఇటూ పచార్లు చేసి వచ్చి కూర్చోండి. మీకోపం మీకే సిల్లీగా తోస్తుంది. ఏ అప్రయోజకుడికో ఏదో అనడం ఎందుకు అని మీకే నవ్వొస్తుంది.

### ఎస్ బి హెచ్, హైద్రాబాదు

**క్రిస్మస్ వస్తోందనగా చాలాచోట్ల నక్షత్రాల్లాగా కాగితాలు చూస్తూంటాం. ఆ పండగకి నక్షత్రానికీగల సంబంధం ఏమిటి?**

మీకు తెలియక అడిగారో, సరదాకి అడిగారో గాని—నిశీధిలో ముగ్గురు రాజులకి దారి చూపి ముందుకు నడిపించింది— నక్షత్రమే. దాన్ని చూస్తూ సాగిన ముగ్గురు రాజులూ—అప్పుడే పుట్టిన ఏసుని చూడడం జరిగింది. అని క్రైస్తవులు చెప్తారు. ●




# రైలు మావయ్యో

ప్యాగేటి శివరామకృష్ణశాస్త్రి

రైలు మావయ్యొచ్చాడు; రైలు మావయ్యొచ్చాడంటూ ఇల్లు చేరుకున్నాడో లేదో శ్రీనివాసులు వెంటపడ్డాడు పాపిగాడు.

శ్రీనివాసులు నెమ్మదిగా తాళంతీసి గదిలో ప్రవేశించాడు. పాపిగాడు వెంట లోపలకు వెళ్లాడు, మావయ్యా మావయ్యా అంటూ.

శ్రీనివాసులు జేబులోనుంచి ఒక పెప్పర మింట్ తీసి పాపిగాడికిచ్చి 'ఒరేయ్, పోయి ఆడుకో' అన్నాడు.

నిజానికి వాడువెళ్లి ఆడుకోడు. మిట్ట మధ్యాహ్నం. బైట ఎండ మండిపోతోంది. అసలు మామూలుగాకూడా వాడితో ఆడుకో డానికి ఎవ్వరూ రారు.

ఆ సంగతి శ్రీనివాసులుకు తెలుసు. తాను స్టేషనులో పాసింజెరు ట్రయిన్స్ చూసు కొని హోటలులో భోజనంచేసి ఎండలో వచ్చాడు. కొంచెంసేపు ప్రశాంతంగా పడు క్కోవాలని పాపిగాణ్ని నెమ్మదిగా పంపించి వేసాడు. లేకపోతే వాడు అదీ ఇదీ మాట్లా డుతూ అక్కడనుంచి కదలడు.

శ్రీనివాసులు తలుపువేసి పక్కవిప్పుకుని ఒక్క డ్రాయరుతో స్వేచ్ఛగా పడుక్కు న్నాడు ఫాన్ ఆన్‌చేసి. గాలికూడా వేడిగా వేస్తోంది.

వెంకట్రామయ్యకు అరడజను పైగా పిల్లలున్నా ఈ పాపిగాడు మాత్రం శ్రీని వాసులును పట్టుకుని వదలడు.

ఎప్పుడు ఇంటికి వచ్చినా రైలుమావ య్యంటూ వెంటబడతాడు—ఏ రెండో ఆట సినిమాకో వెళ్లి అర్ధరాత్రి వస్తే తప్ప.

శ్రీనివాసులుకు పిల్లలంటే పెద్ద ఆప్యాయ తేమీ లేదు. బొద్దుగా అందంగా ఉన్న పిల్లల్నయితే మర్యాదకు కొంచెం పలక రిస్తాడు. ఆప్యాయత కనబరుస్తాడు. అంతే.

నల్లగా బక్కగా కొంచెం పొట్టతో ఉన్న పాపిగాడంటే ఎవరికైనా ఆప్యాయత కలగడం కష్టం. వాడి వయస్సు మూడు సంవత్సరా లనిపించినా నాలుగైదు సంవత్సరాలుండవచ్చు.

వెంకట్రామయ్య వూళ్లో రెండు చోట్ల చిట్టా ఆవర్జాలు వ్రాస్తాడు. రెండుచోట్ల కలిపి నూరు రూపాయిలు వస్తాయి.

ఆయన పెద్దకుమారుడు ఎక్కడో కొండ లపై ప్రాజెక్టులో గుమాస్తాగా పనిచేస్తూ ప్రతినెల తండ్రికి ముప్పై రూపాయిలు పంపుతాడు.

మొత్తం నూటముప్పై రూపాయిలతో

# రైలు మావయ్యా

ఆయన, భార్య, పిల్లలు; వెరశి ఎనిమిది మందిపైగా జనం నాలుగవ ప్రణాళికా కాలంలో బ్రతకాలని తెలిసినప్పుడు పాపిగాడు బక్కగా ఉన్నాడన్నా, కొంచెం పొట్ట వచ్చిందన్నా ఆశ్చర్యం వేయదు.

పాపిగాడంటే శ్రీనివాసులుకు చిరాకుగానే ఉండేది. ఐనా వాడు తనకూడా తిరుగుతూనే ఉండేవాడు. కొన్ని రోజులకు ఒక పెప్పరమింటుతో వాడినుండి విముక్తిని పొందే పద్ధతిని కనుక్కున్నాడు.

క్రమంగా వాడంటే ఆప్యాయత కలుగక పోయినా చిరాకు కొంచెం తగ్గింది.

వాడి మాటలు అమాయకంగాను ముద్దుగాను అనిపించాయి. రైలు గురించి ఇంజను గురించి గార్డు గురించి డ్రైవరు గురించి పచ్చజెండా ఎర్రజెండా గురించి ఇంజనులో నుంచి వచ్చే ఆవిరి గురించి పొగ గురించి వాడి ప్రశ్నలు, వాడి భావాలు ఒక్కొక్కప్పుడు ఆసక్తిగానే ఉండేవి.

వాడి మాటలు వినే వోపిక క్రమంగా పెరిగింది. జాలిలాంటిది కలగడం ప్రారంభించింది అనుకోవాలి, ఎందుచేతనంటే— రోజుకు ఒక పెప్పరమింటుతో ప్రారంభమైన వాడి ప్రాక్టీసు మూడునాలుగు పెప్పరమింట్లకు ఎగ్రబాకింది. అప్పుడప్పుడు శ్రీనివాసులు తెచ్చుకొనే పండ్లు వగైరాలలో వాటా సంపాదించేవాడు.

శ్రీనివాసులు లేచేసరికి రెండు దాటింది. మూడున్నరకు తిరిగి స్టేషనుకు పోవాలి. ఇంటియజమాని రామచంద్రయ్యకు అద్దె ఇచ్చి బైటకు పోదామనుకున్నాడు.

లేచి బైటకు వచ్చి తాళం వేసాడో లేదో 'మావయ్యా, నేనూ స్టేషనుకు రానా' అంటూ పాపిగాడు వచ్చాడు. మరొక పెప్పరమెంట్!

. రామచంద్రయ్య చిన్న ఉద్యోగం చేసి రిటైరైనా ఇల్లు పెద్దదే కట్టాడు.

తాను కాపురం వుంటూ, ఐదు చిన్న కుటుంబాలు, ముగ్గురు బ్రహ్మచారులు ఉండడానికి వీలుగా నిశితమైన వ్యాపార దృష్టితో ఆయన ఇల్లు కట్టించాడు.

వీరుకాక ఆవరణలో విడిగా ఉన్న తాటాకు పాకలో వెంకట్రామయ్య కుటుంబం ఉన్నది.

'నీదగ్గర అద్దె ఎక్కడకు పోతుందయ్యా, రైల్వే ఆఫీసరువి' అని శ్రీనివాసులుకు మెచ్చుకుని అద్దె తీసుకున్నాడు.

ఇంతలో పోస్టుమాన్ వీరన్న సైకిలు గంట మ్రోగింది.

దిగి లోపలకువస్తూ 'నిన్ననే వెంకట్రామయ్యగారికి మనిఆర్డరు వచ్చింది మీరింట్లో లేరుకదా, ఈవేళ వద్దామని వెళ్లిపోయాను' అన్నాడు.

'మంచిపని చేశావు' అని రామచంద్రయ్య వెనుక గుమ్మంవైపు వెళ్లి 'ఒరేయ్ పాపిగా, మీ నాన్నను రమ్మనరా, వీరన్నొచ్చాడు' అని కేకవేసాడు.

వెంకట్రామయ్య హుటాహుటి వచ్చిపడ్డాడు. 'రెండు రోజులుగా చూస్తున్నాను వీరన్నా' అన్నాడు.

'ఒహరోజు అటూ ఇటూ అవుతూంటుందయ్యా' అని వీరన్న వెంకట్రామయ్య చేత సంతకం పెట్టించుకుని ముప్పై రూపాయిలు ఇచ్చాడు.

వెంకట్రామయ్య ఆరు రూపాయిల అద్దెను రామచంద్రయ్యకిచ్చి వెళ్లిపోయాడు.

'మిగతా వాటాలవాళ్లకు పెంచాను తప్ప వెంకట్రామయ్యకు మాత్రం పదిహేను సంవత్సరాల క్రితం ఏ అద్దెకిచ్చానో ఇప్పుడూ అదే పుచ్చుకుంటున్నాను' అన్నాడు రామచంద్రయ్య తన ఔదార్యం శ్రీనివాసులు కర్థమయేట్లు.

'ఎందుచేత' — రామచంద్రయ్య నోటి నుండి మరికొంచెం వినాలని.

'పిల్లలు గలవాడు. సంసారం గడవడమే కష్టం. పైగా వెంకట్రామయ్య నిజంగా పెద్దమనిషి. ఇంతకీడబ్బే ప్రధానమా చెప్పు' అన్నాడు.

ఇంత ఘనమైన యోగ్యతా పత్రాన్ని వెంకట్రామయ్యకిచ్చి, అర్ధరూపాయి తీసి వీరన్నకిచ్చి, 'వెళ్లిరావోయ్' అన్నాడు.

వీరన్నతోబాటు శ్రీనివాసులుకూడా బైటకు వచ్చాడు.

'క్రొత్తగా వచ్చారా, సార్' అన్నాడు వీరన్న సైకిలు స్టాండు దించి.

'ఆ, నెలైంది.'

'రామచంద్రయ్యగారు మంచివారులెండి' అన్నాడు సైకిలు నడిపిస్తూ.

'ఆ ఆరు రూపాయలు పుచ్చుకోకపోతే మరింత మంచివాడనిపించుకోవచ్చు.'

'ఎందుకు పుచ్చుకోడు? రావాలసింది వదులుకుంటాడా? నేర్పుగా వసూలు చేసుకుంటాడనే కదా, నేను ముందుగా ఆయనకు మనిఆర్డరు వచ్చిందని చెప్పడం' అంటూ వీరన్న సైకిలెక్కాడు.

వీరన్న చేసే ఈ ఉపకారానికే రామచంద్రయ్య అర్ధరూపాయి ముట్ట చెప్పాడని శ్రీనివాసులుకు అర్థమైంది.

రెండో ఆట చూచి గదికి చేరుకుని శ్రీనివాసులు పడుక్కునేటప్పటికి రాత్రి ఒంటిగంట దాటింది.

ఆరు కాకుండానే పాలవాడి మేలుకొలుపులతో లేచాడు.

నిజాని కవి మేలుకొలుపులు కావు. సింహగర్జనలు

వెంకట్రామయ్య రెండునెలలు పైగా పాలబాకీ ఇవ్వనందుకు ఫెడామడా వాడు దుల్పేస్తున్నాడు.

వెంకట్రామయ్య నోరు విప్పకపోయినా, ఆయనభార్య వాడుపోసినవి నీళ్లని పాలు కావని మాటకు మాట వాడితో సమంగా అందుకుంటోంది.

ఆమెటోన్ గొప్పది. ఇటువంటి సందర్భాలు రోజూ రెండు మూడైనా వస్తూంటాయి కాబట్టి ఆమె రంగంలోనికి ప్రవేశించి భర్తకు రక్షణ కల్పిస్తూంటుంది.

ఏమైనా మరికొంచెం నిద్ర పోవాలని అనుకున్న శ్రీనివాసులు లేవవలసి వచ్చింది. జరిగిన సంఘటనలో క్రొత్త ఏమీ లేకపోయినా, ఆరోజు నిద్రాభంగమైనందుకు స్వగతంలో చిరాకు పడ్డాడు.

స్టేషనుకు బైలుదేరబోతూంటే రోజూ వచ్చే పాపిగాడు రాలేదు. రాలేదేమా అనుకున్నాడు. వాడికివ్వాలని చేత్తో పట్టుకున్న పెప్పరమింటు నోట్లో వేసుకున్నాడు!

మధ్యాహ్నం హోటలు నుంచి ఇంటికి వచ్చేటప్పటికి వర్షం పడుతోంది.' మాన్సూన్ ప్రవేశించింది, తనే కొంచెం తడిసాడు.

ఇల్లు చేరాడో లేదో వర్షం ఇంకా పెరిగింది.

రైలు మావయ్యా అంటూ వచ్చే పాపిగాడు రాలేదు. వర్షం కదా, పాపం, ఎట్లా వస్తాడు అనుకున్నాడు. పాపిగాడి కోటా పెప్పరమింటు నోట్లో వేసుకుని, వెంకట్రామయ్య తాటాకుపాక వైపు చూచాడు.

లోపల జనం పొడిగా ఉన్నవైపుకు సర్దుకుంటున్నారు.

'రామచంద్రయ్య పాక నేయించడు కాబోలు; అద్దె పెంచకపోవడమే పెద్ద ఫేవరు' అనుకున్నాడు శ్రీనివాసులు.

బైట వర్షం కురుస్తూండగా లోపల కూర్చున్న శ్రీనివాసులు సిగరెట్ వెలిగించాడు. సిగరెట్ కాలుస్తూంటే అతనికి విశాలమైన భావాలు వస్తూంటాయి.

మనిషి అన్న తరువాత కొంచెం మానవత్వం ఉండాలి, ఎవరికైనా కొంచెం సహాయం, సానుభూతి అందించాలి అనుకున్నాడు. పాపిగాడు కనిపించనేలేదు, పాపం, అనుకున్నాడు.

ఈ అర్భకత్వపు ఆదర్శవాదం వెలుతురులో తన వ్యక్తిత్వం మసక మసకగా ప్రకాశించింది,

వర్షం వెలిసిన తరువాత తిరిగి స్టేషనుకు బైలుదేరుతూ అనుకోకుండానే పెప్పరమెంటును తీసాడు.

వర్షం వెలిసినా పాపిగాడు రాలేదేమా అనుకొని పెప్పరమింటును నోట్లో వేసుకుని వెళ్ళిపోయాడు.

రాత్రి తిరిగి ఇంటికి వచ్చేసరికి పదిగంటలైంది. అది మామూలుగ్గైమే.

గది తలుపుతీసి లోపల లైటువేసి కూర్చున్నాడు.

వెంకట్రామయ్య, ఆయనభార్య వచ్చారు.

# రైలు మావయ్యా

'పాపిగాణ్ని వాడిరైలు మావయ్యే కాపాడాలి' అంటూ ఆమె అసలువిషయం చెప్పకుండా ప్రారంభించింది.

శ్రీనివాసులుకు అర్థం కాలేదు. 'ఈ వేళ వాణ్ని చూడనేలేదు. ఏమిటి సంగతి' అన్నాడు. ఈ సారి వెంకట్రామయ్య మాట్లాడాడు.

'నిన్నరాత్రి నుంచి జ్వరం. ఏమీ మింగ లేడు. నోరు తెరవలేడు. ఎదో మాట్లాడతాడు.'

'రైలు మావయ్యా, రైలుమావయ్యా అంటూ'—అంది ఆమె.

'ఏదో సంధి మాట లనుకోండి. సాయంత్రం గవర్నమెంటు హాస్పటలుకు తీసుకెళ్ళి డాక్టరుకు చూపిస్తే చాలా సీరియస్‌కేసు, ఇరవైనాలుగు గంటల్లో ఇంజెక్షన్లు వాడాలి, పైన భగవంతు డున్నాడు అన్నాడు.'

డాక్టర్లు భగవంతుని గురించి ఎప్పుడు చెబుతారో శ్రీనివాసులుకు ఇంకా అనుభవం లేదు.

'ఆ మందులు కావాలంటే ఏభై రూపాయలు అవుతాయుట. మా కెవరిస్తారు, బాబూ, నువ్వే ఆదుకోవాలి' అంది ఆమె. దుఃఖంతో మాటలు కలిసిపోయాయి.

'అసలు ప్రత్యేకవార్డులో విడిగా ఉంచవలసిన కేసట. ఇక్కడ ఆ వార్డు లేదు, హెడ్‌క్వార్టర్సు హాస్పటలులో ఉంటుంది, ముందు మందులు తీసుకురండి అన్నాడు.'

శ్రీనివాసులు ఏమీ మాట్లాడలేక పోయాడు.

'రైలు మావయ్యా, రైలు మావయ్యా అంటూ నీపేరే స్మరిస్తున్నాడు బాబూ' అంది ఆమె.

శ్రీనివాసులు ఏదో ఆలోచిస్తున్నవాడి మాదిరి అట్లాగే ఉండిపోయాడు.

'వాడికి కూడా తెలుసు బాబూ, నీవే కాపాడగలవని. అందుకే నిన్ను తలచుకుంటున్నాడు.' అంది ఆమె.

ఏ ద్వారాలూ తెరుచుకోవాలన్నా తలుపు తట్టాలి, మళ్ళీ మళ్ళీ తలుపు తట్టాలి, తెరుచుకునేవరకు తలుపు తట్టాలి—హృదయ ద్వారాల విషయంలోను అంతే. ఈ నిజం వెంకట్రామయ్య భార్యకు బాగా తెలుసు.

'నిజమే—నా వద్ద డబ్బు లేదు. పది రూపాయిలు మాత్రం ఉన్నాయి. రేపు కాని ఎల్లుండి కాని అయితే ఇవ్వగలను.' చివరకు శ్రీనివాసులు గొంతునుండి బైట పడింది.

'నీ దగ్గర లేకపోతే ఎవరినైనా అడిగి ఇయ్యి, బాబూ. మాకైతే ఇవ్వరు కాని నీకెవ్వరైనా ఇస్తారు. నా బిడ్డను బతికించు' అంది ఆమె.

'ఎవరిని అడగను? నేనూ ఈ మధ్యనే వచ్చాను, అంత చనువు నాకూ ఎక్కడా లేదు. రామచంద్రయ్యగారిని అడుగ కూడదా?' అన్నాడు.

వెంకట్రామయ్య, భార్య వెళ్ళిపోయారు. వెళ్ళిపోతూ ఆమె చూసిన తిరస్కారదృష్టి శ్రీనివాసులు భరించలేకపోయాడు.

'ఆమె అడిగినది తక్షణం ఇస్తే మంచివాణ్ని, లేకపోతే కాదు — వెధవ ప్రపంచం' అనుకున్నాడు.

'అసలు నేనెందుకు ఇవ్వాలి?' అని ప్రశ్న వేసుకుని తలుపు మూసుకుని పడుకున్నాడు.

మరునాడుదయమే వెళ్ళిన శ్రీనివాసులు రాత్రి పది గంటలకు కాని ఇంటికి రాలేదు. మధ్యాహ్నం భోజనంచేసి అటే స్టేషనుకు వెళ్ళిపోయాడు.

పాపిగాడు ఆ సాయంత్రమే గవర్నమెంటు హాస్పిటల్లో చనిపోయాడని ఇంటికి రాగానే శ్రీనివాసులుకు తెలిసింది.

ఏదో నేరం చేసినట్లయిపోయింది అతని






మనస్సు.

వెంకట్రామయ్య, భార్య వచ్చినపుడు తన వద్ద ఏభై రూపాయలున్నాయి. అంతకంటె కొంచెం ఎక్కువే ఉన్నాయి. ఎందుకివ్వలేదు?

నిజమే—ఎందుకివ్వలేదు? తను ఎందుకు సంకోచించాడు? మరల ఆ ఏభై రూపాయలు రావు—కరెక్ట్. ఆ విషయం ఖాయం.

ఆ ఏభై రూపాయలకు తను వేసుకున్న ఖర్చు వేరే ఉంది, ఒక టెరికాట్ పీస్, కాలిజోళ్లు కొనాలనుకున్నాడు. వాటిని కొనడం వాయిదా వేస్తే మరల రెండు నెలల లోపల కొనలేడు. వచ్చే నెలలో భార్యను తీసుకువచ్చి క్రొత్త కాపురం పెట్టాలను కుంటున్నాడు. పెండ్లి అయిన తరువాత పెట్టే క్రొత్త కాపురమాయె. ఖర్చు అవు తుంది.

పడుకున్నాడేకాని శ్రీనివాసులుకు చాలా సేపు నిద్ర పట్టలేదు. వర్షం పడిందేమో, దోమలు గదిలో ముసురుతున్నాయి.

ఒక మనిషి ప్రాణంకంటె టెరికాట్‌పీస్, బూట్లు ఎక్కువా?

దోమలతోబాటు అంతరాత్మ తన్ని ఇట్లా పొడవడం అతడు సహించలేకపోయాడు.

అంత అవసరమైతే మరొక చోట ప్రయత్నం చేసుకోవాలి. పదిహేను సంవత్స రాలుగా ఎరుగున్న రామచంద్రయ్య ఉన్నాడు కదా! తను మాత్రం ప్రాణం పోతుందను కున్నాడా? పాపిగాడంటే తన కేమైనా కోపమా, ద్వేషమా? ఇంతకూ చచ్చిపోయే ప్రాణాలన్నీ తను ఆపగలడా?

ఈ ఆర్గ్యుమెంటు కవచం తొడు క్కున్న తరువాత దోమలూ పొడవలేదు, అంతరాత్మ పొడవలేదు. అతనికి నిద్ర పట్టింది.

ఉదయమే పాలవాడి మేలుకొలుపులలో లేచాడు.

పాలవాడి వాగ్ధాటి చాలా ఎక్కువగా ఉంది.

శ్రీనివాసులు తలుపు తెరిచి బైటకు వచ్చాడు. ఇంకా ముఖంకూడా కడుక్కోలేదు.

'ఏమయ్యా, ఆయన నీ కెంత ఇవ్వాలేమిటి, చెప్పు' అన్నాడు.

'ఏం, మీరిస్తారా' అన్నాడు పాలవాడు సందేహంగా.

'ఆ, ఇస్తాను. చెప్పు.'

'రెండున్నర రూపాల బాకీ పాతిక రూపాయి లివ్వాలి. ఇదిగో, అదిగో — ఒకని ఆర్డరు వస్తుంది, మరొకటి వస్తుంది— ఇవే మాటలు.'

శ్రీనివాసులు గదిలోనికి వెళ్లి పాతిక రూపాయలు తెచ్చి పాలవాడి మీదకు విసిరాడు. వెంకట్రామయ్య తెల్లబోయి చూసాడు.

'ఒక నెల రోజులు ఆలస్యమైతే నీ ఇష్టం వచ్చినట్లు నోటికి వచ్చినట్లు కూస్తావా? పెద్ద మనిషి పరువు వీధిలో పెడతావా? డబ్బు పుచ్చుకోవడం మానావా? నీ వన్న మాటలు వాపసు తీసుకోగలవా?'

పాలవాడు మాట్లాడలేదు.

'వాళ్ల దగ్గరపెట్టుకుని వ్యాపారం చేయి. వెధవ డబ్బు — డబ్బే ప్రధానం కాదు,' పాలవాడు పెదవి విరిచి మాట్లాడ కుండా వెళ్లిపోయాడు.

'మీరెప్పుడు ఇవ్వగలిగితే అప్పుడే ఇవ్వండి. ఏమీ తొందరలేదు. ఈ డబ్బు మున్నవే వచ్చి ఉంటే బాగుండేది' అన్నాడు వెంకట్రామయ్యతో.

'నీవు చాలా మంచివాడివి, బాబూ' అన్నాడు వెంకట్రామయ్య.

శ్రీనివాసులు మనస్సు కుదుటబడింది. నేనుమాత్రం మానవత్వం లేనివాణ్ణా ము

కున్నాడు. ఇక అంతరాత్మకు పీడపోక పోయింది.

రెండు రోజులు గడిచాయి.

మధ్యాహ్నం భోజనంచేసి గదికి వచ్చేసరికి రైలు మావయ్యొచ్చాడు, రైలుమావయ్యొచ్చాడంటూ శ్రీనివాసులు దగ్గరకు వెంకట్రామయ్య కూతురు వచ్చింది.

## రైలు మావయ్య

ఆ పిల్ల పాపిగాడి పై పిల్ల. ఆరేళ్ళుండ వచ్చును. ఆరేళ్ళు వచ్చినా గౌను లేదు సరికదా, చిన్న లాగు అయినా లేదు.

'నీ పేరేవరు?'

'లక్ష్మి. అందరూ లచ్చి అంటారు. అమ్మ లచ్చిముండ అంటుంది.'

శ్రీనివాసులు గది తెరచి లోపలకువెళ్ళి బట్టలు విప్పుకుంటున్నాడు.

లచ్చికూడా లోపలకు వెళ్ళింది.

'మావయ్యా, పాపిగాడికి రోజూ ఎన్నో చాకులెట్లు, పెప్పరమింట్లు ఇచ్చేవాడివికదూ. నాకు ఎప్పుడూ ఒక్కటికూడా పెట్టేవాడు కాదు. ఎన్నోసార్లు అడిగాను.'

శ్రీనివాసులు జేబులోంచి ఒక పెప్పరమింటుతీసి లచ్చికిచ్చాడు. పెప్పరమింట్లు జేబులో వేసుకునే అలవాటు అతనిని ఇంకా వదలి పెట్టలేదు.

'వాడికి కూడా పెప్పరమింట్ ఇచ్చేవాణ్ని. చాకులెట్ ఒకటి రెండుసార్లే ఇచ్చాను' అన్నాడు, ఆమెకు వ్యర్ధమైన అసూయ కలిగించడం ఎందుకని.

'అబద్ధం, మావయ్యా, వాడు నాతో చెబితేనే'—

వాడట్లా చెప్పుకుంటే శ్రీనివాసులేమి చేయగలడు? అందుకే కాబోలు ఏమీ మాట్లాడలేదు.

శ్రీనివాసులు బట్టలు మార్చుకుని పడుక్కున్నాడు. లచ్చి ఏదో మాట్లాడుతూనే ఉంది.

శ్రీనివాసులు సరిగా వినడంలేదు కాని తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు.

ఈ లచ్చి పాపిగాడి స్థానంలో ప్రవేశిస్తున్నదా? పాపిగాడు కూడా ఇట్లాగే ప్రవేశించాడు, దాప క్రింద నీరు మాదిరి.

మరొక పాపిగాడు తయారుకావడం అతనికిష్టంలేదు. అతనికి కునుకు రాలేదు.

మరునాడు స్టేషనుకు దగ్గరగా కుటుంబంతో ఉండడానికి వనికి వచ్చే ఇల్లు చూచి అక్కడకు మకాం మార్చాడు.

'మా వాళ్లను అనుకున్నదానికంటే ముందుగానే తీసుకు పద్దామనుకుంటున్నాను' అన్నాడు రామచంద్రయ్యతోను వెంకట్రామయ్యతోను.

ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోతూ వెంకట్రామయ్య పిల్లలను పిలిచి అందరికీ పెప్పరమింట్లు, చాకులెట్లు పంచి పెట్టి మరీ వెళ్ళాడు. ●

---

**మూర లూ గు శా లూ!**

# మేక మాంసం

మేకమాంసం దేహపుష్టిని చేకూరుస్తుంది. వీర్యాన్ని వృద్ధి పొందిస్తుంది. సులభంగా జీర్ణమవుతుంది. ధాతువులను సామ్యం పరుస్తుంది

ముఖ్యంగా శ్వాసకాసలు, వాతం, కుసుమ, శూల, రక్తవాతం, గుల్మ, మూలవ్యాధి, పైత్యం, క్షయ, కఫం, ఉబ్బస రోగములు గలవారికి మేలుచేస్తుంది.

మేక మాంసాన్ని నీళ్లలో చిదుముడ యాడక ముందు, ఆనీళ్లు వేరేతీసి, ఆనీళ్లలో కొద్దిగా పంచదార, (పిలిసర్) తేనె కలిపి ప్రతిదినం పుచ్చుకున్నట్లయిన పిక్కలి సత్తువ చేస్తుంది. మెదడు, జ్ఞాపకశక్తికి, బలాన్ని యిస్తుంది. బలహీనమైన శరీరానికి పుష్టి చేకూరుతుంది

మేక మాంసం కాల్చి, ఆమాంసాన్ని తేలు కుట్టిన చోట పెట్టి కట్టుగట్టిన ఆ విషం దిగిపోతుంది.

మేక మాంసాన్ని కాల్చి, సారాయితో కలిపి, పెర్రికుక్క కాటుపై వేసి కట్టుకడితే ఎక్కినట్టి విషం కొంతవరకూ దిగుతుంది

మేకపోతు మాంసంకంటే ఆడమేక మాంసం శ్రేష్ఠమయినది. ఆడమేక మాంసం వాతపైత్యం గలవారికి, జబ్బుపడి తేరుకున్నవారికి, వేడి ప్రదేశములో ఉండువారికి అనుకూల మయినది.

మేకమాంసం మేహవాతాన్ని హెచ్చిస్తుంది. రాత్రివేళ తినడం మంచిదికాదు.

మేకపిల్ల మాంసం సుఖవ్యాధులు గలవారికి, నరముల వ్యాధులు వలన చేతులు కాళ్ళు, సొమ్మసిల్లిన వాళ్ళకు మేలు చేస్తుంది. మేకగుండె వేడిచేసి చలవ చేస్తుంది. గుండెకు బలాన్ని చేకూర్చుతుంది. కాళ్ళ ఎముకలలో గుజ్జు మేక మూలుగు కాకచేసి, తరువాత చల్లారాక ఆరబెట్టును. మంచి బలాన్ని ఆరోగ్యాన్ని, దేహ పుష్టిని, రక్తపుష్టిని యిస్తుంది.

వాత శరీరులకు, కడుపులో వికారాన్ని పుట్టిస్తుంది. అధికంగా తింటే పొట్టను పాడు చేస్తుంది. బుద్ధి మాంద్యాన్ని కలుగ చేస్తుంది.

మేక మెదడు, చలవ చేస్తుంది. మెదడుకు బలాన్నియిస్తుంది. కాని రక్తపైత్యాన్ని వృద్ధి పొందిస్తుంది. సులభంగా జీర్ణం కాదు. పొట్టను పాడుచేస్తుంది.

మేక మాంసం యొక్క దుర్గుణాలకు విరుగుళ్లు:—

1. సిరకా, 2 నిమ్మపండురసం, 3. చింతపండు పులుసు, 4. బాదం పప్పు, 5. కొబ్బరి కాయ, 6. నెయ్యి, 7. దాల్చినచెక్క, 8. ఉప్పు, 9. జీలకర్ర, 10. ఆవాలు.

# నెమలి మాంసం

నెమలి మాంసం కాక చేస్తుంది. పైత్య రోగం, నేత్రరోగం, చేతులు కాళ్లు ముడుచుకుపోయే రోగం గలవాళ్లకు మేలు చేస్తుంది. విషాన్ని హరించే శక్తి నెమలి మాంసానికుంది. శరీరానికి మంచి కాంతిని యిస్తుంది. ఆయుర్దాయాన్ని పెంచుతుంది.

నెమలి మాంసంలో కొబ్బరికాయ వేసి వండ కూడదు. అలా వండినట్లయితే అది విషతుల్యమవుతుంది.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు: 1. గుమ్మడి వేరు చూర్ణములో సౌవర్చ లవణం కలిపిన నీళ్ళు, 2. నిమ్మనీళ్ల రసం కలిపిన సొంఠి కరక్కాయి పిందెలు, ఉప్పు పిప్పి చూర్ణం 3. పెసరపప్పు.

# పాలపిట్ట మాంసం

పాలపిట్టను పాలగుమ్మ అనికూడా అంటారు. దీని మాంసం శరీరానికి సత్తువనిస్తుంది.

కామిల, పాండురోగులకిది మేలు చేస్తుంది.

**సేకరణ: అకుండి నారాయణమూర్తి.**

యర్రం చంద్రశేఖరం

### జ రి గి న క థ

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుంచి తనే పెంచి పెద్ద చేస్తాడు. లక్ష్మయ్య గారికి, గుండె జబ్బు వస్తుంది. ఆయనకు శ్రమ యివ్వకుండా వుండటానికి రామం చదువు హెచ్. ఎస్. సి. తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శాంత బలవంతం మీద శారద కూడా ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరుతుంది. ప్రభాకరానికి నీరజకు పెళ్ళి చెయ్యాలని అందరి సంకల్పం. సెలవులకి శాంతతో వచ్చిన శారద సత్ప్రవర్తనతో అందరి అభిమానమూ సంపాదించు కుంటూంది. ప్రభాకరం రోజా మోజులో పడి చేసిన దొంగతనాన్ని నీరజ బయట పెడుతుంది. ప్రభాకరంలో వస్తున్న మంచి మార్పుకు శ్రీపతి సంతోషించాడు.

## 8

శాంత శారదలిద్దరూ వేసవి శలవులలో యింటికి వెళ్లివచ్చారు.

ఇద్దరూ ఫస్టుక్లాసులో ప్యాసయ్యారు. సత్సాంగత్యంవల్ల మసిబొగ్గైనా మాణిక్యమౌతుందనుకోవడానికి శాంత ఫస్టుక్లాసులో ప్యాసవడమే నిదర్శనం. నూటికి నలభై మార్కులకన్న ఎక్కువరాని శాంతకు అరవై మార్కులపైగా రావడంతో రామం సంతోషంతో పొంగిపోయాడు. శారద రాష్ట్రమంతటికి ద్వితీయస్థానంతో ప్యాసైంది. శాంత కోరినడబ్బు యిచ్చి చదవబోయేది ఫైనలీయరనీ, చాలా జాగ్రత్తగా చదవాలనీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటూ ఎప్పటికప్పుడు ఉత్తరాలు వ్రాస్తూ ఉండాలనీ, యింకా ఎన్నో జాగ్రత్తలు చెప్పి పంపించాడు రామం.

ఆరుమాసాలు గడిచిపోయాయి. క్రిస్మస్ సెలవులు మొదలయ్యాయి. శారదతో స్నేహం కలిసిన తర్వాత శాంత సినిమాలు చూడడం తగ్గించింది. శారద అసలే చూడదు. విలాసాలు, ఆడంబరాలు ఆమెకు అసలే గిట్టవు. శాంత అంతకుముందు వారానికి కనీసం ఒకటిరెండూ చూస్తూ ఉండేది. ఇప్పుడు అంత తరచుగా వెళ్ళడంలేదు. ఒకవేళ వెళ్లినా శారదను అడిగి ఆమెను ఒప్పించి వెళ్లవలసి వస్తుంది. శాంత శారదతో చెప్పకుండా ఏ చిన్నపనికూడా చేయడం లేదు. శారద అంతటి చనువు, అధికారం శాంతపై సంపాదించుకుంది. పైగా ఈసారి యింటినుండి వచ్చేటప్పుడు లక్ష్మయ్యగారు, రామం యిద్దరూ శాంతను జాగ్రత్తగాచూసే బాధ్యత శాంత సమక్షంలోనే శారదకు ఒప్పజెప్పారు. శాంత చిన్నబుచ్చుకోలేదు చిరునవ్వుతో శారద ముఖంలోకి చూసింది.

మంచి ఇంగ్లీషు పిక్చరేదైనా చూడాలనే కోరికతో ఆనాటి న్యూసు పేపరును తిరగవేయ సాగింది శాంత. ప్లాజాటాకీసులో ఆడుతూన్న సినిమా ఆమెకు నచ్చింది, ఆ విషయమే శారదకు చెప్పింది.

'శాంతీ! ఇది ఫైనలియరు. నీవు జాగ్రత్తగా చదవడంలేదని నేననను. కాని దృష్టినిమాత్రం యితరత్రా ఏ వ్యాసంగాల మీదకూ మళ్లించకుండా జాగ్రత్తపడు. ఇంతకుమించి నీకేం చెప్పగలను?'

'శారూ! నిజంగా నీవు నా ప్రక్కన ఉండబట్టే నేను జాగ్రత్తగా చదువుకోగలుగుతున్నాను. ఎన్నడూ కూడా వూహించని విధంగా నాకు క్లాసు వచ్చిందంటే అది నీ శిక్షణ మాత్రమే! నీవు వద్దంటే వెళ్ళడం మానేస్తాను.'

'అబ్బే...! అలా ఎందుకంటాను శాంతీ! నాపై నీకున్న ప్రేమతో అలా అంటున్నావు గాని నన్ను హేళన చేస్తున్నవారెందరులేరు? వనజ ఆ రోజు అందరిముందు ఎలా అవమానించింది నన్ను? అందరూ ముందుకు నడుస్తే నేను వెనుకకు నడుస్తానట! బి. సి. లో ఉండవలసిన నేను ఈ యిరవయ్యో శతాబ్దంలో ఉండడానికి తగనట!' ముఖం చిన్నబుచ్చుకుని అంది శారద.

'ఏడిసింది...ఆ కాలేజీ క్వీన్‌కు మరీ అంత మిడిసిపాటా...? ఇప్పుడే ఫారిన్‌నుండి దిగివచ్చినట్లు మాట్లాడుతుంది. ఆవిడసంగతెవరికి తెలియదు. ఆ ఫాషన్లు, ఆ వయ్యారం! శారూ! ఎవరు ఏమైనా అనుకోనీ, నేను మాత్రం నీవు గీచిన గీటు దాటను. అసలు నాకు ఎవరిపైనా గురి కుదరదు. కుదిరిందంటే అది చెడదు. నేను చాలా ఖచ్చితమైనదాన్ని.'

'చాలా సంతోషం. నీకు నాపై అంతటి అభిమానం కలగడం నా అదృష్టం. నేగీచిన గీటు నీవు దాటకపోవడమేమిటి? శాంతీ! నీ ఆదరాభిమానాలతో బ్రతుకుతున్నాను, చదువుకుంటున్నాను. నా స్నేహంవల్ల నీవు చెడిపోయావనే పేరు రాకూడదు. అరిటాకు ముల్లుపై పడినా, ముల్లు అరిటాకుపై పడినా నష్టం అరిటాకుదే! నేను నిన్ను పెడమార్గాలకు త్రిప్పకున్నా నీ అంతట నీవు పెడదారి పట్టినప్పటికీ, అందుకు నేనే బాధ్యురాలనౌతాను.' చిరునవ్వుతో అంది శారద.

'శారూ! ఎంతమాటన్నావే! మరెప్పుడూ

ఆ విధంగా అనబోకు. నన్ను మందలించే అధికారం నీకెప్పుడూ ఉంటుంది. నాకు ఆవేశమెక్కువని నాన్నగారికి, బావకూ తెలుసు. అందుకే నా గార్డియన్‌గా నిన్ను నియమించారు. వారే కాకుండా నేను కూడా ఆ అదికారాన్ని నీకిస్తున్నాను.' ముఖకవళికలు గంభీరంగా మారుస్తూ అంది శాంత.

'శాంతీ!' ఆనందభాష్పాలు రాలుస్తూ అని శాంతను దగ్గరకు తీసుకుంది.

'శారూ!' అని శారదకు మరీ దగ్గరగా జరిగింది.

కాసేపైన తర్వాత శాంతను సినిమాకు వెళ్లవలసిందిగా హెచ్చరించింది శారద.

'మనస్ఫూర్తిగా వెళ్లమంటున్నావా శారూ?' శారద కళ్లల్లోకి [illegible]యాటిగా చూస్తూ ప్రశ్నించింది శాంత.

'వెళ్ళు శాంతీ! అప్పుడప్పుడు కులాసాగా కాలక్షేపం చేయడం కూడా చాలా ముఖ్యం. మరీ స్తబ్దుగా ఉండకూడదు.'

'అవుతే యిద్దరమూ వెడదాం!' ఆశగా శారద ముఖంలోకి చూసింది శాంత.

'లేదు శాంతీ! నేను సినిమా చూడను. అలా పబ్లిక్‌గార్డెన్స్‌లో ఒకటి రెండుగంటలు గడిపివస్తాను. ఇద్దరమూ కోటీవరకూ ఒకే బస్సులో వెళ్లాలికద! అక్కడినుంచి నెంబర్ సెవన్ నీది య్యెట్ నాది.'

ఇద్దరూ [illegible]యలుదేరారు. కోటీవద్ద శాంత వెళ్లిపోయింది. శారద నెంబర్‌య్యెట్ కోసం ఎదురుచూస్తూ నిలుచుంది.

*     *     *

ఆరోజు ఆదివారం. అంతేకాక క్రిస్మస్ శలవులు కావడంవల్ల పబ్లిక్‌గార్డెన్సు కిటకిటలాడుతున్నాయి. ఒంటరిగా ఒకదగ్గర కూర్చొని శ్రీపతిగారి కుటుంబం, ప్రభాకరం ప్రవర్తనగురించి ఆలోచిస్తూ ఉంది శారద. చివరిసారి శ్రీపతిగారివద్ద శలవు తీసుకోకుండా వచ్చినందుకు ఎంతో బాధ పడుతూఉంది శారద.

'అమ్మా శారదా...!నీవా?' అన్నమాటలు వినపడి ప్రక్కకు తిరిగి చూసింది శారద. శ్రీపతిగారు కనుపించారు.

'రారా పెదబాబుగారూ! యిలావచ్చి కూర్చోండి!' అని ఆమెకు ఎదురుగా ఉన్న బెంచీని ఎంతో వినయంగా చూపించింది. శ్రీపతిగారు బెంచీమీద కూర్చోలేదు. శారదకు ఎదురుగా కొద్దిదూరంలో పచ్చికపై కూర్చున్నారు.

సాయంకాలపు నీరెండ ఆకులపై వడి వింతకాంతులీనుతూ ఉంది. పిల్లలతో, యువకులతో, యువతులతో, జంటలతో, కుటుంబాలతో, వృద్ధులతో కిటకిటలాడి పోతున్న ఆనాటి పబ్లిక్‌గార్డెన్సు ఎప్పుడూ ప్రయాణికులతో కిటకిటలాడే విజయవాడ



ప్లాటుఫారాన్ని గుర్తుకు తెస్తున్నాయి.

ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. అలా పదినిముషాలు గడిచిపోయాయి. శారదే మౌనభంగం చేస్తూ 'పెదబాబుగారూ...నేను దోషిని. చేసిన నేరానికి మీకు ముఖం చూపించడం యిష్టం లేక చెప్పకుండా యింటి నుంచి వెళ్లి పోయాను. మళ్ళీ యిన్నాళ్ళకు అనుకోకుండా మీ దర్శన భాగ్యం లభించింది. నన్ను క్షమించండి.' కన్నీటి బిందువులు బుగ్గలపై ధారలు కట్టాయి.

'అమ్మా శారదా! నిజంగా నీలాంటివాళ్లు వెయ్యికి ఎంతమంది ఉంటారు? ఒక్కరు కూడా ఉండరేమోనని అనిపిస్తూ ఉంది. మా పరువుప్రతిష్ఠలు కాపాడడానికి చేయని నేరాన్ని నెత్తిన వేసుకొని యింటి నుండి వెళ్లి పోయావు. నీకెంత అన్యాయం జరిగింది తల్లీ! ప్రభాకరం అసలు విషయం చెప్పేంతవరకూ మేమూ నిన్ను దోషిగానే భావించామమ్మా' శ్రీపతిగారి కళ్ళు కూడా చెమ్మగిల్లాయి.

'పెదబాబుగారూ! మీరు నిజం తెలుసు

తున్నారు. అంతేకాదు. చినబాబుగారి ప్రవర్తన అలాగే ఉందా? ఏమైనా మార్పు వచ్చిందా? ఇప్పుడేం చదువుతున్నారు?' శ్రీపతిగారి ముఖంలోకి ఆదుర్దాగా చూస్తూ ప్రశ్నల వర్షం కురిపించింది శారద.

'నీవెంత మంచి హృదయమమ్మా. నీకు అన్యాయం చేసినవాడిని గురించి తెలుసుకోవాలనే ఆపేక్ష నీకెందుకు తల్లీ! వాడు నీ అభివృద్ధికి ఓర్వలేక నిన్ను ఆదుకుంటూన్న మా కళ్లు కప్పి ఆ యింట్లో నీకు స్థానం లేకుండా చేశాడు.' శ్రీపతిగారి మాటలు జాలిగొలుపుతున్నాయి.

'అదంతా నా ఖర్మ. వారు నిమిత్తమాత్రులు. నా అదృష్టం బాగులేక అలా జరిగింది. ముఖం బాగాలేదని అద్దాన్ని నిందించడం వల్ల ప్రయోజన మేముంటుంది? మీ ఆదరాభిమానాలకు దూరమయ్యానని ఎప్పుడూ బాధపడుతుంటాను.'

'ఆ యింట్లో నీకు అవమానం జరిగినట్లుగా మరెవ్వరికైనా జరిగినట్లయితే మా మీద దుమ్మెత్తి పోసేవారు. అప్పటి ఆ సంఘటనే కాక అంతకుముందుకూడా ఒకటి రెండుసార్లు నిన్ను అవమానపరచినట్లు చెప్పారు. నిజమేనా అమ్మా' శారదను ఆప్యాయంగా చూస్తూ అడిగారు శ్రీపతిగారు.

'జరిగిపోయిన సంగతులన్నీ యిప్పుడెందుకండీ! మీ మాటలను బట్టి చూస్తే చినబాబుగారితో ఏదో మార్పువచ్చినట్లు తోస్తూ ఉంది నాకు. అదే నిజమైతే అంతకన్న సంతోషించవలసిన విషయమేదీ ఉండదు.' అంది శారద.

'కొంతవరకు నయమే! చదువు విషయంలో శ్రద్ధ కలిగింది. మిగతా అలవాట్లన్నీ అలాగే ఉన్నాయి. ఆ కిరస్తానీ పిల్లతో పేచీ పడినట్లున్నాడు. అందువల్ల యిక్కడ ఉండి చదువుకోవడానికి కూడా యిష్టపడలేదు. బెనారస్ యూనివర్శిటీలో బి. ఏ. రెండవ సంవత్సరం చదువుతున్నాడు. ప్రభాకరం తల్లి వాడు మాకు దూరమయాడని ఎంతో బాధపడుతూ ఉంది. వాడు క్రమంగా మారుతాడనే ధైర్యంతో యిలా జీవిస్తున్నాం. వచ్చే సంవత్సరంతో వాడి చదువు పూర్తవుతుంది. ఈ వచ్చిన మార్పుకు తగినట్లు మిగతా దురలవాట్లు కూడా మారితే ఎంతో బాగుంటుంది. ఆరు నెలల పరీక్షలలో మార్కులు బాగా వచ్చినట్లు వ్రాశాడు. అంతా ఆ భగవంతుడి దయ. మన చేతిలో ఏముంది?' దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నారు శ్రీపతిగారు.

'బాధపడకండి పెదబాబుగారూ. మార్పంటూ ప్రారంభమయితే క్రమంగా అన్ని వాట్లలోనూ మార్పురావడం జరుగుతుంది. ముఖ్యంగా అతనికి చదువుపై శ్రద్ధ కలిగింది. అంతేచాలు. అతనిలో మార్పు ప్రారంభమైనందుకు ఎంతో సంతోషిస్తూ' అంది శారద.

'మరి నీ సంగతి చెప్పావు కాదేం తల్లీ! మా యింటి నుండి వెళ్లిన తర్వాత నీ వెక్కడ ఉంటున్నావు? ఏం చేస్తున్నావు?' బరువుగా శ్వాస పీలుస్తూ అడిగారు శ్రీపతిగారు.

శారద తను యింటి నుంచి బయలుదేరిన మొదలు యిప్పటివరకు జరిగిన విషయాలన్నీ పూస గ్రుచ్చినట్లు శ్రీపతిగారికి చెప్పింది.

'మంచి మనసు గలవారినెప్పుడూ భగవంతుడు ఏదో ఒక రూపంలో ఆదుకుంటూ ఉంటాడు. పోనీ యిప్పుడు వచ్చేయమ్మా! ఇంటికి వెడదాం. వాడు బెనారస్‌కు వెళ్లిపోయాక యిల్లంతా మరీ చిన్నబోతూ ఉంది. నీ సంగతి తెలిసిన తర్వాత నిన్ను తలపని రోజంటూ లేదు.' బాధపడుతూ అన్నారు శ్రీపతిగారు.

'అప్పుడప్పుడు వచ్చి చూసి వెడుతూంటాను. నేను హాస్టలులో ఉండి చదువుకోవడమే మంచిదనిపిస్తూ ఉంది. అయినా శాంత నేను వెళ్లిపోతానంటే చిన్నబుచ్చుకుంటుందేమో?' వినయంగా శ్రీపతిగారి కోరికను నిరాకరించింది శారద.

'అవునమ్మా! నీ మాటలు సబబుగానే ఉన్నాయి. ఇంట్లో ఉండి చదువుకోవడం కన్న హాస్టలులో ఉండి చదువుకోవడమే మంచిది. కాని నీవు మాత్రం తరచూ వస్తూ ఉండాలి. మీ హాస్టలుకు కారు పంపిస్తాను కూడా.'

'కారెందుకు లేండి. నేను వస్తూ ఉంటాగా! అయినా నాకిది ఫైనలియరు. పరీక్షలైపోయాక వచ్చి వారం రోజులు ఉంటాను' చిరునవ్వుతో అంది శారద.

'అలాగే తల్లీ! ఇప్పుడు నేను ఇంటికే వెడుతున్నాను. ఒక్కసారి వచ్చి మీ అమ్మగార్ని పలకరించిపో తల్లీ' ఎంతో ఆప్యాయంగా అడిగారు శ్రీపతిగారు.

కాదనలేకపోయింది శారద. శ్రీపతిగారితో వారి ఇంటికి వెళ్లి, అక్కడ అన్నపూర్ణమ్మగారితో ఒక గంట మాట్లాడి హాస్టలుకు వెళ్లింది.

* * *

శారద దగ్గర శలవుతీసుకొని బయలుదేరిన శాంత నెంబర్ సెవన్‌లో ఎక్కి సికింద్రాబాద్ మినర్వా టాకీసువద్ద దిగింది. అక్కడికి ప్లాజా టాకీసు ఫర్లాంగు ఉంటుంది.

ప్లాజా టాకీసులో ఆ రోజే పిక్చరు మారింది. క్రొత్త పిక్చరు కావడంవల్ల రద్దీ బాగా ఉంది. అందులో ట్విన్‌సిటీస్‌లో యింగ్లీషు పిక్చరుకు మంచి డిమాండు ఉంటుంది. శాంత హాలు దగ్గరకు చేరేసరికి అన్ని క్లాసుల బుకింగ్సు క్లోసైపోయాయి. నిరాశతో వెనుకకు తిరిగివస్తున్న శాంతకు బయటిగేటులో నిలబడి ఎవరికోసరమో ఎదురు చూస్తున్న సుందరం కనుపించాడు.

'హల్లో సుందరం! ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లున్నావ్?' ప్రశ్నించింది శాంత.

అనుకోకుండా శాంతను చూసిన సుందరం సంతోషంతో పొంగిపోయాడు. 'హల్లో శాంతా! బహుకాల దర్శనం! అప్పుడెప్పుడో సుల్తాన్‌బజారులో కనుపించావు. నా అడ్రసు కూడా యిచ్చావు. రావడానికి తీరిక చిక్కలేదనుకుంటా!' చిరునవ్వుతో శాంతను చూస్తూ అన్నాడు సుందరం.

'ఎక్కడ! అందులో యిది ఫైనలియరు కూడా.' వెళ్లిపోబోతూ అంది శాంత.

'అదేమిటి? పిక్చరుకు రావడంలేదా? చాలా బాగుంటుంది.' ఆశ్చర్యపడుతూ అన్నాడు సుందరం.

'చూడాలనే వచ్చాను కాని హాలు హౌస్‌ఫుల్ అయింది.' మంచిగా ఉంటుందని సుందరం అంటూన్న సినిమా చూడలేక పోతున్నానే అని బాధపడుతూ అంది శాంత.

'అలాగా! నా ఫ్రెండొకడు వస్తానంటే రెండు టిక్కట్లు తీసుకున్నాను. వాడింకా రాలేదు. అసలు వస్తాడో రాడో? న్యూస్ కూడా స్టార్టయింది.' అని ఒక్కక్షణం ఆలోచించి 'పద శాంతా! వాడు యిక వస్తాడన్న ఆశలేదు. త్వరగా వెళ్లకపోతే సీట్లు కూడా ఒక్క దగ్గర దొరకవు.'

'అదేమిటి శాంతా ఏమాలోచిస్తున్నావు?'

'ఏం లేదు...' నసుగుతూ లచి అతని వెంట వెళ్లడానికి సందేహించసాగింది.

'హో... అర్థమైంది. పోనీ యిదిగో టిక్కెట్టు. నీవెళ్లు...' టిక్కెట్టు యివ్వబోతూ అన్నాడు సుందరం.

'ఒద్దు...! పద...ఇద్దరమూ వెడదాం!'

సుందరాన్ని అనుసరించింది శాంత. ఎంతో కష్టంమీద వారిద్దరికీ సీటు దొరికింది. సుందరం ప్రక్కగా కూర్చోవాలంటే ఏదో ఎబ్బెట్టుగా తోచింది శాంతకు. అయినా తప్పలేదు. న్యూస్‌రీలు బోరు కొట్టడంవల్ల ఏదో ఆలోచనలో పడింది. 'అవును...అందుకే శారదకు సినిమాలంటే యిష్టముండదు. అనుకోకుండా చిక్కుల్లో పడవలసి వస్తుంది. ఇలా మేమిద్దరం ఒకరిప్రక్కన మరొకరం కూర్చుని ఉండడం, తెలిసిన స్నేహితులెవరైనా చూస్తే...లేనిపోని గొడవలు తెచ్చి పెడతారు. పైగా శారదకు సమాధానం చెప్పలేక తలప్రాణం తోకకు వస్తుంది. ఒంటరిగా సినిమాకు రావడం ఎంత పొరపాటైంది? శారద రానప్పుడు యింకెవరినైనా తోడుగా తీసుకువస్తే బాగుండేది. ఇప్పుడిక ఏమనుకొని ఏం లాభం? పరిస్థితి చేయిజారిపోయింది.' పైవిధంగా ఆలోచిస్తున్న శాంతకు న్యూస్‌రీలు పూర్తవడం, సినిమా ప్రారంభమవడం తెలియలేదు. సినిమాలో

# మె ల్లె లతి...

కనుపించిన జోక్‌కు అంతా నవ్వారు. ఆ నవ్వుతో బాహ్యస్మృతికలిగి పరిసరాలను గుర్తించగలిగింది శాంత.

సినిమా ఎంతో బాగా ఉన్నప్పటికీ పరధ్యానంతో ఉన్న శాంత సినిమా చూస్తున్న ఆనందాన్ని అనుభవించలేకపోయింది. శాంత ఎంత వద్దని వారిస్తున్నా, వినకుండా యింటర్వెల్‌లో సుందరం రెండు కూల్ డ్రింక్సు తెప్పించాడు. అతనిని ఏమీ అనలేక, ఆ పరిస్థితికి మానసికంగా ఎంతో బాధపడింది. వెనుకకు పోతే గొయ్యి, ముందుకు పోతే నుయ్యి సామెతలా తయారైంది ఆమె పరిస్థితి.

'సుందరం! నాకు అకస్మాత్తుగా తలనొప్పివేస్తూ ఉంది. బాధ భరించలేకపోతున్నాను. నేను హాస్టలుకు వెళ్లిపోతాను.' అని లేచి అవతలికి వెళ్ళడానికి ఉద్యుక్తురాలైంది శాంత.

'ఆగు శాంతా! నీకంత తల నొప్పిగా ఉంటే నిన్ను ఒంటరిగా వెళ్ళనిస్తానా? పద! నేనుకూడా వస్తాను. ముందుగా మా రూముకు వెడదాం. నీకు తగిన మందిస్తాను. కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత హాస్టలుకు వెడుదువుగాని' అని శాంతకు మాట్లాడే అవకాశము యివ్వకుండా ఆమె వెంట పడ్డాడు. ఇద్దరూ హాలు బయటికి వచ్చారు.

'ఇదెక్కడ తద్దినంరా బాబూ! ఈ పీడ ఒదిలేలా లేదే! తప్పించుకొని వెళ్లిపోదామంటే వెంటపడ్డాడు. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లుయింది నా పని' అని మనసులో అనుకుంటూ 'సుందరం నాకోసం నీవు పిక్చరు చూడడమెందుకు మానుకోవాలి? హాస్టలుకు వెళ్ళేసరికి అదే తగ్గిపోతుంది.' అని తప్పించుకో చూసింది శాంత.

'అదేమీ కుదరదు. నీతో సినిమాకువచ్చి, నీకు తలనొప్పివేస్తే నిన్ను ఒదిలి నేను సినిమా చూడడమా? నెవర్! నెవర్! పద ...నా రూముకు వెడదాం...'

శాంతకు తప్పలేదు. హాలు కాంపౌండు దాటారు యిద్దరూ. అప్పుడే అటువైపుగా వస్తూన్న టాక్సీని కేకవేశాడు సుందరం. వారిద్దరూ టాక్సీలో కూర్చున్న తర్వాత అది బయలుదేరింది.

సుందరం రూము ఎంతో ఆకర్షణీయంగా, పరిశుభ్రంగా ఉంది. వెటి స్థానంలో అవి పొందికగా, ఒద్దికగా అమర్చబడి ఉన్నాయి. గది నేటి నాగరికతకు నిదర్శనంగా ఉంది. ఇటువంటిరాణ్ని పట్టుకొని అక్కడికి రమ్మంటూన్న రామం శాంత మనసులో మెదిలాడు. రామం గుర్తుకు రావడంతో ఒక్కసారి ఉలిక్కిపడింది శాంత. 'ఏమిటిది? నా ఈ పనికి అర్థమేమిటి? ఒంటరిగా ఉన్న ఒక పరాయిపురుషుడి గదికి నేను...ఒంటరిగా ... ఆదీ ఈ సమయంలో రావడం—ఛీ! ... నామతి పోతూ ఉంది. ఎప్పటి కప్పుడు సుందరాన్ని తప్పించుకోవాలనుకుంటున్నాను. కాని అతని మాటను గట్టిగా త్రోసిపుచ్చలేక పోతున్నాను. ఈ రోజు నాలో యింత బలహీనత ఏర్పడింది దేమిటి?' అని ఆలోచిస్తూ ఆ ఆలోచనలకు బుర్ర వేడెక్కి 'అబ్బా' అని తల పట్టుకుంది శాంత.

'ఏమిటి శాంతా? తలనొప్పి అంత ఎక్కువగా ఉందా?' అని సుందరం శాంత దగ్గరగావచ్చి ఆమెచేతి నందుకొని నాడి చూశాడు. స్టెతస్కోపుతో హార్టు బీటింగ్సు పరీక్షించాడు. ఇవన్నీ చేస్తున్న సుందరాన్ని వారించలేక పోయింది శాంత. ఏమని వారిస్తుంది? వెనుక ముందులు ఆలోచించకుండా తలనొప్పి వేస్తుందని అన్న ఒక్క



కాటు యింతకు దారితీస్తుందని ఊహించ లేక పోయింది.

సుందరం తనచేతి నందుకొని నాడి పరీక్షిస్తున్నసమయంలో ఏదో విద్యుత్తు తనలో ప్రవహించినట్లు తోచింది ఆమెకు. ఆచేతిని అలాగే పట్టుకొని ఇంకొద్దిసేపు పరీక్షచేస్తే బాగుంటుందనే ఊహ ఒక్కక్షణం కలిగి మాయమైంది. అవును ... చిన్నప్పటినుండీ అలవాటు పడిన తనబావ స్పర్శతప్ప వేరొక పురుషుని స్పర్శ ఎరుగని శాంతకు అటు వంటి ఊహ కలగడం సహజమే నేమో ? సుందరం అందగాడు. నాగరికుడు. పైగా డాక్టరు. మానసికంగా ఆ దృష్టిలేకున్నా... అవకాశం ఆ దృష్టిని కలిగించింది. ఆ తర్వాత పశ్చాత్తాపపడింది శాంత.

సుందరం యిచ్చిన మాత్రలు మింగి అతనివద్ద ఫ్లాస్కులోఉన్న వేడి వేడి కాఫీ త్రాగి 'ఇక నే వెళ్లొస్తా సుందరం...' అని అతనివైపు నిశితంగా చూస్తూ అంది శాంత.

'అప్పుడే వెడతావా? ఇప్పుడేగా మందు వేసుకొని కాఫీత్రాగావు. పదిహేను నిమిషాలు కూర్చుని వెళ్లు' శాంత కళ్లల్లోకి చిలిపిగా చూస్తూ చిరునవ్వుతో అన్నాడు సుందరం.

ఆ చూపులకు తట్టుకోలేక తల ఒంచు కొని 'లేదు సుందరం' అని లేచి గది బయటకు నడిచింది శాంత.

ఆమెను బస్‌స్టాండ్‌వరకు సాగనంపి తిరిగి వెళ్లిపోయాడు సుందరం. అప్పుడే జరిగిన సంఘటనను గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ వేడి నిట్టూర్పులు విడుస్తూ, బస్సుకోసం నిరీక్షిస్తూ రాణీగంజ్ బస్సుస్టాండులో నిల్చుంది శాంత. ఆమెమనసు గడియారం పెండ్యులంలా అటూ, యిటూ ఊగుతూ ఆమెను ఆందోళన పరచింది.

* * *

కాశీ మన భారతదేశంలోగల ప్రముఖ పుణ్య స్థలాలలో ఒకటి. అది అతి ప్రాచీన మైన క్షేత్రం. ఆ క్షేత్రానికిగల మహాత్యం ఎంతో గొప్పది. పరమ పావనియైన భాగీరథి ఆ పుణ్యక్షేత్రానికి ప్రక్కగా ప్రవహించడం వల్ల ఆ క్షేత్రానికి ఎంతో ప్రశస్తి కలిగింది.

పెక్కుమంది యాత్రికులు విశ్వేశ్వరుని సందర్శించడం కోసం వస్తూ ఆ గంగామ తల్లి చల్లనివడిలో తమ సర్వ పాపాలను క్షాళనం చేసుకొని ఆ కపాలధారి దర్శనం చేసి తరిస్తూ ఉంటాను. ప్రజల స్నాన సౌకర్యార్థం ఎన్నో ఘాట్‌లు నిర్మించబడి ఉన్నాయి. వానిలో మణికర్ణికాఘాట్, కేదారేశ్వరఘాట్‌లు ముఖ్యమైనవి.

కాశీలో మరణం సంభవిస్తే పుణ్యలోకాలకు చేరుతారనే శాస్త్ర ప్రమాణముంది. హరిశ్చంద్రఘాట్ అనే శ్మశానవాటిక ఎంతో పేరుగాంచి నటువంటిది. అలనాటి ఆ హరి

శ్చంద్ర మహారాజుయొక్క సత్య వ్రతాన్ని గుర్తుకు తెస్తుంది ఆ శ్మశానవాటిక.

శివుని శిరస్సు నలంకరించిన ఆ పవిత్ర వాహిని హిమాలయాలలోని సర్వ వోషధుల మీదుగా ప్రవహిస్తూ, పవిత్రతకు తోడు రోగ నివారణా శక్తిని కలిగిఉండి, మానవుల పాపాలను రోగాలను నివారిస్తూంది. గంగా జలం స్ఫటికంలా ఎంతో స్వచ్ఛమైనది. ఎంతకాలం నిలువచేసినా చెడిపోనటువంటిది. పాశ్చాత్యులుకూడా మన పవిత్ర గంగాజలా లను పరీక్షించి దాని మహత్తును వేనోళ్ల కొనియాడారు. సర్వపాప నివృత్తి, సర్వరోగ నివారిణి అయిన గంగాస్నాన మహత్తును మన శాస్త్రాలలో ఎంతో గొప్పగా వర్ణించారు.

కాశి అనాదినుండి మన భారతదేశానికి ముఖ్య విద్యాక్షేత్రము. మనపూర్వులు కాశీలో చదివిన పండితునికి అఖండ గౌరవాన్నిస్తూ, ఆదరిస్తూండేవారు. కాశీలో పండిత పరిషత్తు ఉండేదట! ఆ పరిషత్తు మెప్పును పొందిన పండితునికీ దేశము మొత్తముమీద ఘన సన్మానాలు ఆ రోజులలో జరిగేవట!

కాశీలో మరొక ముఖ్యవిశేష మొకటుంది. ఎంతమంది యాత్రికులకైనా నిత్యాన్న దానము జరుగుతుంది. కాశీ అన్నపూర్ణా దేవిపేరు అన్నదానానికి ప్రసిద్ధి. అందువల్ల యాచకులు భిక్షపెట్టే తల్లులను కాశీ అన్నపూర్ణతో పోలుస్తూ ఉంటారు.

అటువంటి పవిత్రస్థలంలో తన విద్య కొనసాగిస్తున్నాడు ప్రభాకరం. ప్రథమంలో అక్కడి ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, సభ్యత, సంస్కృతీ ప్రభాకరానికి ఎంతోవింత కలిగించాయి. మెల్లిగా వాటికి అలవాటు పడ్డాడు. చదువుమీద శ్రద్ధ కలిగింది కాని ఇతర దురభ్యాసాలు అతనిని వదలడం లేదు. ప్రభాకరానికి యిక్కడకూడా చెడుస్నేహాలు అలవడ్డాయి. అయినా శ్రద్ధతోమాత్రం చదువుకుంటున్నాడు.

ప్రతిరోజూ ఉదయం చన్నీటి స్నానం చేయడం ప్రభాకరానికి మొదటినుండీ అలవాటు. బెనారసు వచ్చినప్పటినుండి రోజూ ఉదయం గంగస్నానంచేస్తూ ఉండేవాడు. అతను మంచి ఈతగాడు. హైదరాబాదులో ఉన్నప్పుడు సరదాగా స్విమ్మింగ్ పూల్సులో ఈతగొట్టే ప్రభాకరం కాశీలో దాన్ని ఒక సాధనగా పెట్టుకొని ప్రతిరోజూ కొద్దికొద్దిగా సాధన పెంచుతూ ప్రస్తుతం గంగలో సగభాగానికి ఈది తిరిగి రాగలుగుతున్నాడు.

వ్యాయామా లన్నింటిలోనూ ఈత ఒక ముఖ్యమైన వ్యాయామం. సర్వావయాల లోనూ చలనం కలిగించి, చక్కని ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుంది. ప్రభాకరం మంచి స్పోర్ట్సుమన్. హైదరాబాదులో రోజా వ్యామోహంలోపడి తనకాలాన్నంతా వృథాగా ఆమెతో గడిపాడు. ఆ వ్యామోహం రోజా దుష్ప్రవర్తనతో ఒదిలిపోయింది. కాని మదిరాపానము, ధూమపానము, వృథాఖర్చులు స్నేహితులతో వృథా కాలక్షేపాలు చేయడం కాశీకి వచ్చిన తర్వాతకూడా అతన్ని ఒదిలిపెట్టలేదు. ఏదో అజ్ఞాతశక్తి అతని మనసుతో పోరాడుతున్నా కొన్ని సంవత్సరాలుగా జీర్ణించుకుపోయిన ఆ అలవాట్లు అతనిని ఒదిలిపోనంటున్నాయి.

కాశీలో గొప్ప స్పోర్ట్సుమన్‌గా చదువులోకూడా యానరేజి స్టూడెంటుగా పేరు తెచ్చుకున్నాడు. కాని అతను తన దురుసు స్వభావంతో, జాగ్రత్త చూపవలసిన ప్రతి సందర్భంలోనూ నిర్లక్ష్యాన్ని చూపడంతో ఒక చెడ పేరు వచ్చింది. అయినప్పటికీ యిది వరకటికన్న చాలామార్పు రాసాగింది.

రోజులు ప్రశాంతంగా, గంగా ప్రవాహంలా సాఫీగా గడిచిపోతున్నాయి. ఒకరోజు మామూలుగా స్నానానికి వెళ్లాడు ప్రభాకరం. స్నానం చేయడానికి గుడ్డలు విప్పి నీళ్లల్లోకి దిగబోతున్నాడు. ఇంతలో అతనికి పది పదిహేనుగజాల దూరంనుండి కేకలు, ఏడుపు వినిపించాయి. అదేమిటో తెలుసుకోవాలనే ఉద్దేశంతో అటువైపు వెళ్లాడు. ఒక పదిసంవత్సరాల అమ్మాయి కాలుజారి గంగా ప్రవాహంలో పడిపోయింది. అంతకు ముందే ఎవరో యువకుడు ఆ అమ్మాయిని రక్షించడానికి పూనుకున్నాడు. నీళ్లల్లో దూకాడు. కాని ఆ అమ్మాయిని ఒడ్డుకు తీసుకురాలేక మధ్యలో ఆ యిద్దరూ మునిగిపోయే పరిస్థితి ఏర్పడింది. ఆదృశ్యాన్ని కళ్లారా చూసిన ప్రభాకరం అకస్మాత్తుగా నీళ్లల్లోకి దూకాడు. స్నానాల ఘాట్‌కు పాతిక, ముప్పైగజాల దూరంలో ఆ అమ్మాయి, ఆయువకుడు మునుగుతూ, తేలుతూ ఉక్కిరి బిక్కిరౌతున్నారు. ఆసరా చిక్కిందన్న ధైర్యంతో ఆ అమ్మాయి ఆయువకుణ్ణి గట్టిగా ఊపిరి సలుపకుండా పట్టుకుంటూ ఉంది. ఆ యువకుడు బలశాలి కానందువల్ల గుడ్డలతో తడిసి ఉన్న ఆ అమ్మాయి భారాన్ని భరించలేక ఉక్కిరి బిక్కిరౌతున్నాడు.

రెప్పపాటులో వేగంగా ఈదుకుంటూ వెళ్లిన ప్రభాకరం ఆ అమ్మాయిని తన భుజాన వేసుకొని ఆయువకుడికి కూడా యథాశక్తి ఆసరాయిస్తూ అతి ప్రయాసతో ఆ యిద్దరినీ గట్టుకు చేర్చాడు. ఆ అమ్మాయిని ఆమె తల్లికి ఒప్పజెప్పి ఆయాసంతో రొప్పసాగాడు. ఆ అమ్మాయి స్పృహ తప్పలేదు కాని నీరు త్రాగినందువల్ల ఆయాసపడుతూ ఉంది. తనకు తెలిసిన ప్రథమ చికిత్సను అక్కడ గుమికూడిన వాళ్లతో చేయించి ఆ అమ్మాయి త్రాగిన నీటిని కక్కించాడు ప్రభాకరం.

మొదట ఆ అమ్మాయిని రక్షించాలని పూనుకున్న ఆ యువకుడు పది నిముషాలలో కోలుకున్నాడు. మరొక పదినిముషాలలో అమ్మాయి కూడా తేరుకొని మాట్లాడడం ప్రారంభించింది.

అక్కడున్న వారందరి దృష్టి ప్రభాకరం మీద పడింది—

'మెనీ, మెనీథ్యాంక్స్! సమయానికి మీరు వచ్చి రక్షించకపోతే మేమిద్దరమూ గంగపాలయ్యేవాళ్లం' ఆ బక్కపల్చని యువకుని నోట తెలుగుమాటలు విని ఆశ్చర్యపోయాడు ప్రభాకరం.

'మీరు తెలుగువారా? మిమ్ములను రోజూ చూస్తూనే ఉన్నాను. మీరు కూడా ప్రతి రోజూ స్నానానికి వస్తున్నారుకదూ?' అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు ప్రభాకరం.

'అవునండీ ... మీరుంటున్న హాస్టలులోనే ఉంటున్నాను. మీరు తెలుగువారని ఊహించాను. మీతో పరిచయం కలిగించుకోవాలని ఎంతోకాలంగా అనుకుంటున్నాను. కానీ ఆ అవకాశం ఈ విధంగా కలిగింది.

వారిద్దరూ అలా మాట్లాడుకుంటూ ఉండగా ఆ అమ్మాయి తలిదండ్రులు వారి దగ్గరకు వచ్చారు. మధ్య వయసులో ఉన్న ఆ అమ్మాయి తండ్రి ప్రభాకరాన్ని కృతజ్ఞత నిండిన చూపులతో చూస్తూ 'ఆప్ హమారే బచ్చీకాజాన్ బచాయే! ఆప్‌కా

యహసాన్‌హమ్ జిందగీభర్ నహీ భూలేంగే!’ అని హిందీలో అన్నాడతను.

‘కోయీబాత్ నహీఁ భాయిసాబ్! బచ్చీ బచ్‌గయీ! మై ఖుష్‌హోగయాహూఁ.’ అతని వీపు తడుతూ సంతోషంగా అన్నాడు ప్రభాకరం.

‘భగవాన్ ఆప్‌కో ఆబాద్‌రఖే...!భైయ్యా ...హమ్ గరీబ్‌లోగ్‌హైఁ. దువాకే సివా ఆప్‌కో కుచ్ భీ నహీఁదే సక్తే!’ ఆ భార్యాభర్తలిద్దరూ ఒకేసారి అన్నారు.

వారివైపు ఆప్యాయంగా చూస్తూ ‘సచ్చేదిల్ సే ఆప్ దియే సో దువాఁహి హమారేలియే బహుత్‌కుచ్ హై...’ చిరునవ్వుతో అన్నాడు ప్రభాకరం. ప్రమాదం నుండి బయటపడిన అమ్మాయితో ప్రభాకరానికి ఆ యువకునికీ దండాలుపెట్టిస్తూ వారిని నూరు సంవత్సరాలు సుఖ సంతోషాలతో జీవించమని దీవిస్తూ వెళ్ళిపోయారా దంపతులు. వారువెళ్ళిన తర్వాత ప్రభాకరం ఆ యువకుడిని మాటలలోకి దించాడు.

‘మీపేరు చెప్పలేదు.’

‘నా పేరు వరప్రసాదమూర్తి’

‘చాలా పెద్దపేరండీ!’ నవ్వుతూఅన్నాడు ప్రభాకరం.

‘అవునండీ! నన్ను అందుకే మూడు రకాలుగా పిలుస్తారు. మాయింట్లో లేక లేక కలిగినవాణ్ణి నేను. అందుకని మా నాయనమ్మగారు, తాతగారు ‘వరం’ అని పిలుస్తారు. నాన్నగారు, అమ్మ ‘మూర్తి’ అని పిలుస్తారు. ఇక స్నేహితులు ‘ప్రసాద్’ అని పిలుస్తారు.’ చిరునవ్వుతో అన్నాడు.

‘ఇంతకూ నన్నే పేరుతో పిలవమంటారు?’

‘అది మీ యిష్టానికే వదిలేశాను.

‘అయితే మీ స్నేహితునిగా ‘ప్రసాద్’ అని పిలుస్తాను.’

‘మీరు స్నేహితులుకారు. ప్రాణ దాతలు స్నేహానికన్న మించిన బంధంతో మీరు నన్ను బంధించారు. మీ యిష్టంవచ్చిన పేరుతో పిలవవచ్చు.’ ఆప్యాయంగా ప్రభాకరాన్ని చూస్తూ అన్నాడు ప్రసాద్. ఇద్దరూ చిరునవ్వు నవ్వుకున్నారు.

(ఇంకాఉంది)

# కాశ్యాంతు మరణాన్ముక్తిః



## ధర్మపథం... బులుసు వేంకటరమణయ్య

‘కాశీ క్షేత్రంలో మరణించినంత మాత్రానే ముక్తి కలుగుతుందని మన పెద్దలు చెప్తారు. అందుకోసమే సనాతన ధర్మంమీద అభినివేశం ఉన్నవారు చివరి దినాల్లో కాశీలో నివశించాలని కోరుకుంటారు.

‘అహంకాశీం గమిష్యామి
తత్రైవ నివసామ్యహం,
ఇతి బ్రువాణః సతతం
కాశీ వాసఫలం లభేత్’

అని కాశీ నివాసాన్ని మనస్సులో సంకల్పించుకుని, అందుకు ప్రయత్నం చెయ్యలేకపోయినా, ఎప్పుడూ ‘కాశీకి పోతాను’ అని అనుకుంటూవుంటేనే చాలు! కాశీలో నివసించిన ఫలం లభిస్తుందని దీని భావం. ‘కాశి’ అనే పేరువల్లనే అది మోక్షాన్ని ఇచ్చేది అని తెలుస్తూఉన్నది. సనాతన ధర్మంమీద ఆసక్తి ఉన్న వాళ్ళందరూ జీవితంలో ఒక సారయినా కాశీకి వెళ్ళాలని, తొమ్మిది మాసాలకు బదులుగా తొమ్మిది దినాలు అక్కడఉన్నా దేహం చాలించిన తర్వాత నరక యాతనలు ఉండవని విశ్వసిస్తారు.

అట్టి నమ్మకం ఉన్నప్పుడు కాశీలో అడుగు పెట్టగానే మనస్సుకు కొంత సంతృప్తి కలుగుతుంది. గంగానదిలో స్నానం చెయ్యగానే మనస్సుకు ప్రశాంతత ఏర్పడుతుంది

గంగలో స్నానంచేస్తూ, విశ్వేశ్వరుని దర్శించుకుంటూ కాలం గడుపుతే చాలును. ఏ తపస్సూ చెయ్యనక్కరలేదు. దాన ధర్మాలతో నిమిత్తంలేదు. మోక్షప్రాప్తికోసం యోగాన్ని అభ్యసించ నక్కరలేదు. ఎటువంటి కర్మకాండతోనూ అవసరంలేదు. కాశీలో చాలాకాలం నివసించడం కూడా అనవసరమే! అక్కడ దేహత్యాగం చేస్తే చాలు మోక్షప్రాప్తి కలుగుతుంది.

ఈ విషయాన్నే క్రింది శ్లోకభాగాలు తెలుపుతున్నవి —

‘దేహత్యాగోహి వైదానం
దేహత్యాగోహి వైతపః’
దేహత్యాగోఽత్రవైయోగో
దేహత్యాగోఽత్రవైక్రియా
దేహత్యాగాతిరేకేణ
సత్కర్మనహి విద్యతే
కాశ్యాంతు మరణాన్ముక్తిః...’

‘కాశీలో శరీరం విడవడమే ఒకదానం. అదే తపస్సు. దేహత్యాగమే యోగం. అదే అక్కడ చేయవలసిన విధి విహిత కృత్యం. దేహత్యాగాన్ని విడిచిన సత్కర్మ కాశీక్షేత్రంలో మరొకటి లేనేలేదు. అక్కడ మరణించిన మాత్రముననే మోక్షం లభిస్తుంది’ అని పై దాని అభిప్రాయం.

కాశీలో మరణించిన మాత్రమున ముక్తి ఎలా కలుగుతుంది?

కాశీలో ముఖ్యదైవం విశ్వేశ్వరుడు. అతనికి తన నగరంలోఉండే అందరిమీదా ప్రగాఢమైన వాత్సల్యం. అందువల్ల అక్కడ మరణ శయ్యమీదఉన్న వారి చెవుల్లో తారక మంత్రమైన రామ నామాన్ని వినిపిస్తాడు. ‘రామ’ అనే దానిలో శివకేశవ మంత్రాల బీజాక్షరాలున్నవి కదా! దాన్ని సాక్షాత్తూ శివుడే ప్రాణోత్క్రమణ సమయంలో ఉపదేశిస్తే ముక్తి తప్పక కలుగుతుంది. ఇందులో ఏమీ సందేహంలేదు

అందువల్ల ‘కాశ్యాంతు మరణాన్ముక్తిః’ అని మనవారి నమ్మకం’



# దగాపడిన తల్లి

కె. లక్ష్మీసాయి

నువ్వెళ్ళిం తరువాత ఎంత బాధ పడ్డానో నీకు తెలియదు. నిన్ను పెట్టిన బాధలు అనుక్షణం కళ్ళముందర కదులుతోంటే ఎంత నరకం అనుభవించానో... అబ్బ...తలచుకొంటే...'

నవ్వింది శకుంతల. 'ఆ నాడు నేను యింట్లో ఉంటే అనుభవించినంత నరకమా!'

'నిజమే! శకుంతలా! ఏ శనిదేవత నెత్తిన కూర్చుని అట్లా ఆడించిందో కాని.'

'శనా!' హేళనగా నవ్వింది. కావాలని ప్రేమించి తెచ్చుకొన్నసంస్కారవంతురాలు.' అయినా ఇప్పుడవన్నీ ఎందుకు? జరిగిన గతం మీపశ్చాత్తాపాలతో మారిపోదు. అసలిప్పుడెందుకొచ్చారు?' కఠినంగా అంది కిటికీ చువ్వల్లోంచి చిక్కగా అల్లుకుపోయిన చీకటిని చూస్తూ.

'అంత కఠినంగా మాట్లాడకు శకుంతలా! అంత కఠినంగా మాట్లాడకు. హరికోసం, నీ కోసం నా మనసెంత విలవిల్లాడి పోతోందో నీకు తెలియదు.'

'ప్రేమ కాబోలు' వ్యంగ్యంగా నవ్వింది.

'నువ్వెంత హేళనగా మాట్లాడినాసరే! అదలించే పెద్దదిక్కులేక డబ్బు, యౌవ్వన మదంతో కళ్ళు మూసుకుపోయాయి. అంతా తెలుసుకొనే సరికి నా అనుకొన్న వాళ్ళు నాకు దూరమైపోయారు శకుంతలా! నువ్వెళ్ళిపోయిన తరువాత రెండేళ్ళు ఎలా గడిపానో నాకే తెలియదు. స్నేహితులు. మద్యం. వీటితోనే లోకం...కళ్ళు తెరిచే సరికి ఎంత పతనమయ్యానో తెలిసింది. చుట్టూ ఉన్న వాళ్ళు నా అసమర్థత ఆసరాగా ఎవరికి అందినంత వాళ్ళు స్వాహా చేశారు. వ్యాపారంలో అపరిమితమైన నష్టం వచ్చింది. నాకు ఆప్తులనుకొన్న వాళ్లే ముఖాలు చాటు చేసుకొన్నారు. ఇంట్లో ఉన్న అమ్మ నగలన్నీ అమ్మేశాను. కొంత అప్పుచేసి ఎలాగోలాగ మళ్లీ నిలబడ గలిగాను. నా వ్యాపారం సొంతంగా చూసుకోవడం అలవాటు చేసుకొన్నాను. అదృష్టం కలిసొచ్చింది. లక్షలు గడించాను. గడిస్తున్నాను! కాని...ఎవరికోసం? ఎవరు సంతోషించను? మదంలో భార్యను కొడుకును దూరం చేసుకొన్నాను. ఎంత సంపాదించినా ఏదో అసంతృప్తి. మీ ఇంటికి వెళ్లాను. అప్పటికే మీరు అక్కడనుండి వెళ్లిపోయారన్నారు. నా అదృష్టం అంతే అనుకొన్నాను. కాని ఇలా కలుసుకొంటామని కలలోకూడ అనుకోలేదు. నేను చాలా అదృష్టవంతుణ్ణి, శకుంతలా అదృష్టవంతు'...

'కాదు!' అరిచింది శకుంతల. గడచిన గతమంతా గిర్రున తిరుగుతూంటే కన్నీరాపుకోలేక. 'చాలా దురదృష్టం. మిమ్మల్ని కలుసుకోవడం నా దురదృష్టం.'

'శకుంతలా!' ఆశ్చర్యంగా చూశాడు శ్రీహరి. 'అవును. జరిగిందంతా మరచిపోలిగాను. అంతా ఒక పీడకలగా జరిగిపోయిందనుకొన్నాను. కానీ...కానీ...ఇలా ఎదురై మళ్లీ బాధిస్తుందనుకోలేదు. మీరు మళ్లీ ఎందుకొచ్చారు? ఎందుకిలా బాధించ వూనుకొన్నారు? దయచేసి మా బ్రతుకు మమ్మల్ని బ్రతకనివ్వండి. ఇన్నేళ్ల తర్వాత మీ ఆదరమూ వద్దు! మీరూ వద్దు!' జీరపోయిన కంఠంతో అంది శకుంతల.

'శకుంతలా!' జాలిగా చూశాడు శ్రీహరి. 'జరిగినదంతా మర్చిపోవడమా!' చిత్రంగా చూసాడు.

'అవును! మర్చిపోవాలి! మర్చిపోయాను కూడా! ఎన్నో ఆశలతో మిమ్మల్ని ఎంతో ఉన్నతంగా వూహించి మీ చేతుల్లో పెట్టి, తన ఎదుటే తన కూతురి కాపురం కూలిపోతే భరించలేక పిచ్చివారయిపోయిన నాన్న, కూతురు కాపరం స్వర్గం అనుకొన్న అమ్మ అల్లుడి చిద్విలాసాలు విని గుండె పగిలి చచ్చిపోయిన విషయాలు! వీటన్నిటి కారణం మీరని మరచిపోవాలి కదూ!' ఉబుకుతున్న కన్నీరాపుకోలేక రొప్పుతూ శ్రీహరి వైపు తీక్షణంగా చూస్తూ 'మర్చిపోయాను. అందర్నీ మర్చిపోయాను. కాలం ఎన్ని జ్ఞాప

కాలన్నైనా మరచిపోయేలా చేస్తుంది. వాళ్ళందరితోపాటు మిమ్మల్నీ మరచిపోయాను. నాకు భర్త, హరికి తండ్రి ఉన్నాడని మర్చిపోయాను.'

'శకుంతలా!' దగ్గరగా వచ్చాడు శ్రీహరి. 'గతమంతా గుర్తు చేసుకోవడంవల్ల జరిగేదేముంది? బాధ తప్పితే! మనిషన్న తరువాత తప్పులు చేయకుండా ఉండడు. నేను ఇంకా కాస్త ఎక్కువే చేశాననుకో! ప్లీజ్, జరిగింది మనసులో పెట్టుకోకు. మనింటికి వెళ్దాం. వచ్చెయ్. ఇంత అజ్ఞాతంగా బ్రతకాల్సిన ఖర్మ మీకేమిటి?'

'మనిల్లా! హుం! నేనేనాడైతే ఆ గడపలోంచి అడుగు బయట పెట్టానో ఆనాడే ఋణం తీరిపోయింది ఆ యింటికీ, నాకూ. తిరిగి రావడమా? ఉహూ! కలలో మాట.' తీక్షణంగా చూసింది. 'పాపం పెద్దవారయ్యారు మీరు. ఒక తోడు కావలసిన అవసరం ఏర్పడింది. మీ అదృష్టం కొద్దీ చేతికందివచ్చిన కొడుకు కనపడ్డాడు దేముడిలా! ఇన్నేళ్ళుగా లేని ప్రేమ, అభిమానం, సంబంధం పొర్లుకొచ్చాయి. చేసిన తప్పులన్నీ డబ్బుతో ప్రక్షాళన చేసుకొందామని కొండంత ఆశతో వచ్చినట్లున్నారు.'

ఉబికివస్తున్న కోపాన్ని బిగబట్టుకొని హరి ఫోటో వంక చూడసాగాడు శ్రీహరి.

'చాలా పొరబడ్డారు మీరు. మీ అంతస్థు డబ్బు చూసి మోసపోయే రోజులు గతించాయి. మీకు, మాకు ఏ సంబంధం లేదు. మా మానాన్న మమ్మల్ని బ్రతకనివ్వండి. మాకు ఎవ్వరూ లేరు, వాడికి నేను, నాకు వాడు తప్ప.'

'శకుంతలా!' కోపంగా అరిచాడు. 'నీ కాళ్ళ దగ్గరికి వచ్చాననేగా ఇంత చులకన! నిన్ను మభ్యపెట్టవలసిన అవసరమేమీ లేదు. హూ! డబ్బంటే తోడు ఎంతమందయినా వస్తారు! నా వాళ్ళని ఆశలో వస్తే యింత హీనంగా మాట్లాడతావా.'

'యింకేం! ఆ డబ్బుతోనే కాలక్షేపం చేయండి. మేమెందుకూ! మధ్య'

నిర్లక్ష్యంగా నవ్వాడు. 'అంత అవసరం లేదు శకుంతలా! హరి నీకు మాత్రమే కాదు కొడుకు. ఎదుటపడి వేడుకొంటే నీఅంత కఠినుడుమాత్రం అవడు.'

ఒణికిపోయింది శకుంతల. 'ఏమిటి మీ ధైర్యం! ఇన్నేళ్ళుగా ముఖంగూడ ఎరుగని మీరువెళ్ళి, రమ్మంటే ...'

'అదే రక్తసంబంధం శకుంతలా!'

'కాదు.' పిచ్చిగా అరిచింది. అది రక్తసంబంధం కాదు. ధన సంబంధం. మీడబ్బు చూసి కన్నతల్లికి ద్రోహం చేసేటంత నీచుడు కాదు, వాడు. పెంచి పెద్దచేసిన తల్లికంటే, నా రక్త సంబంధంకంటే గొప్పదా మీ సంబంధం! రాడు! రాడు! రాడు! రక్త సంబంధమంటూ మోసం చేసుకొని మీ డబ్బునుచూసి మోసపోయే పసిపిల్లవాడు కాదు.' ఆవేశంలో చెప్పుకుపోతోంది. అప్పుడే తననుంచి దూరంచేస్తున్నట్లు వాణికి పోయింది శకుంతల, కొడుకును తలచుకొని.

'శకుంతలా! ఆఖరుసారిగా చెబుతున్నాను. నీ పట్టుదలతో ఆవేశాలతో, ఎంతో ఉన్నతంగా ఉండవలసిన వాడి భవిష్యత్తు నాశనం చేయకు.' 'హుం! భవిష్యత్తు! వాడి భవిష్యత్తు దృష్టిలో పెట్టుకునేనా ఆనాడు పసిపిల్లవాడనిగూడ కనికరం లేకుండా వదలివేశారు! ఇంతకాలంగా లేని వాడి భవిష్యత్తుమీద మీకు ఇంత చింత అనవసరం. ఏ దైవం ఇన్నాళ్ళూ వాడిజీవితాన్ని తీర్చి దిద్దాడో ఆయనే చూస్తాడు.' 'అయితే రావన్నమాట!' ఓటమిని పరిహసిస్తున్న మనస్సును అదుపులో పెట్టుకుంటూ, మొహమంతా కోపంతో ఎర్రబడిపోగా ఆవేశంతో అడిగాడు. 'మిమ్మల్ని చూస్తుంటే నవ్వు వస్తోంది. యిదేం బొమ్మలాటా? రమ్మంటే రావడానికి! పొమ్మంటే పోవడానికి!' నిశితంగా అంది. 'జీవితంలో సగానికి పైగా గడచిపోయింది. ఇంకా ఇప్పుడీ తాపత్రయం దేనికి? జీవితాన్ని ఆనందంగా అనుభవించే అదృష్టం నాకు, ఆ ఓర్పు మీకు లేకపోయాయి అప్పట్లో ఇప్పుడు అంత ఉన్నతమైన జీవితం పిలుస్తున్నా వచ్చేటంత గుండెదిటవు నాకు లేకపోతోంది. మనసు, మమత బండబారి పోయాయి. హరి చదువు పూర్తి కాబోతోంది. రేపో, మాపో ఉద్యోగస్తుడు కాబోతున్నాడు. మిగిలిన జీవితం వాడి నీడలో విశ్రాంతిగా గడిచిపోతుంది. మీకు డబ్బుంది, ఎంతమంది బంధువుల పెట్టయినా! యింకా ఈ జంఝాటం దేనికి? దయచేసి ఇకవెళ్లండి. ఇంకెప్పుడూ రాకండి. ప్రశాంతమైన మా జీవితాలను కల్లోలం పరచకండి. మీకూ మాకూ ఇక...ఇక...ఏ సంబంధం లేదు.' కళ్ళలో తిరుగుతున్న నీటిని కళ్ళతోనే వారిస్తూ ముఖం తిప్పుకొంది. 'ఆడదానికి ఇంత అహం, పట్టుదలా పనికిరాదు, శకుంతలా! భర్తవచ్చి పిలుస్తున్నా రానన్నదాన్ని నిన్నే చూస్తున్నాను. సరే కాని! నీ పంతం ఎంత నెగ్గుతుందో చూస్తాను!' హరే నా దగ్గరకువస్తే అప్పుడయినారావా?' కోపంగా లేచి హరి ఫోటోవంకచూసి చరచరా బయటకు వెళ్లిపోయాడు శ్రీహరి. కాదు చప్పుడువింటూ బండబారిన మనస్సుతో అట్లాగే చేరబడిపోయింది గుమ్మానికి, గతం కళ్ళముందర తిరుగుతుంటే శకుంతల.

* * *

రాజయ్యకు ఒక్కగా నొక్క కూతురు శకుంతల. పల్లెలోఉన్న పొలం, ఇల్లుఅమ్ముకొని పట్నానికి వచ్చేశాడు. బట్టలవ్యాపారం పెట్టి,కూతురును పెద్దచదువు చదివించాలని రాజయ్యకోరిక. కాని శకుంతలకు చదువుమీద అంతశ్రద్ధ వుండేదికాదు. స్కూల్లో చేర్పించాడు. గిర్రున కాలం తిరిగిపోయింది. శకుంతల ఎస్.ఎస్. ఎల్. సి. పూర్తి చేశాననిపించింది. ఇంట్లో ట్యూషను పెట్టించి, తను పోరి, కూతురిని ఎస్. ఎస్. ఎల్. సి. అనిపించేసరికి రాజయ్యకు మళ్లీ తాను చదువుకున్నంత పని అయింది. ఇక చదవ నసేసరికి ఏమీ చెయ్యలేక పోయాడు. దానికి తోడు తన భార్య 'పదిహేనేళ్లు వచ్చినయి చదువు వద్దూ, చట్టుబండలూ వద్దు సంబంధాలు చూడండి' అని పోరు మొదలెట్టేసరికి కూతురి పెళ్లివైపు దృష్టిని మరల్చాడు. కాని ఎన్ని కుదరాలి! ఆడపిల్ల పెళ్లంటే మాటలా? ఎన్ని చెప్పులరగాలి అందునా రాజయ్యకు ఏ సంబంధం ఓ పట్టాన నచ్చేది కాదు. అందం, చదువు, ఆస్తి, ఈడు జోడు, యివన్నీ కుదిరి అల్లుడి రూపం దాల్చేసరికి యింకో మూడేళ్లు గడిచాయి. చివరికి తాను వూహించిన అల్లుణ్ణి తాహతును మించిన సంబంధం అయినా పట్టుకొన్నాడు. పెళ్లి పీటలమీద శకుంతల శ్రీహరులను చూసి రతీ మన్మదులలాగా వున్నారని తెగ చెప్పుకొన్నారు శ్రీహరికి తలచెడిన మేనత్త తప్ప ఎవరూ లేరు. శకుంతల తెగ సంబరపడిపోయింది, పెళ్ళిలో శ్రీహరి పలుకుబడి చూసి, వచ్చిన స్నేహితబృందాన్ని చూసి. ఏడాది లోపల కాపరానికి తీసుకుపోయాడు. అంత బంగళ

# దగాపడిన తల్లి

[illegible] చూసి శకుంతల ఉక్కిరిబిక్కిరి అయింది. అంత ఇంట్లోనూ, తనూ, విధవ మేనత్త సూరమ్మగారు, వంటమనిషి, శ్రీహరి. ఇద్దరు నౌకర్లు. అంతే. శ్రీహరి ప్రొద్దున పోతే రాత్రెప్పుడో ఇల్లు చేరేవాడు. శకుంతలకు తోచేదికాదు. శ్రీహరితో అంటే క్లబ్బుల్లో చేరమనేవాడు. గతుక్కుమనేది శకుంతల. తనకు బయటకు పోవడానికే జంకు. ఇంకా క్లబ్బులకు కూడానా! ఇంతలో కొన్నాళ్ళకి సూరమ్మగారి ఏకైక పుత్రిక, లలిత, బావ పెళ్ళాన్ని చూద్దామనిట హఠాత్తుగ దిగబడింధి ఒక సాయం సమయంలో. తెల్లబోయింది శకుంతల ఆమెను చూసి. యిక చూడాలి సూరమ్మ గారి హడావుడి. 'ఇన్నాళ్ళకు ఈ ముసలి తల్లిని చూడాలనిపించిందేటే! చివరికి బావ పెళ్లికి కూడ రాలేదు. వాడు ఎంత బాధ పడిపోయాడో తెలుసా! అయినా మీకు తీరిక దొరకద్దూ! ఎప్పుడూ వూళ్ళు తిరగటమే వాయె!' అంటూ పరామర్శించలేక హైరాన పడిపోయింది. 'ఏం చెయ్యనమ్మా? ఎంత ప్రయత్నించినా వీలుపడందే! నాకు మాత్రం ప్రాణం అంతా బావ మీదే ఉందనుకో!' అంటూ వయ్యారంగా శకుంతల వంక చూస్తూ చెబుతూంటే శకుంతలకు కంపరం పుట్టేది. 'నీకు తెలియదమ్మా! వాడికి ఇదంటే ఎంత ప్రాణమని ! ప్చ్ ! అయినా ఏమిటో! ఈ ఇంటికి కోడలు కావల్సింది. వాడికా అదృష్టం లేకపోయింది' అంటూ మొదలెట్టేసరికి శకుంతల అక్కడనుండి లేచి వెళ్ళింది. ఆ తరువాత వంటమనిషి మూలంగా నిజం తెలిసింది, సూరమ్మగారెంత ప్రయత్నించినా శ్రీహరి ఆ రూపసిని చేసుకోడానికి ఇష్టపడలేదనీ, భాగా వయసు ముదిరిన లక్షాధికారికిచ్చి కట్టబెట్టిందని. వచ్చి నెల అయినా కదిలే ప్రయత్నమేమీ చెయ్యటం లేదు లలిత. క్రొత్తగా శ్రీహరి పెందలాడే ఇంటికివచ్చి క్లబ్బుకు బయలుదేరదీసేవాడు. వన్నెల విసనికర్రలా తయారయ్యే లలితను చూసి అసహ్యించుకొనేది శకుంతల. దానికి తోడు సూరమ్మ 'అమ్మాయి ! శకుంతలా ! అలా గుడికి వెళ్దామా ! క్లబ్బులకు నీకేం అలవాటే ? దానికయితే అలవాటయి పోయింది. వాళ్లిద్దర్నీ వెళ్లి రానీ !' అంటూ వెనక్కిలాగేది. శకుంతల పని కక్కలేక, మింగలేక అన్నట్లయ్యేది. నవ్వుకుంటూ వెళుతున్న యిద్దర్నీచూసి రోషంతో కుమిలిపోయేది. ఒక్కొక్క రోజు బ్రాందీ వాసనతో యిల్లు చేరుకున్నవాళ్లను చూసి తెల్లబోయేది. భర్తతో 'ఆ పరాయి పిల్లతో ఆ షికార్లు, ఆ పూసుకు పూసుకు తిరగడాలు ఏమిటీ?' అంటే కోపంతో ఇంతెత్తునలేచి 'అది నాకు పరాయిదా ? నా మేనగోడలు. నా ఇష్టం వచ్చినట్లు తిరుగుతాను. నీ అదుపు ఏమిటి? నా ఖర్మకొద్దీ దొరికావు. ఒక్క క్లబ్బుకురావు. ఒక సరదా లేదు. పల్లెటూరి గబ్బిలాయిలాగా! ఛీ ఛీ!' అంటూ ఛీత్కరించేవాడు. ఈ మార్పు చూసి నిశ్చేష్ఠురాలయింది, శకుంతల. ఇంకో నెల ఉండి, వెళ్లింది, లలిత. ఈ రెండు నెలల్లో, ఎంతమార్పు చూడాలో, అంత మార్పు చూసింది శకుంతల, శ్రీహరిలో. 'ఆc! మొగవాడన్నాక తిరగకుండా ఎక్కడ ఉంటాడు ! పెద్ద పెద్ద వాళ్ళందరు త్రాగటంలేదూ! దీనికి ఇంత ఆర్భాటం దేనికీ !' అనేది సూరమ్మ, రాత్రిళ్లు 12 గంటలు దాటినా రాని భర్తకోసం ఎదురు చూస్తున్న శకుంతలతో. వచ్చినా తూలి పోతూ పైకి వెళుతున్న భర్తనుచూసి కన్నీళ్లు నింపుకునేధి శకుంతల. ఆసూరమ్మ సినిమాలో సూర్యకాంతం లాంటిదని తెలుసుకోటానికి ఎంతో కాలం పట్టలేదు, శకుంతలకు. శ్రీహరి ఇంట్లో, ఉండటమే తక్కువయిపోతోంది. ఉన్న కాసేపుకూడా ఏదో మిషమీద ఆ ఛాయలకుకూడా వెళ్ల నిచ్చేది కాదు సూరమ్మ శకుంతలను. ఆవిడ అధికారంచూస్తూ ఏమీ చెయ్యలేక పోయేది శకుంతల. నెమ్మదిగా ఫ్రెండ్సు ఇంటికి రావటం ప్రారంభమైంది. ఒక్కొక్కళ్లను చూస్తే కాళ్లల్లోంచి వణుకు ప్రారంభమయ్యేది శకుంతలకు. కాఫీలుఇచ్చి రమ్మంటే తను వెళ్లననేది. 'అయ్యో! ఇందేం సిగ్గమ్మా. నిన్నేం కొరుక్కుతింటారా! యిదే మా లలిత అయితేనా' అంటూ తనే వెళ్లేది. సాయంత్రం అయ్యేసరికి అదో క్లబ్బులా తయారయ్యేది. అప్పుడప్పుడు అమ్మాయిలుకూడా వెలుగుతుండేవారు, వాళ్లల్లో. ఇంటికి పెద్ద దిక్కయి చెడిపోతున్నవాడిని మంచిదోవలో పెట్టడానికి బదులు దానికి ప్రోత్సాహమిస్తున్న సూరమ్మగారిని చూస్తే ఒళ్లు దహించుకు పోయేది శకుంతలకు. త్రాగి వచ్చిన మైకంలో కొట్టిన దెబ్బలకు వోర్చు కోలేక ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్న శకుంతలను చూసి వంటమనిషి జాలిగా 'ఊరుకో అమ్మా ! ఏం చేస్తావు? నరకంలో వచ్చిపడ్డావు. తనకూతురు ఈ ఆస్తికి వారసురాలు కాలేదని ఆయన్ను అన్నివిధాల నాశనం చేస్తోంది, ఆ సూరమ్మ. నేను అనకూడదు గాని,అయ్యగారికి పెళ్లికి ముందర నించి ఉన్నాయి ఈ అలవాట్లన్నీ. యిప్పుడు క్రొత్తగాదు. డబ్బుంది కాబట్టి బయట పడలేదు.' ఆ మాటలు విని దిమ్మరపోయింది. 'అయితే...అయితే ..తన భర్త ఒక త్రాగుబోతూ, వ్యభిచారీనా? ఎంత మోసపోయాము! డబ్బును చూసి తండ్రి గుణగణాలను అంచనా వేసాడు. ఎంత దగా! వీల్లేదు. ఇట్లా చెడిపోనివ్వను. ఈవిడ ఎవరు? అత్తగారా! ఆడబిడ్డా. నా మీద అధికారం చేయడానికి!' లేని తెగింపు, ధైర్యం వచ్చాయి శకుంతలకు. కాని ఆ తెగింపు, ధైర్యానికి ఫలితం, ఒంటి మీదపడే దెబ్బలవల్ల వోర్చుకోలేని బాధ. శకుంతలలోని ఈ ధైర్యం చూసి సూరమ్మ రెచ్చిపోయింది. శ్రీహరితో ఉన్నవీ, లేనివీ చెప్పి ద్వేషం పుట్టించింది. శకుంతల అంటె 'ఏం! నీతోనే ఉట్టికట్టుకు వూరేగాలా? ఒక చదువా! అందమా! నీ వలన వాడికి ఒక్క సరదా అయినా తీరుతోందా ? శనిలా దాపురించావు వాడి ప్రాణానికి. నీ లాంటి ఎద్దు మొద్దు స్వరూపాన్ని కట్టుకొని ఇంకా వాడు కాపురం చేస్తున్నాడు. సంతోషించు. పైగా నిక్కు ఒకటా!' అంటూ శ్రీహరి ఎదుటే అంటుంటే గర్వంగా చూసేవాడు తప్పితే పల్లెత్తు మాట అనేవాడు కాదు.

* * *

రెండేళ్లు గిర్రున తిరిగిపోయాయి. పండక్కి తీసుకువెళదామని వచ్చిన రాజయ్య కూతుర్ని చూసి గుర్తు పట్టలేకపోయాడు. కళ్లల్లో ప్రాణాలు పెట్టుకొని అస్థిపంజరంలా ఉన్న కూతుర్ని చూసి తెల్లబోయాడు. 'ఏమిటో నండీ! రోజురోజుకు ఇలా అయిపోతోంది పిల్ల. ఎంతమంది డాక్టర్లకు చూపించినా ఫలితం కనబడ్డంలా. అంతకీ నేనూ, వాడూ గిజగిజలాడి పోతుంటాము. ఉత్త మనిషివి కూడా కాదే, జాగ్రత్తగా వుండమని. ప్చ్. అయినా ఏమిటో! ఏశని పట్టిందో ఏమిటో పిల్లకు.' ఉన్న రెండు రోజులు ఉక్కిరి

బిక్కిరయ్యే అతిథి మర్యాదలతో, పెదవి విప్పని కూతురి మౌనంతో అంతకంటే ఏమి ఎక్కువ తెలుసుకోలేక పొయ్యాడు రాజయ్య. పండక్కి కూడా రానని చెప్పి తండ్రిని పంపేసింది. 'ఏం! ఈ ఆస్థంతా ఎవరన్నా తినిపోతామనా పండక్కి కూడా వెళ్లలేదు?' అంటూ దెప్పింది సూరమ్మ. పురిటికికూడ పుట్టింటికి వెళ్లకుండా ఆస్పత్రిలోనే పురుడు పోసుకుంది శకుంతల. కాని ఇంటికొచ్చేసరికి పరిస్థితులు పూర్తిగా విషమించాయి. ఎవరో కాంతం అనే పిన్ని విసనకర్ర వచ్చి ఇంట్లోనే ఉంటోంది. 'వాడి స్నేహితురాలట నీకరూ లేరట. నువ్వు కూడా లేవు కదా ! ఒక్కదాన్నేనని మనింట్లోనే ఉంటోంది' అంది సూరమ్మ.

కనీసం పిల్లవాణ్ణి చూసైనా మారతాడేమో నని ఆశించిన శకుంతల ఆశలు అడియాస లయ్యాయి. తన ఎదుటే వాళ్ల రాసక్రీడలు చూస్తూ సహించలేని తన్ను, జాలింతని కనికరంగూడ లేకుండా గొడ్డును బాదినట్లు బాదేవాడు. పైగా స్పష్టంగా చెప్పేశాడు. 'నీకు, నాకు కుదరదు. నీ దారి నువ్వు చూసుకో! నేను, కాంతం పెళ్ళి చేసుకుంటాం' అని. శక్కుంతలకు అర్థమైపోయింది. ఇక ఎన్నాళ్లో తను ఇంట్లో ఉండదు. తన బిడ్డ భవిష్యత్తు ఏం కాబోతుంది? ఎక్కడికి వెళ్లాలి? తనను చూసి తల్లిదండ్రులు గుండెలు పగిలి చావరూ ? దినదిన గండంగా జరుగుతున్నాయి రోజులూ, వారాలూ.

ఒకరోజు హఠాత్తుగా మనవడితోసహా బండి దిగుతున్న కూతురిని చూసి నిర్ఘాంతపోయాడు రాజయ్య. 'నేను...నేను శకుంతలను నాన్నా...' దాని నవ్వు తెచ్చుకుంటూ తండ్రిని పలకరించి లోపలికి పరిగెత్తింది, దుఃఖాన్ని ఆపుకుంటూ. అల్లుడి చిద్విలాసాలు మాచాయన వింటున్న రాజయ్య కూతురి నోట విని మ్రాన్పడిపోయాడు. ఇంకో ఆమెను తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాడని, కోర్టుకు వెళ్ళి తేలుస్తానని రంకె వేసిన తండ్రిని ఆపింది శకుంతల. 'ఒద్దు నాన్నా! జరిగింది పదిమందికి తెలియటం తప్పితే ఫలితం ఉండదు. ఇక నేనక్కడికి వెళ్ళలేను. వెళ్లను. వెళ్లినా ఆ ముగ్గురు మమ్మల్ని బ్రతకనివ్వరు. బలవంతానయినా మా పీడ వదల్చుకొంటారు. దాన్ని చేసుకోవటానికి నేను రాసి ఇవ్వలేదని రోజూ గొడ్డును బాదినట్లు......' యిక చెప్పలేక భోరున ఏడుస్తున్న కూతురి వంక నిర్వికారంగా చూస్తూ ఉండిపోయాడు రాజయ్య. ఆరోజు నుండి అల్లుడనేవాడిమాట మర్చిపోయారు. కాని తల్లి ఆ దెబ్బకు తట్టుకోలేక మంచం పట్టి నెల రోజులలోపలే కన్ను మూసింది. విరక్తితో వ్యాపారం నిర్లక్ష్యం చేసాడు రాజయ్య. చివరికి ఇల్లు, ఒక ఎకరం పొలం తప్ప ఏమీ మిగల్లేదు. కూతురితోనూ, మనవడితోనూ మౌనంగా రోజులు దొర్లిస్తున్నాడు. శకుంతల మిషను కుట్టటం నేర్చుకో నారంభించింది. 'నాన్న' ఆనాడు చదువుకోమని పోరితే చదువుకోలేదు. ఆ చదువే ఉంటే ఈ సమయంలో ఎంత అక్కరకు

# దగాపడిన తల్లి

వచ్చేదో! హుఁ! తన ఖర్మ ఇలా ఉంటే మంచి బుద్ధులు ఎలా పుడతాయి' అనుకొని నిట్టూర్చేది. మిషను త్రొక్కటం శరీరానికి సరిపడక గుండెనెప్పి వచ్చేది. అనుకుంటూ ఉండగానే హరికి ఏడేళ్లు వచ్చాయి. రాజయ్యకు భూమిమీద నూకలు అయిపోయాయి. దెబ్బమీద దెబ్బ తగులుతూంటే బెంబేలెత్తి కృశించిపోయింది. కొడుకు అమాయకమైన ముఖం చూస్తూ దిగులు మర్చిపోయింది. తప్పదు. వీడి భవిష్యత్తు గూర్చి అయినా తను ధైర్యంగా ఉండాలి. 'నేనుకూడా ఏదైనా అయితే యీ పని వాడు...హరిని స్కూల్లో చేర్పించింది. ఇంటి దగ్గర విస్తళ్లు కుట్టడం, మిషను కుట్టడం, తీరికలేకుండా ఏదో ఒకటిచేస్తూ లేదనుకోకుండా కాలం గడుపుతోంది. ఇంట్లో తండ్రి ఫోటో చూస్తూ ఎప్పుడూ తండ్రినిగూర్చి ఏవేవో ప్రశ్నలు వేస్తుండే వాడు హరి. 'అమ్మా! అందరూ వాళ్ల అమ్మా నాన్నలదగ్గరుండి చదువుకొంటారు మన నాన్న ఏరమ్మా? పోనీ, మనం వెళదామమ్మా, నాన్నదగ్గరికి' అంటూ అమాయకంగా అడిగే పసివాణ్ణి చూసి—

'వెళదాం బాబు! మీ నాన్న రమ్మన్నప్పుడు తప్పకుండా వెళదాం. మరి నువ్వు చక్కగా శ్రద్ధగా చదవాలి' అంటూ బుజ్జగించేది. తల్లిమాట పొల్లుపోనివ్వకుండా తప్పకుండా బి. కాం వరకు వచ్చాడు హరి. తనుపడ్డ కష్టాలన్నీ గట్టెక్కాయి అనుకుంది కానీ... కాని యిట్లా హఠాత్తుగా భర్త తారసపడతారని కలలోకూడ ఊహించలేదు. 'ప్రశాంతంగా నడుస్తున్న జీవితంలో మళ్లీ ఈ కల్లోలం ఏమిటి? తననుండి వేరుచేసి కొడుకును తీసుకొని వెళ్దామని ప్రయత్నమా? ఉహుఁ. అలా వీలులేదు. అలా జరగదు. హరి అంత తెలివితక్కువవాడా? అయినా, ఏమో చిన్నవాడు. ఉరకలువేసే వయసు. లక్షాధికారిని, నిన్ను కన్నతండ్రిని, ఇలా ఉండటం ఏమి ఖర్మ? అని డబ్బు చూపిస్తే చలించకుండా ఉంటాడా? భగవాన్! నువ్వే రక్షించాలి. నా బిడ్డను నానుండి వేరుచేయకు. ఇన్నాళ్లు మొండిగా బ్రతికింది వాణ్ణి చూసే.'

'ఏమిటమ్మా, అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు లైటుకూడా వేసుకోకుండా?' అంటు లైటువేసిన హరి తల్లి కళ్లల్లో నీళ్లుండడం చూసి కలవరపడ్డాడు. 'ఏమిటమ్మా? ఎందుకేడుస్తున్నావు?' తొట్రుపాటుపడింది. 'అబ్బే ఏమీలేదు నాన్నా! ఎంతసేపయింది నువ్వు వచ్చి? ఏమిటో ఆలోచనలో పడిపోయాను' అంటూంటే గడియారం 10 కొట్టడం వినిపించింది. 'ఎంతసేపయింది తను ఇలా కూర్చుండిపోయి! హరి సినిమాకు వెళ్లడం ఎంత మేలయింది! లేకపోతే ... అమ్మో!' తల విదల్చుకుంటూ లోపలికి వెళ్తున్న తల్లిని వింతగా చూస్తూ ఉండిపోయాడు హరి.

'హరీ! ఈ బట్టలు బాగున్నాయ్యా! దీపావళికని తీసాను.' 'తల్లివైపు, గుడ్డలవైపు అయిష్టంగా చూశాడు హరి. 'ఈసారి టెర్లిన్‌వి తీసిపెడతానన్నావుగా, మళ్లీ ఇవ్వేనా?' దగ్గరగా వచ్చి హరి కళ్లల్లోకి చూసింది.

'అంత డబ్బు ఇప్పుడు ఎక్కడిదిరా? ఈసారి కుట్టించుకుందువుగానిలే. ఈసారికి కానివ్వు' ప్రేమగా తల నిమిరింది శకుంతల. 'ఫో, అమ్మా ప్రతిసారీ ఏదో చెబుతావు' కోపంగా అంటూ వెళుతున్న కొడుకును చూస్తూ 'వీడికి వయసయితే వస్తోందికాని కష్టసుఖాలు తెలియవుగదా!' అనుకొంది.

అర్ధరాత్రి 'హరీ!' అంటూ హఠాత్తుగా లేచికూర్చున్న తల్లిని చూసి 'ఏమిటమ్మా! ఎందుకంత ఉలిక్కిపడ్డావు? పీడకల వొచ్చిందా?' అంటూ తల్లిదగ్గరగా వచ్చిన హరిని పట్టుకొని' 'నువ్విక్కడే ఉన్నావా హరీ! వెళ్లిపోలేదూ! నువ్వు నన్నొదిలి మీ నాన్నతో వెళ్లిపోయినట్లు...' 'నాన్నా! విచిత్రంగా చూశాడు హరి. 'ఆఁ! అబ్బే! ఏమి లేదు. ఏదో పీడకల ఏమిటో అనేస్తున్నాను కదూ!' తడబడింది శకుంతల.

'పో! పోయి పడుకో!' అంటూ అటు తిరిగి పడుక్కుంది శకుంతల. 'ఛీ, ఛీ! ఏమిటలా అన్నాను? పాడుభయం ఎప్పుడూ తండ్రి మాట ఎత్తని నేను అట్లా అంటే వాడేమనుకొన్నాడో!' బలవంతంగా కళ్లు మూసుకొంది.

దీపావళి రోజుల్లోకి వచ్చింది. ఆరోజు వంట్లో బాగుండక హరి కాలేజీకి వెళ్ళలేదు. పడుక్కొని ఆలోచిస్తున్న వాడల్లా హఠాత్తుగా 'అమ్మా! నేనొకమాటడగనా?'

సందేహిస్తున్న హరిని ఆశ్చర్యంగా చూస్తూ బత్తాయి వొలుస్తూ, మంచం మీద కూర్చొని 'అడుగుబాబూ! ఏమిటీ అంత సందేహం?' అంది. 'ఏమీలేదమ్మా నాన్న కనబడి మనల్ని రమ్మంటే' శకుంతల చేతుల్లోని బత్తాయి తొనలు క్రిందపడ్డాయి. ఒణుకుతూ హరిముఖంలోకి చూసింది. 'నీకు కనబడ్డారా!' సొంతం అడగలేకపోయింది, పాలిపోయిన ముఖంతో. 'అబ్బే! లేదమ్మా! వూరికే అడిగాను. అసలు రమ్మంటే...' నసిగాడు హరి. 'హరీ!' చటుక్కునలేచి కిటికీ దగ్గరకు వెళ్ళింది. 'అయిపోయింది. అంతా అయిపోయింది. ఏది జరగకూడదని వెయ్యిదేవుళ్ళకు మొక్కుకుంటున్నానో అదే జరిగిపోయింది. లేకపోతే హఠాత్తుగా వీడికి ప్రశ్న ఎందుకు కలిగింది? తప్పకుండా కనబడే ఉంటారు. తనడబ్బు, హోదా, బంగళా ఇవన్నీ చూపి వాడిని మభ్య పెడుతున్నారు. కొన్నిరోజులుగా వీడి ప్రవర్తన మారిపోయింది. ఎప్పుడూ ఆలశ్యంగా రాని వాడు ఈమధ్య ఆలస్యంగా వస్తున్నందుకు ఏదో ఒకవంక చెబుతున్నాడు. మొన్న సందు మొదట్లో దిగిన కారు స్నేహితుడిదని చెప్పాడు. వీడు...వీడు ఆ ఆకర్షణాలను లొంగిపోతున్నాడా? తను కట్టుకొన్నవన్నీ గాలిమేడలేనా?'

'హరీ!' ప్రశాంతంగా పిలిచింది 'మీనాన్న గారిని చూశావా? ఎక్కడ కనపడ్డారు? ఇంటికి తీసుకువెళ్ళారా?' తల్లివైపు ఒక్క క్షణంచూసి చూపు మరల్చుకొంటూ 'లేదమ్మా ఎవరూ కనబడలేదు. అయినా ఈమధ్య నువ్వు ప్రతిదానికీ కలవరపడి పోతున్నావు' అన్నాడు. 'అంతేనేమో! తనకి ప్రతిదానికి భయంగా ఉంది. అసలిదంతా వాడికేం తెలుసు? ఏదో యాదాలాపంగా వేశిన ప్రశ్నకు తను ఇంత భయపడటం దేనికి? యింతలోనే బయటపడిపోతోంది. ఏమిటో మనస్సు ఒక్కక్షణం ప్రశాంతంగా ఉండటంలేదు. చదువుకునే పిల్లవాడు బయటకు పోకుండా ఎలా వీలౌతుంది? ప్రేమగా కొడుకునుదుటిమీద ముద్దుపెట్టుకుంది. 'నా మనసేం బాగులేదు హరీ! ఏదో పిచ్చిగా వాగుతున్నాను కదూ. పడుకో!' అంటూ వెళ్తున్న తల్లిని చూసి నవ్వుకున్నాడు హరి.

'హరీ! మిషనువాడు బట్టలు తెచ్చాడు. చూడు, పెట్టెలో పెట్టాను.' వంటింట్లో నించి కేకేసింది వెళ్తున్న కొడుకు నుద్దేసించి. 'బాగానే ఉన్నాయిలే అమ్మా' చూడకుండానే సమాధానం ఇస్తున్న కొడుకును చూసి 'పిచ్చి సన్నాసి. కోపం వచ్చినట్లుంది. టెర్లిన్ కుట్టించలేదని!' లేచి బయటకు వచ్చింది. 'ఏరా! టెర్లిను కొనలేదని అలకా?' 'అలకా? అలకెందుకమ్మా? రేపటినించి మనం టెర్లిన్లమీదేగా నడిచేది!' అంటూ తల్లి ముఖం చూసి నాలిక కరచుకొన్నాడు. 'అదేనమ్మా, రేపో పెద్ద ఆఫీసరు అయితే మరి టెర్లిన్లేగా కట్టేది!' అంటున్న కొడుకును గర్వంగా చూచి తృప్తిగా నిట్టూర్చింది. 'హరీ! దీపావళి దగ్గరకు వచ్చింది. మతాబాలు కట్టటం లేదేం?' ఏదో గుర్తుకు వచ్చి ఆగిపోయింది. 'ఎందుకులే అమ్మా రిస్క్. కొందాం. ఈసారి బజారంతా కొనేస్తాను, చూస్తూ ఉండు.' ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు. రెండు రోజులు గడిచిపోయాయి. మర్నాడు ప్రొద్దున్నే లేస్తూ కొడుకు మంచంమీద లేకపోవటం చూసి ఉలిక్కిపడ్డది. ఒక్క గెంతున దొడ్లోకి వచ్చింది 'హరీ' అంటూ. 'చెప్పకుండా ఎక్కడికీ వెళ్లడే!' మళ్ళీ గదిలోకి వచ్చింది. హరి మంచం మీద రెపరెపలాడుతూ ఒక కాగితం పలకరించింది. అప్పటికే గుండెదడ ప్రారంభమైంది. ఒణుకుతున్న చేతుల్తో తీసింది.

'అమ్మకి,

నేను వెళ్తున్నాను. ఎక్కడకో అని కంగారుపడకు. నాన్న దగ్గరకు. కన్నతండ్రి దగ్గరకు వెళ్లడం నేరం కాదనుకొంటాను. నువ్వు అనుమానించినట్లే రెండు నెలల క్రితం నాన్న కనబడ్డారు. కాలేజీకి వచ్చారు. నాకు జ్ఞానం వచ్చాక ఎప్పుడూ చూడని నాన్నని చూడాలనిపించి వెళ్ళాను. కాని నేను వూహించినంత క్రూరత్వం నాన్నలో కనబడలేదు. 'జ్ఞాపకం ఉన్నానా హరీ!' అంటూ కళ్లనీళ్ళు తిరుగుతూ ప్రశ్నిస్తుంటే నాకూడా కళ్ల నీళ్ళు తిరిగాయి. నన్ను ఇంటికి తీసుకొని వెళ్ళారు. ఆ యింట్లో ఆయనొక్కరే. నా కంతా చెప్పారు. తను మనింటికి వచ్చిన సంగతి కూడ చెప్పారు. నువ్వు చాల పొరపాటు చేశావమ్మా. తప్పు లందరు చేస్తారు. ఆయన ఇంకొంచెం ఎక్కువే చేసి ఉండవచ్చు. కాని తన తప్పు తాను తెలుసుకొని పశ్చాత్తాపపడి మన



# దగాపడిన తల్లి

ఇంటికి రమ్మంటే ఎందుకు తిరస్కరించావు? నాన్న ఉండి అనాధలుగా బ్రతకడం మనకేం ఖర్మ? నేను చేసిన ఈ పనికి నీవు కోపగించుకుంటావని తెలుసు. కాని నిదానంగా ఆలోచించి చూడమ్మా. నేను చేసిన దాంట్లో తప్పేమిటి? లక్షాధికారులమయ్యి మనం ఇలా కూటికి గుడ్డకు వెనుక ముందులు చూసుకోవలసిన ఖర్మ ఏమిటి? నీ మనసు మార్చుకొని నాన్నను మన్నించి, అమ్మా నాన్నల నీడను ఉండే అదృష్టం కలిగించమ్మా. జరిగినవన్నీ మరచిపో. నేను నాన్నతో దీపావళినాడు వస్తాను. మనింటికి వెళ్ళిపోదాం. నీతో చెప్పకుండ ఇంత సాహసం చేసిన నీ హరిని మన్నించు.

హరి.'

కళ్ళు తెరిచి చూసేసరికి పక్కింటి బామ్మగారు ఆత్రంగా చూస్తూ 'అదేమిటి శకుంతలమ్మా! అలా పడిపోయావేం? పాలవాడు పిలుస్తూంటే పలకకపోతే తొంగి చూశాను. పడిపోయి ఉన్నావు.' 'కళ్ళు తిరిగి పడ్డాను. అంతే. ఏమిలేదు. నీరసంగా లేచింది. తల తిరిగిపోతన్నది. కళ్ళు చెరువులవుతుంటే 'ఎంత పనిచేశావు హరీ! చిన్నప్పటినుంచి పెంచి పెద్దవాడినిచేసిన నాకంటే నీ కంటికి ఇరవైఏళ్ళ తరువాత కనబడ తండ్రిమీద ఇంత ప్రేమ ముంచుకొచ్చిందా! కాదురా. కాదు. తండ్రికంటె తండ్రి వెనుకనున్న లక్షలమీద ప్రేమ ముంచుకొచ్చింది. చేసిన తప్పులు మర్చిపోవాలా! ఇది నువ్వు చెప్పినంత తేలికా! అంత తేలికా హరీ! హుఁ. హఠాత్తుగా దేవుడిలా చేతికందిన కొడుకు కనబడితే; జయించారు. మీరే జయించారు. డబ్బుకి లొంగనిదేది ఈ రోజుల్లో? హరీ! నా బిడ్డ డబ్బుకు లొంగి కన్నతల్లికి ద్రోహం చేసే నీచుడు కాదని గర్వంగా చెప్పాను. కానీ... కానీ...నా బిడ్డా సామాన్యుడే. తండ్రిచేసిన తప్పులు, పెట్టిన బాధలు ఆయన డబ్బు ముందర తల్లిపడ్డ బాధలు గాలికిపోయాయి.'

హ్హా...హ్హా...హ్హా పిచ్చిగా నవ్వుకొంది శకుంతల.

దీపావళి. అవును. ఇవ్వాళే చీకటిని పారద్రోలి వెలుగును నింపే దీపావళి. కాని, తన బ్రతుకులో మరింత చీకటిని నింపిన దీపావళి. మంచంమీదనుంచి లేవబోయి చేత కాక నీరసంగా మంచంమీద దిండుకానుకొని కూర్చుంది. రెండురోజులయింది తను కళ్ళు తెరిచి. యింకా ఎందుకు తండ్రీ, తనకీబ్రతుకు? ఇంకా ఏం చూసుకొని మొండిగా బ్రతకను? గుండెపట్టుకొని జారగిలపడింది. దీపాలు తోరణాలలాగా అమరుస్తున్నారు. వీధంతా పట్టపగలులా ప్రకాశిస్తోంది. ఈపాటికి కొడుకును దగ్గర కూర్చోబెట్టుకొని ఆనందమంతా సొంతం చేసుకొని వెలిగిపోతుంటాడు. కళ్ళుతెరిచి హరికి కుట్టించిన బట్టలు చేతిలోకి తీసుకొంది. కన్నీళ్ళు బొటబొట రాలి షర్టుమీద పడ్డాయి. నీళ్ళు నిండిన కళ్ళకు అంతా మసకమసకగా కనిపిస్తూంటే 'హరీ! ఈ అమ్మను వదలి ఎలా ఉన్నావురా? నీ తండ్రిలా లక్షలు ఇవ్వలేకపోయినా, అంతకుమించిన ప్రేమతో పెంచానే. అంతా ఎలా మర్చిపోయావు?' పిచ్చిగా బట్టలు తడుముతూ వెక్కి వెక్కి ఏడ్చింది. 'లేరు. ఎవ్వరూ లేరు. అంతా భ్రమ. కట్టుకొన్న భర్త ఏనాడో మోసగించాడు. నమ్మిన కొడుకు దగాచేసి వెళ్ళిపోయాడు. ఇంకా ఎవరికోసం? తీసుకు వెళ్ళడానికి వస్తాడట!' విరక్తిగా నవ్వింది. 'ఇంకా నేనెందుకురా? నీకు కావల్సింది నీకు, ఆయనకు కావల్సింది ఆయనకు దొరికాయి. ఇక నేను...'కొత్తగుడ్డల్ని గుండెకు ఒత్తుకుంటూ నొప్పితో విలవిల లాడింది.

క్రొత్తగుడ్డలతో ఠీవిగా తండ్రితో కారు దిగిన హరికి ఇంటిముందర అంత గుంపు ఉండటంతో ఒక్క ఉరుకున ఇంట్లోకి వచ్చాడు. తనకు కుట్టించిన గుడ్డలు గుండె మీద పెట్టుకుని ప్రశాంతంగా నిదురబోతున్న తల్లిని చూసి కొయ్యబారిపోయాడు. ●

# వారఫలం

**5-3-1971 శుక్రవారం మొదలు**
**11-3-1971 గురువారం వరకు**

**మేషం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది.

స్త్రీలకు :— సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**మిథునం:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం ·** లాభం రావలసిన వ్యవహారాల్లో నే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది రావలసిన డబ్బు సమయానికి [illegible] మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి

స్త్రీలకు – ఆరోగ్యం బాగా ఉండదు బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం :** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు·— కుటుంబ వ్యవహారాల్లో, కార్యభారం పెరుగుతుంది విలాస వస్తువులు కొంటారు.

**కన్య:** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలు [illegible] పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా, ప్రయోజనం ఉండదు. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు :— దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల :** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— బంధుమిత్రులను కల్సుకొంటారు. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**వృశ్చికం :** కొన్ని వ్యవహారాల్లో ఆందోళన కలుగుతుంది. ప్రయాణాలు వాయిదాపడతాయి. వారం మధ్యలో వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— అధిక వ్యయం జరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు .** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సు కొంటారు.

**మకరం:** అనవసరమైన సందేహాలకు గురి కాగలరు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు. వారం ఆఖరులో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం :** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు — అలంకార వస్తువులు కొంటారు. బంధువులకు సహాయం చేయగలరు.

—మహేష్






### జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ల ముద్దుల మరదలు సుధ. సుధ ఒంటపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కనిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ హాస్టల్ సర్వరీకి విశాఖ చేరుతుంది. తను ప్రేమించిన నళినితో మురళి వివాహం జరుగుతుంది. మంచి డాక్టరనిపించుకోవాలని, లక్ష్యాన్ని సాధించాలని రఘు కోరిక. దగ్గరజేరిన రాధ ఆకర్షణనుంచి తప్పుకుంటూ మనసు లక్ష్యంవైపు కేంద్రీకరిస్తుంటాడు రఘు. సుధ వివాహం కోసం చేసె ప్రయత్నాలు రఘు సలహా మీద జానకి ఆపు చేస్తుంది. రఘు స్నేహితులు అతన్ని పిక్నిక్‌కి తీసుకు వెళ్లారు.

## 11

తను రావడానికి వీలుపడదంటూ రఘు మొదట ఆ ప్రయాణానికి మొగ్గక పోయినా, ఇక తను బొంబాయి వెళ్ళడంతో ఎలాగో అక్కణ్ణుండీ, అలా...అలా ఇంక ఉద్యోగరీత్యా వుండిపోవడమే అవుతుందిగనక 'స్టూడెంట్ లైఫ్'ని అనుభవిస్తూ, అందరి స్నేహితుల్తోనూ కలిసి ఆఖరుసారిగా వో 'మాటు వెళ్ళొద్దాం, అనుకుని మళ్లీ ఒప్పుకున్నాడు.

అనుకోకుండా నిర్మలకి వో ముఖ్యమైన ప్రయాణం వచ్చినందునా, నళినీ, మురళీ, తిలక్‌వారు ముగ్గురూ కూడా వూళ్లో లేనందునా, శ్రమనుకోక రాధని కూడా వాళ్లింటికొచ్చి తీసుకెళ్లవలసిందని, రఘుతో చెప్పవలసిందిగా పార్వతమ్మగారికి ఫోన్ చేసింది నిర్మల వూరికెళ్లిపోతూ.

జానకి చీకట్నే లేచి రఘుకి ఇవ్వవలసున్నవన్నీ స్వయంగా తనే తయారిస్తే, అవన్నీ నీటుగా బెత్తం సజ్జలో సర్ది, శంకరయ్య చేత కార్లో పెట్టిస్తూ, 'ఏం వోయి రంగయ్యా? ఈ చిన్నబాబుగారికి ఎక్కడికన్నా వెళ్లినప్పుడు భోజనం చెయ్యడమంటే మా చెడ్డ మొహమాటం కానీ, వేళకి సరిగ్గా ఆయనకి ఇచ్చి ఆవిణ్ణి తీసుకోమన్నారని ఆ రాధమ్మగారితో గట్టిగా చెప్పేం?' అంది డ్రైవర్ సీటువేపు చూస్తూ సుధ.

'చిత్తమండి' అన్నాడు గొంతుక మార్చేసి రఘు.

'ఇదేవిటి ?' రంగయ్య తననెప్పుడూ మన్నించడే, మరి ఇప్పుడనగా 'అండి' అని ఎందుకంటున్నాడూ! సందేహంగా మళ్లీ అటువేపే చూసింది సుధ.

'ఈ అయ్యగారు తిండి తినకపోతే ఈ అమ్మగారికెందుకో ఇంత బాధ' అంటూ ఇవతలికొచ్చాడు రఘు. ఇంతలో షెడ్డు తాళంవేసి రంగయ్య రావడంతో రఘు మళ్లీ కార్లో కెళ్లిపోయి రంగయ్యని ప్రక్కన కూర్చోమని 'టా టా'అని సుధ అంటూంటే బదులుకి తనూ అంటూ, కారు స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు రఘు. గేటు దాటుతూ తన ఎర్రటి వెనక కళ్ళని ఒక్కమారు మూసి తెరిచి, మలుపుతిరిగి మాయమయింది కారు.

'ఎలాగన్నా రాధ అదృష్టవంతురాలు.' కారువేపే చూస్తూ నిల్చునున్న సుధ అంతరంతరాల్లో ఏమూల్నుంచో మెదిలిన ఈ మాట, సుధకే తెలనకుండా మెల్లగా ఆమె నోరు గొణిగింది.

దార్లో రాధనికూడా ఎక్కించుకుని కారు కాలేజీ ఆవరణలో కొచ్చేసరికీ ... ఉల్లాస ప్రయాణీకుల్తో నిండిన బస్సు బయల్దేరడానికి సిద్ధంగా వుంది. డిక్కీలో సామాన్లని బస్సులోపెట్టి డ్రైవరు కారు వెనక్కి తీసుకెళ్లిపోతే రఘూ, రాధా, ఆ తొలి ఝామువేళ ఒకే కార్లోంచి దిగొచ్చి బస్సెక్కడం చూసిన స్నేహితబృందం, బస్సదరిపోయేటట్టు కరఘోష ప్రారంభించారు.

కాలేజీలో తరుచూ జరుగుతూనే వుండే ఈ గంద్రగోళాన్ని లక్ష్యం చెయ్యకండా ముందువేపుకెళ్లి వో స్నేహితుడి పక్కన చతికిలబడ్డాడు, తలమఫ్లర్ని సరిచేసుకుంటూ రఘు,

'జంటకోసరం తెచ్చుకున్న వార్నలా వదిలేసి మళ్లీ ఈ చుట్టరికం దేనికిరా?' అన్నాడు తను జరిగి చోటిస్తూనే ఆ స్నేహితుడు పద్మనాభం.

మనసులోని భావాన్ని ఏ మాత్రమూ పైకి తొణక నివ్వకుండా తన స్నేహితురాలు పక్కనవెళ్లి కూర్చుంది రాధ.

దేశీయ గీతాల్తోటీ, జేజేలతోటీ, దార్లో వారందర్నీ హడలెత్తించుకుంటూ, ఒక్కొక్క గ్రామాన్నీ వెనక్కి నెట్టుకుంటూ, ఒక్కొక్క బస్తీలోనూ కాస్సేపాగుతూ, 'మాచ్‌ఖన్డ్' ప్రాజక్టు వేపుకి పరుగెత్తుతూంది వారిబస్సు.

రెండుగంటల ప్రయాణానికి తరవాత విజయనగరం సరిహద్దుల్దాటి ఒక నిర్ణీత స్థానాన్ని ఆగింది బస్సు. అదివరకే ఏర్పాటు చేసుంచిన ప్రకారం అక్కడందరికీ కాఫీ ఫలహారాలివ్వడం అయ్యాక మళ్లీ బయల్దేరింది. అప్పటి క్కొంత వెలుగొచ్చి సందున దూరాన్న చిన్న చిన్న ఆర్చిల్లాగ కనిపిస్తూన్న రోడ్డువార్లనుండే చెట్లు, దగ్గర కొచ్చేసరికే విడిపోతూ వెనక్కి మాయమైపోతుండే ఆ దృశ్యాన్నిచూస్తూ ఏదో ఆలోచిస్తూంది రాధ. మరో రెండుగంటల ప్రయాణానికి తరవాత వరిచేల సౌందర్యాన్ని తిలకించేందుగ్గాను వో చెట్టునీడని బస్సాపించుకుని అంతా కిందికిదిగి ఎవరి కిష్ట

మైన వేపుకి. వారు ఒంటిగానూ, జంటలు గానూ, గుంపులుగానూ, సరదాగా బయల్దేరారు. 'అర్ధగంటకల్లా మళ్ళీ అంతా ఒచ్చెయ్యాలి లేకపోతే ఇక్కడే వదిలేసి బస్సు ఉడాయించేస్తుంది తరవాత మీ ఇష్టం' అంటూ చేతిబెత్తాన్నూపుతూ హెచ్చరించాడు వారికి పెద్దగా వచ్చిన వక్ర లెక్చరరు హాస్యంగా.

కొందరు చింతచెట్టెక్కి కూర్చుని కాయల్ని కిందికి విసురుతూంటే, కింద నున్నవారు పోటీలకుపోయి ఎగిరెగిరి వాట్లనందుకుంటున్నారు. ఇంకా కొందరు చివర కొమ్మలమీద నిలబడి కొమ్మని ఒంగేటట్టు చేస్తూంటే మిగతావారా కొమ్మల్నందుకుని ఉయ్యాలూగుతున్నారు. రోడ్డు వార్నకుందుకూర్చుని, రెండు చేతుల్నీ రెండు మోకాళ్లమీదనుంచీ ముందుకు చాచుకుని హాయిగా బీడీ కాల్చుకుంటూ కూర్చున్న కండక్టరూ, డ్రైవరూ సవిలాసంగా వీరి చర్యల్నిచూస్తూ మెల్లగా విమర్శించుకుంటున్నారు. కళ్లు చికిలించుకుంటూ నోట్లో ఊటని 'ఉస్' అంటూ పైకి పేల్చుకుంటూ ఆ చింతకాయల్ని కొరికి తింటూన్న ఆడపిల్లల్నీ చూసి 'కొంత ఉప్పన్నా తెచ్చుకో పోయారూ!' అని మెల్లగా అన్నాడు కండక్టరు. 'ఉస్. పూర్కోరా ఇన్నారంటే పీకల్తెగుతాయి. అందులో ఆడోరుకూడాను' అని మందలించాడు డ్రైవరు.

కాయల్ని మెల్లిగా కొరుక్కుంటూ అలా అలా సరదాగా నడిచివెళ్లిన రాధా, శ్యామలా అక్కడొక కందిచేను విరగ కాసుండడం చూసి అటు నడిచారు. దాని పక్కనే వేరుసెనగ. సంతోషంతో గబగబా నడకా, పరుగుగావెళ్లి, అడ్డంగావున్న నీటివాగుమీద నుంచి చెంగున ఒక్కగెంతుగెంతి అవతలికెళ్లి, ఇన్ని కాయలు లెంపి చేతిరుమాల్లో కట్టి తెచ్చుకున్నారు.

శ్యామల సులువుగా దాటేస్తే, కాళ్లకి పరికిణా బంధాలు పడ్డందున రాధ ఆ నీళ్లల్లో పడిపోయింది. 'అయ్యో ఇదేవిటే?' అంటూ శ్యామల వెంటనే చెయ్యిచ్చి ఇవతలకి రప్పించిందిగాని అనలే వుల్లిపొరవంటి చీరేమో! లందుకుతోడు తడవడంలో బట్ట వంటి కంటుకుపోయినందున రెండు చేతులూ మోకాళ్లకి చుట్టేసుకుని అక్కడే కూర్చుండి పోయింది రాధ.

అటూ ఇటూ తిరిగొస్తూన్న రఘు తనూ అక్కడివార్నడిగి ఇన్ని వేరుసెనక్కాయల్ని రుమాల్లో పోసుకుని బస్సు అరుపు వినడంతోనే పరుగు పరుగున వస్తూ ఆదృశ్యం చూడ్డంతోనే చెట్లవెనక్కి వెళ్లి పోయాడు. బస్సు మళ్లీ కూసింది. వారిద్దరికి ఒకటే కంగారు.

'ప్లీస్, కాస్త మీరు రాధకి సాయం వుంటారా నేవెళ్లి దానికి బట్టల్తెస్తా. ఈ పిల్ల కాలవని దాటుతుంటే యధాలాపంగా కాల్జారింది రాధకి' అంది కంగారుగా శ్యామల.

'అబ్బే మీరే సాయంగా వుండండి—' అన్నాడు తప్పనిసరిగా, రఘు ఆలోచిస్తూ.

'అయితే నీ తాళాలిలా ఇవ్వవే ...'అంది రాధ నుద్దేశించి శ్యామల.

'అలా వద్దండీ. ఆ పెట్టె ఎటువంటిదో చెపితే తెచ్చిస్తా.'

'బలువవుతుందని చెప్పవే?' మాట మధ్యలోనే అంది రాధ.'

'ఫరవాలేదు. అంటూ ఆ వివరాల్నీ కనుక్కుని, దబదబా వెళ్లి ప్లీస్ ఒక్క అయిదు నిముషాలు వెయిట్ చెయ్యండి అంటూనే ఆ పెట్టె అందుకుని దబ్బున వెనక్కొచ్చిన రఘు, కావలసిన వేవో శ్యామల వచ్చి తీసు



కోగానే, 'మీకెందుకండీ శ్రమ మేంతెస్తాం.' అని శ్యామలంటూన్నా వినిపించుకోకుండా, మీరు త్వరగా రండి అంటూ ఆ పెట్టె పట్టుకెళ్ళి మళ్ళీ బస్సులో పెట్టేశాడు.

'సరిగంగ స్నానాలేవిట్రా తమ్ముడూ! చెప్పావేకావు చూసి కాస్త పుణ్యమున్నా మూటగట్టుకుందుం.' అని పద్మనాభం అంటే, 'అవేం నాయనమ్మ ఉపమానాల్రా, నాయనమ్మా?' చక్కగా గోపీ వస్త్రాపహరణం అనో రాసక్రీడలనో అంటే, అది నాజూకుగా వుంటుంది గానీ' అన్నాడు. కాలక్షేపంగాక గులకరాళ్ళని ఒక్కొక్కటీ చెట్ల మీదికి బలంకొద్దీ విసురుతూ నిల్చున్న శేఖర్.

'ఛ, ఛ. ఏదో చాటుగా మాటుగా వాళ్ళేదో సరదాలు పడ్డామనుకుంటూంటే' చూసినా చూడనట్టే నటించాలిగాని అవన్నీ అందరి ఎదుటా బయటపెట్టేస్తావుట్రా. అనుభవంలేని ఘటమా?' అంటూ అతణ్ణి మందలించాడు బస్సులో కూర్చునున్న వాడల్లా మళ్ళీ దిగి వాళ్ళ వద్దకొస్తూ రాంమ్మోహన్. ఇంతలో రాధా, శ్యామలా, రావడంతో అంతతో హాస్యాలన్నీ కట్టిపెట్టి బుద్ధిగా బస్సెక్కి పోయారు ఆ స్నేహిత బృందమంతానూ. ఎప్పుడూ కాలేజీలోనూ, హాస్టల్‌లోనూ, వారు చేస్తూండే ఇటువంటి గొడవలకల్లా అలవాటు పడిపోయిన రఘు ఆహాస్యాల్ని అక్కడే విదిలించేసి తను మాత్రం బస్సెక్కాడు. అందరూ వచ్చారో లేదో ఒకసారి చూసుకున్నాక మళ్ళీ బయల్దేరింది బస్సు. పాపం ఈ అల్లర్ని గురించి

# అతని లక్ష్యం

రాధ కేమీ తెలవక పోయినా, ఏదో కాస్త పసికట్టారన్నది మాత్రం గ్రహించింది.

కొండల మధ్య నుంచీ, లోయల వారల్నుంచీ, ప్రయాణం సాగిస్తూ, చిన్నచిన్న వాగుల్నీ, గుహల్నీ దాటుకుంటూ ఎత్తుపల్లాలున్న చోట ఎగరేసి పడేస్తూ, రోడ్డు వెడల్పులేని చోట్ల అడ్డంగా ఊగిస్తూ, బస్సు ప్రయాణంలో ఎన్నెన్ని రకాల ఇబ్బందులుంటాయో, అన్ని రకాలూ ఆ ప్రయాణికులకి చవిచూపిస్తూ, ఎలాగనైతేనేం, పదిగంటల ఆ ప్రాంతాల్లో వారందర్నీ 'మాచ్‌ఖండ్' చేర్చిందా బస్సు.

అమ్మయ్యా అనుకుని, అదివరకే అక్కడ పనిచేస్తూండే ఒకరిద్దరు ఇంజనీయర్లను పట్టి, ఏర్పాటు చేసుకున్న విడిది గృహానికి సామాన్లు పట్టించ బోతూండగా 'క్షమించాలండీ. అనుకోకుండా మా ముఖ్య అధికారొకాయన నిన్నరాత్రొచ్చి ఆ బంగ్లాలో తిష్టవేశాడు' అంటూ ఆ ఏర్పాటుచేసిన వార్లో ఒకాయన ఎదురొచ్చి చల్లగా ఈ కబురుచెప్పి వెళ్ళిపోయాడు.

'నే బస్సెక్కుతూండగా ఈ రామబ్రహ్మంగాడు పుసుక్కన తుమ్మాడు. అప్పుడే అనుకున్నా, వీడితుమ్మేం చేస్తుందో నని. అనుకున్నంతా అయింది.' అన్నాడు 'బెడ్డింగ్' మీద చతికిలబడుతూ పద్మనాభం,.

'చాల్లేరా. తీరా బస్సు బయల్దేరుతూంటే శుభమా అంటూ ఒంటి బ్రాహ్మడల్లేవచ్చి అందరికీ ఇబ్బంది తెచ్చిపెట్టడమే గాకుండా పైగా ఇదోటా. అసల్దారిలో ఏ ప్రమాదం సంభవించకుండా వెళ్ళి చేరాలి గదా. దేవుడా, అనుకుంటూ, దారి పొడుగునా చెట్టుకీ పుట్టకీ దండం పెట్టుకుంటూనే వొస్తే,' అన్నాడు బస్సు మెట్టు మీదో కాలూ నేలమీదో కాలూ పెట్టి పోజిస్తూ రామబ్రహ్మం.

'అవి నీలాంటివాడొస్తేరా నాయనా, నే బ్రాహ్మణ్ణికాను రెడ్డిని ఒకటీ! రెండోది నేను ఒంటిగాణ్ణికాను. ఇదుగో చూడండి' అన్నాడు జేబులోని ఒకమ్మాయి ఫోటోతీసి చూపిస్తూ.

'ఎవర్రా, అదీ' అంటూ అందరూ ఒకేసారి అతన్ని చుట్టు ముట్టేశారు ఆఫోటోని చూడ్డంకోసరం.

'ఎవరేవిటి. నా కాబోయే భార్య' మొహం బడాయిగా పెడుతూ అన్నాడు పద్మనాభం.

'అందుకని జేబులోనే పెట్టుకు తిరుగుతున్నావా, సిగ్గులేకపోతే సరీ.'

'హుం. చేసుకునేముందు ఆ ఫోటోని చూసి భవిష్యత్తుని ఊహించుకుంటూంటే ఆ ఆనందం ఉంది చూశావ్. తమ్ముడూ, ...హె ఏఏ సమయాల్లో ఏఏ విధమైన సుఖానుభవం పొందడానికి వీలో అవన్నీ హాయిగా అనుభవించాలి. అంతేగానీ, మన రఘుకి మల్లే—'

'చాల్లేగాని ఆర్నెల్ల తరవాత పెళ్ళి జేసుకో బోతున్నందుకే ఇప్పట్నుంచీ, ఇన్ని రకాల వేషాలు వేస్తుంటే, ఇంక ఆ పెళ్ళి అయ్యాక—'

'అయ్యాకేం వుందిరా. నామొహం, అమ్మగారటు మొహమైతే అయ్యగారిటు మొహం బస్.'

అతని ధోరణికి అంతా ఘొల్లున నవ్వారు.

'సరి బాగుంద్రా. ఇంతదూరం ఈ బస్సులో ఎముకలు విరిగేటట్టు ప్రయాణం చేసొచ్చిందీ, ఇక్కడా ఈ పద్మనాభంగాడి సోది విన్టానికేనా ఏం! లేవండి.' అన్నాడొకతను.

'ఎక్కడికిరా లేవడం' మరొకతనడిగాడు.

'ఎక్కడికేవిట్రా. ఈ ఇళ్ళూ, ఇరకాటాలూ, ఇక్కడ మనకాప్రారబ్ధమేం వచ్చే! రండి హాయిగా ఆ చెట్లనీడని మఖాంపెడదాం.' అంటూ తన సంచీ భుజానికి తగిలించుకుంటూ లేచాడు మరొకతను.






'మరి విద్యుత్ కేంద్రాన్ని చూడ్డవో!' అన్నాడు మొదటతను.

'దానికేం పెద్ద ఆలోచనేంవుందీ, కాళ్ళకి బుద్ధిచెప్పడం, వెళ్లి చూసిరావడం.'

'ఈలోగా ఏ బుద్ధిమంతుడైనా ఈ సంచుల్ని కాజేసేస్తేనో? గుడ్డముక్కలుపోతే పీడాపోయెగానీ, తిండి పట్టుకుపోయాడంటే ఇక్కడిక గడ్డికూడా పుట్టదు.'

'హరి సాపాటంగా, అందరి తిండీ ఎవడు పట్టుకు పోతాడా. పట్టుకుపోతే మాత్రం...'

'ఏవోలే?' అంతా సంచిలోనే సహా చెట్టు వేపు బయల్దేరారు.

.హోవని చేద్దావన్రా. ఫోటో చూసు కుంటూ ఉండమని ఈ పద్మనాభ

గాణ్ణిక్కడ కావలాపెట్టి మ న మ ం తా వెళ్లొద్దాం.'

'మహరాజులా వెళ్లండి. అయితే మీమీ పంచీల్లో, పళ్లో, పిండివంటల్లో, తగ్గిపోయాయంటేమాత్రం నన్ననొద్దు.'

'బంగ్లా దొరకనప్పుడు అంతా పంచీల్తో సహా బయల్దేరుతున్నారెందుకు?' అన్నాడు. అక్కడి వివరాలన్ని కనుక్కొని వస్తూన్న రఘు వాళ్లను చూసి.

'చెట్లూ, పుట్లూ పట్టిపోదాం అంటున్నార్రా నాన్నా వీళ్లంతానూ' అన్నాడు ఏడుపువరసతో రామమోహన్.

'ఎందుకూ, అందాకా అన్నీ బస్సులోనే వుంచి అన్నీ చూసొచ్చాక భో జ నా లు కావలిస్తే చెట్టుకింద చెయ్యొచ్చు.'

అన్నీ బస్సులో పెట్టి, కిటికీ తెరల్ని బటన్ చేసేసి త్వరగా రండి' అన్నాడు తను ముందు నడుస్తూ రఘు.

అక్కడ చూడవలసినవన్నీ చూచి పన్నెండయ్యేసరికే అంతా అక్కణ్ణుంచి ఒచ్చేసి, ఆహారసామగ్రంతా పట్టుకుని చెట్ల కిందికి చేరాటు.

డ్రైవరూ, కండక్టరూ వెళ్లి, అక్కడి వార్నడిగి రెండు కడవల్నిండా నీళ్లు పట్టుకొచ్చాక, ఒకరు తెచ్చిన ఆహారపదార్థాల్ని మరొకరికి రుచి చూడమని వడ్డించుకుంటూ సరదాగా భోజనాల్చేస్తున్నారు.

రఘు కూడా తన బేస్కెట్ తెరిచి ప్లేట్లూ, స్పూన్లూ వగైరాల్నీ పైకి తీశాడు. 'తనే రాధని పిల్చి పెట్టాలా? లేక రాధే ఇద్దరికీ వడ్డిస్తుందా?'ఏం చెయ్యాలో తోచక తటపటాయిస్తూన్న రఘుని చూసి, అంతవరకూ ఈ స్నేహితుల గొడవ పడలేక ఎడం ఎడంగా వుండిపోయిన రాధ ఇక బాగుండదనుకుని 'ఉండండి రఘూ, మీకేం తెలుస్తుందీ' అంటూ తనొచ్చి, ఇద్దరి ప్లేట్లల్లోనూ సర్దింది.

తలెత్తి నలుగురువేపూ చూస్తే, ఏని గోల చేస్తారో అన్నట్టుగా తలొంచుంకు గుప్‌చిప్‌గా భోజనం చేస్తున్నాడు రఘు. అలా వున్నా వాళ్ళల్లో వాళ్లేదో చెవులు కొరుక్కుంటూ, ఈలలు కొట్టి గొడవ ట్చేస్తూనే వున్నారు. అదివరకే పెళ్ళైపోయినవారూ, అటుపైన పెళ్లి చేసుకోబోతున్నవారూ, ఇంకా ఆరంభ స్నేహంలోని హాయిని అనుభవిస్తున్నవారూ, అయినా విడి విడిగా కొంచెం దూరంగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ, భోజనం కానిస్తూన్న కొన్ని జంటల్ని చూసి, మిగతా ఒంటరి సజ్జంతాను—

'మీ కుక్కు చాలా బాగా చేస్తాడే వంటా' అంది ఏదో ఒకటి మాట్లాడాలి కదా అనుకుంటూ రాధ.

'అతడూ బాగానే చేస్తాళ్లండిగాని ఇవాలివన్నీ చీకటితో లేచి, మా అత్తయ్యే తయారు చేసింది. ఆవిడ ఏ పని చేసినా, అందులో ఒక మంచి ప్రత్యేకత కనుపిస్తుంది.'

'అత్తయ్యంటే ?' ఎరిగుండే అడిగింది రాధ.

'మా మేనమామ భార్య. ఆయన యుద్ధ సమయంలో పోయారు.' తొడమీది పుస్తకంలో పేజీల్తిరగేస్తూ అన్నాడు రఘు.

ఇలా విడిగా వుండగా మాట్లాడ్డం అతనికిష్టంలేదని గ్రహించిన రాధ తమూ మౌనంగా భోజనం ముగించి, మళ్ళీ అన్నీ ఎప్పట్లా సర్దేసింది.

చెయి కడుక్కునొచ్చి తన వద్ద నున్న ఒక్కపొడిని అందకీ పంచిపెట్టాక బెత్తం సజ్జలో నున్న రంగుదుప్పటీ తీసుకుని, ఎటువేపుగా పరుచుకోవడమా? అని నాలుగు వేపులా పరకాయిస్తూన్న రఘుకి ఒట్టి నేల మీద చెట్టుకి చేరగిలబడి కూరుమున్న రాధ కనిపించింది.

'మీరేమి తెచ్చుకోలేదా?'

'లేదు. ఏదో బంగ్లాలో దిగుతున్నావని వీళ్లంతా అనడంతో ఎందుకొచ్చిన మోత చేటని ఊరుకున్నా.' అంది చిరాగ్గా రాధ.

'నాకిటుపంటివన్నీ అసలే తెలియవు. ఇవన్నీ సుధే సర్దింది పాపం. అంటూ వెళ్లబోయినవాడల్లా మళ్లీ 'అభ్యంతరం లేకపోతే మీరు దీన్ని వాడుకోండి' అన్నాడు రఘు.

'ఒద్దండీ, మీక్కావద్దూ.'

'అబ్బే. ఏదో వుందికదానని తీశాగాని, హాయిగా ఆ కొమ్మమీదికెళ్లి కూర్చుంటా' అంటూ ఆ దుప్పటి మడతని రాధ ముందు పెట్టేసి తను ఒక్క అంగలో పైకెక్కి వీలుగా వున్న ఒక పలకమీద కూర్చుని పుస్తకం చదువుకోవారంభించాడు రఘు.

దుప్పటిని చి న్న మ డ త గా పరుచు కూర్చుని తను వో పుస్తకం అందుకుంగాని బుద్ధి అందులోకి పోలేదు రాధకి.

హుఁ. ఆ జాన్, పుష్ప ఈ భారతీ, వేదం వీళ్లంతా ముందు ముందు ఎప్పుడో పెళ్లి చేసుకుందాం అనుకునేవాళ్లయినా, ఎంత సరదాగా కలిసీమెలిసీ కాలక్షేపం చేస్తున్నారో? అదీ ఈ కులాంతర వివాహాలకి వాళ్ల పెద్దలు ఒప్పుకున్నప్పటిమాట ఇక ఆ రాజూ, జయంతీ వాళ్ల సంగతి చెప్పనే అఖ్ఖర్లేదు ఏదో మెడికల్ లైన్ లో వున్నారు గనుక వాళ్లగుట్టు బయటపడ్డం లేదు. లేకపోతేనా?

అయినా అంతలా వాళ్లందర్లాగే వుండకపోతేపోయె కాస్త ప్రసన్నంగా, సరదాగానన్నా వుండేందుకేం ఈ రఘుకి. ఏదో, మాట్లాడితేనే ఎక్కడ నోట్లో ముత్యాల్రాలిపోదాయో అన్నట్టుంటాడెప్పుడూనూ, ఇంతకీ నేనేవన్నా లేనిచోట పుట్టిందాన్నా, కురూపినా, చదువులేనిదన్నా, ఇష్టంలేదేమో అనుకుందుకన్నాను? పోనీ ఏవీ ఎరగనివాడేమో అంటే మళ్లీ అందరితోటి అంత సరసంగా కబుర్లు చెప్తాడు. ఇక నన్ను చూస్తేనేనా, ఈ పరాముఖం? ఏమిటో నేనూ ఎన్నెన్ని మార్లో పట్టించుకోకుండా ఊరుకుంటున్నా. అయినా, హుఁ ఈపాటి భాగ్యానికి వారంతా వేళాకోళాయికూడానూనా మమ్మల్ని చూసి! ఏదో... మొగుడు కొట్టినందుక్కాదు, తోటికోడలు నవ్వినందుకేడ్చానన్నట్టు నా బా ధ వీళ్లకెలా తెలియాలి...అనుకుని ఒక్కమాటు నాలుగు వేపులా మళ్లీ పరకాయించింది. విడిసజ్జంతా పేకాడు కుంటూంటే తనిందాక వర్ణించుకున్న ఆ జంటలన్నీ, ఒకర్నొకరు తగిలీ తగల్నంత దగ్గరగా అక్కడా, అక్కడా కూర్చుని కిచ కిచ లాడుకుంటున్నాయి. అది చూసిన రాధ ఒళ్ళు పులకరించి, పైకి చూసింది. ఒద్దనుకుంటూనే దీక్షగా పుస్తకం చదువుకుంటున్నాడు రఘు.

ఇక ఒంటరిగా అక్కడుండడాని కిష్టం లేక శ్యామలావాళ్ల దగ్గరికెళ్లి కూర్చుంది రాధ.

'ఇక ఎన్నాళ్లు లేవే. కాస్తోపిక పట్టు' అంటూ, దివాలా పడ్డట్టున్న రాధన్చూసి హాస్యంచేసింది శ్యామల.

'అంటే?' అర్థంగా అడిగింది, శాన్నాళ్ళ ఇట్టి రాధని రఘుని ఎరిగున్న రోహిణి.

'అదికూడా మళ్ళీ విడమర్చి చెప్పాలా నీకూ. వాళన్న మురళీ మన (ఫెన్డ్ నళినీ ఇలా మనతోపాటు వుంటూన్నట్టే వుండి ఇట్టే పెళ్ళిచేసేసుకున్నారే అలాగే—

'ఆ! అందుకే నిన్ను మళ్ళీ నే (ప్రశ్నిస్తే. వాళ్ళిద్దరూ అంటే ఇద్దరి మనసులూ, ఇద్దరి అభి(ప్రాయాలూ, కలిశాయి గనక అలా చేసుకున్నారు, అది బాగుంది. అయితే వీళ్ల సంగతలా కాదు. అందుకే ఇదంత సులువుగా అనేసేందుకు వీల్లేదు.' అంది ఆ అభి (ప్రాయాన్ని పూర్తిగా ఖండిస్తూ రోహిణి.

'అంటే ఇందులో నీ అభి(ప్రాయం?'

'అభి(ప్రాయానికేం వుందీ. వీళ్లిద్దరి తత్వాలకీ చాలా తేడా వుంది గనక ఇద్దరూ మారగలిగి ఇద్దరికీ మధ్యస్తంగా వుండే (ప్రత్యేకభావాల్ని అలవరచుకుంటేనే తప్ప వీలుకాదేమో. అలా అవగల్గేందుకు కొంత టైమ్ పడుతుందికదా? అనుకుంటున్నా అంతే.'

'ఎంతో సులువుగా చెప్పేశావ్ గద?' అనుకుంది రాధ.

'ఏమో బాబూ! నాకిటువంటి విషయాల్లో నిమిత్తంలేకండా, ఏనాడో మేనమామని చేసేసుకున్నానా? అతను 'స్టేట్సు' నుంచీ తిరిగొచ్చి, మేం సొంత కాపరమంటూ వెలగబెట్టినప్పుడు తప్ప. మా ఇద్దరిమధ్యా పొత్తే కుదురుతుందో, పోరే (ప్రారంభమవుతుందో నాకు తెలియదు మరి.' అంది అతి సహజంగా శ్యామల.

ఇంతలో అక్కడా, అక్కడా వున్నవారంతా మళ్ళీ ఆ మర్రిచెట్టు కిందికి చేరడంతో, వాళ్ళూ లేచి వచ్చేశారు. తన బేస్కెట్ లోంచి కొన్ని కారపటుకుల్ని తీసి, భారతి అందరికీ యివ్వడం చూసి మిగతా ఒకరిద్దరూ వారివద్దనున్న చిరుతిండ్లని పంచి పెట్టారు. అది చూసి తన వద్ద నున్నవీ వినియోగం చేయించే నిమిత్తం రఘు చెట్టు దిగొస్తే, 'చూశార(రా, 'తిండి' అనేవరికే చెట్టుమీది కోతి కూడా దిగొచ్చేసింది' అంటూ, చొక్కా చాట్నోదో దాచుకుంటూ తను చెట్టెక్కిపోయాడు పద్మనాభం...తన బాస్కెట్‌లోంచి మిక్స్చర్, కారపు జీడిపప్పూ వగయిరాల్ని రాధ చేతికిచ్చి అందరికీ యిచ్చెయ్యమన్నాడు రఘు.

'అలాగే ఆ పచ్చి వేరుసెనక్కాయలూ పైకి లాపీ, నాకవంటే (ప్రాణం.' అంది

# అతని లక్ష్యం

రోహిణి, జీడిపప్పుని కరకర్లాడిస్తూ.

'అయితే ఆ కాసిన్నీ తరవాత నువ్వే తిను. అంతేగాని, అందరికి పంచాలంటే— ఏం చాల్తాయనీ...' అంది రాధ.

'అన్నట్టు, నేనూ తెచ్చానే, కొన్ని కాయలూ! అవీ యివీ కలిపేస్తే సరి!' అంటూ వాటికోసరం వెదక నారంభించాడు రఘు.

'ఏవిట్రా వెతుకుతున్నావ్' కొంటె తనంగా పైనుంచే అడిగాడు పద్మనాభం.

'పచ్చి వేరుసెనగ్గలా!' వెతుకుతూనే అన్నాడు రఘు.

'అయ్యో? ఇంత మూటైతే తెచ్చారు కదురా. నేనూ చూశానూ' అన్నాడు ఆశ్చ ర్యపోతూన్నట్టు పద్మనాభం.

'మరే, మేమూ చూశాం. మళ్ళీ ఆ మాటే మర్చిపోయాంగాని లేకపోతే ఇంత సేపుండేమా అసలు?' రాజు అన్నాడు.

'ఏమో బాబూ. నాకు వాట్ల వాస నంటే కూడే గిట్టదసలు. అయినా, నేనూ వెతికి చూస్తానుండండి' అంటూ అతనూ చెట్టుమీదినుండే కిందకి గెంతబోతూంటే, అతనికన్నా ముందు అందరి నెత్తినీ ఏవో రాలడం చూసి అంతా ఉలిక్కిపడి 'అదేవి టా' అని పరీక్షించారు. అన్నీ పచ్చి వేరు సెనక్కాయల తొక్కలే.

'ఏవ్రా. చక్కగా అందరూ వాట్ల నొల్చుకు తినేసి నాకెక్కడివ్వబడుతుందోనని పైగా ఈ ఉపాయం పన్నారా?' అన్నాడు ఏమీ ఎరగనట్టు చేతులు దులుపుకుంటూ పద్మనాభం.

'హరి బకాసురుడా. అంత మూటా పొట్టనబెట్టుకున్నావ్రటా? అంత బుద్ధిగా చెట్టెక్కి కూర్చుంటే అదేమో అనుకు న్నాను' అన్నాడు రామబ్రహ్మం.

'సరి, ఆ వున్న గింజలే, తలో కొంచెం పంచండి ఏం చేస్తాం.' అన్నాడు రామ్మో హన్.

'మరి నేరాకపోతే కాలక్షేపమే అవదు మొర్రో...అంటూ నన్ను బతిమలాడి తీసు కొచ్చినప్పుడు ఈపాటి వైవేద్యాలన్నా నాకు పెట్టకపోతే ఎలాగ్రా మరి' అన్నాడు తన పంచీని సర్దుకుంటూ పద్మనాభం.

'అందుకేరా నాయనా అందరం పోతు [illegible].'

'అదేమిట్రా, ఇంత త్వరగా పూర్తిచే స్నారు మీరంతానూ?'

'పూర్తికాక ఏం చేస్తావనుకున్నావ్ ? మరి?'

'ఏం చేస్తారనుకున్నానా. అంతా కలిసి నన్ను కాళ్ళూ, చేతులూ విరిచేస్తారనుకున్నా! హా! ఎందుకు పనికొస్తార్రా మీరూ ?' అంటూ ఒలిచిన వేరుసెనగ్గింజల మూట శ్యామలకేలికిచ్చాడతను.

'పూర్తికా ఇవన్నీ తింటూంటే అందులో మజా ఏం వుందిరా. చక్కగా చల్లని సంగీతం ఎవరన్నా పాడుతూంటే?' అన్నాడు ఆడపిల్లలున్నవేపు చూస్తూ రామబ్రహ్మం.

'మా రఘు ఈ కచ్చేరీలకి ప్రారం భోత్సవం జరిపిస్తాడు.' అని రాజింకా అంటూండగానే, 'ఇప్పుడు శ్రీ రఘునాథ రావుగారు ఒక దేశీయ గీతాన్ని పాడి మనకు వినిపిస్తారు' అంటూ వో పుస్తకం చుట్టి నోటివద్ద పెట్టుకుని బొంగురుగా అరిచాడు పద్మనాభం.

ఒకరిద్దరు స్నేహితుల ప్రోద్బలం మీద గురజాడ అప్పారావుగారి దేశభక్తి గేయాన్ని చల్లగా, హాయిగా, పాడి వినిపించాడు, ఏమంతగా మురిపించుకోకుండా రఘు. ఆ తరువాత ఒచ్చిరాని పాటల్ని మొండి ధైర్య ముతో ఒకరిద్దరు పాడితే, 'శాస్త్రీయ సంగీతం ఎవరన్నా మధ్య మధ్య పాడు తూంటే బాగుంటుంద్రా' అని సలహా యిచ్చారు అందులో ఒకరిద్దరు. అయితే ఆ బిట్టులో ఆ రాగ తాళం యుక్తమైన సంగీతం ఎవ్వరికీ రాదన్నారు. 'ఇటువం టప్పుడు మన సుధ పాడుతే ఎంత బాగుణ్ణు! తమ్ముంటే! తన మాట సుధ, ఎప్పుడూ కాదనదు గాని, తనే కొన్ని కారణాలవల్ల సుధని పిలవలేదు. ఆ తరవాత రోహిణి హాయిగా నాలుగయిదు ప్రకృతి వర్ణన మీది పాటలు పాడితే, భారతి వో శ్లోకం ఇంపుగా చదివింది. రాధని కూడా పాడమని అందరూ ఎంతో బలవంతంచేశారు గాని, తనకేవీ రాదని స్పష్టంగా చెప్పేసింది రాధ. ఆ తర వాత చెట్ల వెంటా, పుట్లలవెంటా కాస్సేపు హాయిగా అందరూ కలిసి తిరిగి దాదాపు నాలుగ్గంటల ప్రాంతాల్లో మళ్లీ తిరుగు ముఖం పట్టారు విశాఖ వేపుకి.

(ఇంకా ఉంది)

# వడ్డించవో మనవాళ్ళ కథలు

## 2

## కడివెడు ఖరముపాలు కథ

కె. వియన్. శర్మ




అన్ని వేళల్లోనూ గంపెడు గంగిగోవు పాలు కడివెడు ఖరముపాలుకన్నా మేలని ఒకరత్నం గంపెడు గులకరాళ్ళ కంటె మేలని అనలేం ఎందుకైనా కొట్టుదల్చుకున్నప్పుడు చేతిలో ఒకరత్నం ఉండటం కంటే పక్కనవో గంపెడు గులకరాళ్ళుంటే ఒకటితప్పినా మరొకటి తగుల్తుంది. రుచికి గంపెడు గంగిగోవు పాలు బాగున్నా ఆకలితో అలమటిస్తున్న వాడికి కడివెడు ఖరముపాలే నయం. న్యాయార్జితమైన రూపాయికంటె నల్లధనం వెయ్యిబరువుగా ఉంటుంది. ఇప్పుడు ప్రపంచమంతా పాయింట్ల పద్ధతిలో ప్రతిదానికి విలువలు కడుతున్నారు. ప్రపంచ కన్యపోటీలో మూతికిన్ని పాయింట్లు ముక్కుకిన్ని పాయింట్లు అని నిర్ణయించి దానిప్రకారం విజేతను నిర్ణయిస్తారు. అలా ఎక్కువ మార్కులు తెచ్చుకుని ఎన్నికైన కన్యబొమ్మలు న్యూస్‌పేపర్లో చూసి మన పక్కవీధిలోఉన్న మన పదమూడో నంబరు - అంతకన్నా బాగుంటుందని మీరు నేను అనుకుంటాము కాని దానివల్ల ఎన్నికైన అమ్మాయికేం పోదు. అల్లాగే పాలవిషయం తీసుకోండి. రుచికి అయిదు మార్కులు, లీటరుకి అయిదుమార్కులు అనుకోండి. అప్పుడు గరిటెడు గంగిగోవుపాలకి 6 మార్కులు వస్తే కడివెడు ఖరముపాలకి 50 మార్కులు వస్తాయి అంటే కడివెడు ఖరముపాలు గొప్పవని ఋజువైంది కదా! పార్థసారధి వెంకట్రమణన్ కుద్యోగమిప్పించడానికీ పద్ధతినే వాడారు.

వెంకట్రమణన్‌ని చూస్తే ఆండాళమ్మకి పుట్టెడు దుఃఖంగా ఉంది. అతని మీద ఎన్నో ఆశలు పెట్టుకుని ఎమ్మే దాకా చదివించింది. అవడానికి అది పెద్ద చదువేకాని చదువు పూర్తిచేసి ఏడాది అవ్వొస్తున్నా అబ్బాయి కుద్యోగం దొరకలేదు. అల్లా ఎందుకు జరుగుతోందో ఆండాళమ్మకి అర్థంకాలేదు. ఆర్నెల్లక్రితం తిరుపతివెళ్ళి మొక్కుతీర్చుకుంది కూడాను. అయితే వెంకట్రమణన్‌కి కారణం - కొంత - వరుకు తెలుసు. అది తను బియ్యేవరుకు అత్తెసరు మార్కులతో పాస్‌అవడం ఎమ్మే ఒకసారితప్పి రెండోసారి గట్టెక్కడమూను. దాన్నే ఆండాళమ్మ 'మా వెంకట్రావ్ బియ్యేవరుకు ఏక్లాసు తప్పకుండా పాస్ అయ్యాడా ఎమ్మేలో వాళ్ళమేష్టరుకి వీడంటే కిట్టక రెండు మార్కుల్లో తప్పించేసాడు' అని మరో విధంగా అంటుంది. ఆరెండు మార్కులు లిబరల్‌గా పేపర్లుదిద్ది ఆపైన వో పదిమార్కులు మోడరేషన్‌లో కలపగా తక్కువైనవి ఈ విషయం ప్రతిదేశంలోను ప్రతి ఉపాధ్యాయుడికి తెల్సినవిషయం. కాని ఆండాళమ్మకి తెలియదు. తెలిసినా నమ్మదు. ఈ విషయంలో ఆవిడతో ఏకీభవించటానికి అటువంటి పరిస్థితుల్లోనే పరీక్షలు తప్పిన విద్యార్థుల తల్లులు చాలా మంది ఉన్నారు.

ఒకరోజున దుఃఖం ఆపుకోలేక 'ఇదేం ఖర్మరా నాయనా! ఎమ్మేడిగ్రీ చేతిలో వుండికూడా నీ కుద్యోగం లేదు' అంటూ

ఆశ్చర్యమేంది. 'డిగ్రీ ఉంటే ఉద్యోగాలిస్తారా! ఇవ్వగలిగిన మామ వుండాలి గాని' అని వాపోయాడు రమణన్. ఆ మాటలు విన్న అండాళమ్మ మనోవీధిలో పార్థసారధి మెరుపులా మెరిసాడు. సారధి అండాళమ్మకు వరుసకి తమ్ముడు. రమణన్‌కి మామవరుసాను. ఆయన మద్రాసులో పెద్ద ఆఫీసరు. ఆయనకి మంచి వుద్యోగం, ఇల్లూ. బీచ్‌కి సినిమాలకి వెళ్లడానికి కారు కాకుండా కార్లో వెళ్లడానికి వయసొచ్చిన ఆడపిల్లలున్నారు. అందులో పెద్దమ్మాయి అలిమేలు కార్లో వెళ్తుంటే చూడ్డానికి కారు బాగుంటుంది ఆ అమ్మాయి బాగుండదు. అల్లా అని నడిచివెళ్తే బాగుంటుందని కాదు. ఎల్లా వెళ్లినా బాగుండదు ఆ అమ్మాయికి వయసొచ్చినప్పటినుంచి పార్థసారధి పెళ్లాం మంగ తనకి గుండెల మీద కుంపటి పెట్టినట్టుంటోందని అనటం మొదలుపెట్టింది. 'ఈ మధ్య మద్రాస్ వేదరే అల్లా ఉంటోంద'ని నచ్చచెప్ప చూసాడు పార్థసారధి కాని మంగ నచ్చచెప్పబడక మొండికేసింది. అప్పుడు పార్థసారధి కేంపులు వేసుకొని రాష్ట్రం అంతా తిరిగాడు. దానివల్ల అల్లుళ్ళవటానికి అర్హతకల అబ్బాయిలు కనిపించినా కనుపించకపోయినా మంగపోరునుంచి రక్షణ లభిస్తుందికదా. అని పార్థసారధి ఆలోచించాడు. అల్లా ఊళ్లు తిరుగుతున్న పార్థసారధి తిరుచిరాపల్లి వెళ్లినప్పుడు అండాళమ్మ ఇంటికివెళ్లి భోంచేసి 'మీ వెంకట్రామ్ ఎమ్మే పూర్తిచేసాక మద్రాస్ పంపితే ఉద్యోగంవేయిస్తా'నని మాటిచ్చాడు. ఆ మాటిప్పుడు అండాళమ్మకి గుర్తొచ్చింది.

ఏ రోజున ఎక్కడ ఎందుకు ఆందోళన చేస్తారో ఏ రైలు ఏ ఊళ్లో ఎన్ని రోజులు ఆపేస్తారో తెలియనందువల్ల రెండు మూడు రోజులకి సరిపడ్డ పులిహోర అండాళమ్మ పొట్లంకట్టి ఇవ్వగా తీసుకుని, రమణన్ బయల్దేరాడు. అదృష్టం వెంటాడి సమయంలో మద్రాస్ చేరుకున్నాడు. పార్థసారధి అతన్ని వీధిలో చూసి గుర్తుపట్టి లోపలికి తీసుకువెళ్లి హాల్లో కూర్చోబెట్టి లోపలికివెళ్లి మంగ దేవిలా వీధిలోఉన్నది. అల్లుడు కాదగ్గ

# వడ్డించే మనవాళ్ల కథలు

వాడే కాని అన్యుడుకాదని, అండాళమ్మ కొడుకని చెప్పాడు మంగకి. అతిథులంటే అయిష్టం, అల్లుడవటానికి అర్హతున్న అబ్బాయిలంటే ఆపేక్ష. అందుకని వెంటనే మొహం మీద నవ్వు తెచ్చుకుని గుమ్మందగ్గరికి వెళ్లి అతన్ని పలకరించి ఆపైన అలిమేల్ని పిలిచి 'శ్రీరంగం నుంచి మీ బావొచ్చాడు రావే' అంటూ పిలిచింది. అలిమేలు కొంచెం వెర్రిబాగుల్ది అందుకని 'ఏంబావా ఎప్పుడొచ్చావ్' అంటూ ఆపేక్షగా పలకరించింది. ముందర మద్రాస్‌లో అమ్మాయిలు 'బావా' అని పలకరిస్తారా అని ఆశ్చర్యపోయాడు. అతని ఉద్దేశంలో చదువుకున్న అమ్మాయిలు అరవంలో అమ్మా, నాన్నా, బావా అంటూ మాట్లాడరు. అందుకని ఆశ్చర్యపోయాడు. ఆ పైన కరిగిపోయాడు.

వయస్సులో వున్న అమ్మాయి ఎంత సాధారణపు అందకత్తెయినా సరే బావా అని పిలుస్తే కరగని బడుద్ధాయి చాలా అరుదు. అందుకని రమణన్ కరిగిపోయాడు. ప్రపంచంలో తెలివి తేటలతో సాధించలేనివి కొన్ని అభిమానంతో సాధించవచ్చు. పార్థసారధి రమణన్‌కి తన తెలివితేటలతో వలపన్నాలనుకున్నాడు. ఆ అవసరం లేకుండా అలిమేలు తన అమాయకపు అభిమానంతో రమణన్‌ని మొదటి పిలుపుతోనే బంధించింది. అందుకని అలిమేల్ని అభిమానంగా చూస్తూ 'ఇప్పుడే మరదలా' అన్నాడు.

అలిమేలూ మురిసిపోయింది. పక్కగదిలో మంగా మురిసిపోయింది. కాని అనుమానం రవ్వంతకూడా లేకపోయేవరకు పార్థసారధి మురిసిపో దల్చుకోలేదు. 'ఆ పెద్ద పొట్లంలోది ఏమిట'ని అడిగింది అలిమేలు. రమణన్ అది పులిహోరని చెప్పాడు. అది వింటూనే మంగ లోపల్నుంచి దూసుకువచ్చి 'మీ అండాళమ్మత్త పులిహోర ఎంత బాగా చేస్తుందో తెల్సా! నిజమైన పులిహోర తినాలంటే ఆవిడ చేసిందే తినాలి' అంది. నిజానికి ఆవిడ అండాళమ్మను ఒకటి రెండు పెళ్లిళ్లలోతప్ప చూడలేదు. అప్పటికి వెంకట్రమణన్, అలిమేలు చిన్నవాళ్లవడం చేత ఆవిడను పూసుకోవాల్సిన అవసరం ఈవిడకి కలగలేదు.

'నిజంగానా!' అంటూ అలిమేలు అక్కడికక్కడ పొట్లం విప్పి ఒకముద్ద తీసుకుని నోట్లో వేసుకుంది. ఆ పైన 'అత్త చాలా బాగాచేసింది బావా' అంటూ మెచ్చుకుంది. వెంకట్రమణన్‌కి అతిగానచ్చే విషయాల్లో ఒకటి ఎవరైనా తన తల్లి వంటను మెచ్చుకోడం.

మర్నాడు పార్థసారధి 'ఉద్యోగం దొరికే దాకా ఉట్టినే వుండటం ఎందుకు టైపు పరీక్షకి కట్టు అలిమేలు నేర్పుతుంది టైపు' అని చెప్పాడు రమణన్‌తో. ఆయనకి ఉద్యోగం వెంటనే దొరకటం ఇష్టం లేదు. ఆయనకి అలిమేలు విషయంలో రమణన్ అభిప్రాయం ఖచ్చితంగా తెలిస్తేగాని ఆయన అనవసరంగా శ్రమపడ దల్చుకోలేదు. రమణన్‌కి తన ఆఫీసులో ఉద్యోగం వేయించటానికి నడపాల్సిన గ్రంథం ఎంత శ్రమతో కూడుకున్న పనో ఆయనకి బాగాతెలుసు. అందుకని టైపుమిషతో వాళ్లిద్దరినీ కలిపాడు. అలిమేలు ఆపేక్ష ఒక కారణం అయితే, వయసొచ్చిన ఆడపిల్లతో చనువుగా మసిలే అవకాశం రావటం ఇదే మొదటిసారవటం రెండో కారణం. ఈ రెండు కారణాల వల్ల రమణన్ టైపు నేర్చుకోడం మొదలు పెట్టాడు. అతని దినచర్యలో పొద్దున్న టైపు, మధ్యాహ్నం షార్ట్‌హాండ్ సాయంత్రం అలిమేలుతో బీచికి బజారుకి షికార్లు ముఖ్యాంశాలయ్యాయి.

రెండు నెలలయ్యేసరికి పార్థసారధికి రమణన్‌మీద పూర్తి నమ్మకం కుదిరి వడ్డనకు ప్రయత్నాలు మొదలు పెట్టాడు; అందులో మొదటి కార్యక్రమంగా డెప్యుటేషన్‌మీద మరో శాఖలో పై ఊళ్లో ఉన్న రామనాథన్‌ని వెనక్కి రమ్మని ఉత్తరంమీద ఉత్తరాలు ఆఫీసుద్వారా పంపి ముందు తిరిగొస్తే మళ్లీ డెప్యుటేషన్‌మీద పంపిస్తానంటూ నోటికబుర్లు పెట్టాడు. రామనాథన్‌కి బోల్డంత పలుకుబడి వుంది. రామనాథన్ డెప్యుటేషన్ తిరిగి సంపాదించటం ఖాయం. ఒకవేళ రామనాథన్ సంపాదించలేకపోయినా రామనాథన్‌కికింద మెట్లలో పనిచేస్తున్న ఇద్దరు ముగ్గురు అమాత్యుల అంతరంగికులు ఊరుకోరు. రామనాథన్ డెప్యుటేషన్‌మీదపోతే వచ్చే చెయిన్ ప్రమోషన్లలో వాళ్లు నిచ్చెనపై మెట్లకిపోతారు.

అందుకని వాళ్లు రామనాధన్‌ని డిపార్టు మెంటులో ఎక్కువరోజులుండనీరు. ఇది పార్థసారధికి తెలియకకాదు, కాని రామనాధన్ వెనక్కివస్తే, అతనులేనప్పుడు వెయిన్ ప్రమోషన్స్‌వల్ల టెంపొరరీగా ఖాళీ అయిన విచ్చిన అట్టడుగుమెట్టులో నోరు, పలుకు బడిలేక, ఏదో దైవపాటునవల్ల ఉత్త మెరిట్‌తో వుద్యోగం సంపాదించిన అభాగ్యన్, అనే శాల్తీకి ఉద్యోగం వూడుతుంది సరీగ్గా అదే పార్థసారధికి కావల్సింది.

రామనాధన్ వెనక్కివచ్చి మళ్ళీ బయటికి పోడానికి ప్రయత్నాలు మొదలుపెట్టాడు. అతనికింద వాళ్లు అమాత్య శేఖరులతో చెప్పుకున్నారు. అభాగ్యన్ ఎవరితోను చెప్పుకో లేదు. అందుకని పార్థసారధితో చెప్పుకు న్నాడు. మేకపిల్ల తోడేలుని నమ్మింది. గివర్నమెంటు రూల్స్ ప్రకారం రామనాధన్ లేనప్పుడు వచ్చే ఖాళీకి అభాగ్యన్ దరఖాస్తు పెడితే పూర్వం ఒకసారి పనిచేసి ఉన్న కారణాన్న అతడ్ని తీసుకోవాల్సి వస్తుంది. పార్థసారధి కల్లాంటికోరిక ఏకోశానాలేదు. అందుకని మరోచోట ఒక చిన్న పర్మనెంటు ఉద్యోగం అభాగ్యన్‌కి తన రికమెండేషన్‌తో ఇప్పించాడు. ఆకలికి ఆగలేని అభాగ్యన్ అందులో జేరాడు.

అప్పుడు పార్థసారధి తను కూడా వో చెయ్యేసి రామనాధన్‌ని డిప్యుటేషన్ మీద తోలేసాడు. ఆ తరువాత టెంపొరరీ ఉద్యోగానికి ప్రకటన పారేసాడు. అభాగ్యన్‌తో ఈ ఉద్యోగం రామనాధన్ వెనక్కి రాగానే వూడుతుందని, అందుకని ఉన్న ఉద్యోగాన్నే అంటిపెట్టుకుని ఉండమని చెప్పి నమ్మించాడు. ఆ విధంగా అభాగ్యన్ అడ్డు తగల కుండా కట్టుదిట్టం చేసుకున్నాడు. రాక్షసుడికి అమృతం దొరక్కుండా జాగ్రత్తపడ్డాక మరి దేవతకి వడ్డించాలి కదా! అందుకని పార్థసారధి నిర్మొహమాటంగా వడ్డనకు దిగాడు. ఇక్కడ వడ్డనకి ప్రయత్నాలు జరుగుతుంటే రమణన్ టైపు షార్టుహాండ్ పరీక్షలకి కట్టి లోయర్ పరీక్షలు బొటా బొటిగా పాస్ అయ్యాడు. పార్థసారధి దూరమాలోచించి రమణన్‌ని తిరుచిరాపల్లి వెళ్లి అక్కడనుంచి ఉద్యోగానికి అప్లయ్ చేయమన్నాడు. పార్థసారధి కూతురు రమణన్‌కి నచ్చే విషయంలోలాగానే, రమణన్‌కి ఉద్యోగం వేయించే విషయంలో కూడా ఏ రిస్కు తీసుకోదల్చుకోలేదు ఆయన.

**అప్లయి చేసిన వాళ్లలో మెట్రిక్‌దగ్గర** నుంచి బియ్యేదాకా ఫస్టుక్లాసులో పాసయిన వరదరాజన్ను, బియ్యేవరకు సెకండు క్లాసులో పాసయ్యి టైపు, షార్టుహాండు, హయ్యరు పరీక్షలు పాసయిన రాఘవన్ను వున్నారు. వీళ్ళని కాదని రమణన్‌కి ఉద్యోగం ఇవ్వాలి. అదీ పార్థసారథి సమస్య. దాని గురించి రాత్రింబగళ్ళు ఆలోచించి సెలక్షన్ బోర్డుకి సహాయక సూత్రావళి ఒకటి తయారుచేశాడు. అది పాయింట్ల పద్ధతి మీద తయారుచేసింది. అది ఈ విధంగా వుంది·

| పాస్ అయిన పరీక్ష | పాస్ అయిన విధం | పాయింట్లు |
|---|---|---|
| మెట్రిక్ | అ ఫస్టుక్లాసు తత్సమానం | 1 |
| | ఆ. తదితరం | 0 |
| పి. యు. సి | అ ఫ. క్లా. లేక తత్సమానం | 3 |
| | ఆ తదితరం | 2 |
| బి ఏ | అ. ఫ. క్లా. లే త. | 5 |
| | ఆ తదితరం | 4 |
| ఎమ్ ఏ | అ. ఫ. క్లా. లే త | 7 |
| | ఆ తదితరం | 6 |
| టైపు | అ. హయ్యర్ | 4 |
| | ఆ. లోయర్ | 3 |
| షార్టుహాండ్ | అ. హయ్యర్ | 4 |
| | ఆ. లోయర్ | 3 |

అంటే ఈ పద్ధతిలో రమణన్‌కి 18 పాయింట్లు, వరదరాజన్‌కి 9 పాయింట్లు, రాఘవన్‌కి 14 పాయింట్లు వస్తాయి. అందుకని రమణన్‌కి రాఘవన్‌కి ఉన్న తేడా అంటే నాలుగు పాయింట్లు ఇంటర్‌వ్యూకి కేటాయించాడు. ఇక్కడ పార్థసారధి రిస్కు తీసుకున్నాడు అనిపించచ్చు. కాని ఆతనికి సెలక్షన్ బోర్డు సైకాలజీ బాగా తెల్సు. వాళ్లు ఎవరికీ నాలుగు పాయింట్లివ్వరు; ఎవరికీ సున్నా ఇవ్వరు. అందుచేత రమణన్‌కి ఉద్యోగం ఖాయం.

పార్థసారధి ఇంత డొంకతిరుగుడు పద్ధతిలో రమణన్‌కి ఉద్యోగం వచ్చే ఏర్పాటు చేశాడు. పైన తయారు చేసిన పట్టిక చూడ్డానికి ధర్మసమ్మతంగా వుంది. ఇది మొదటి పాయింటు. రెండు రమణన్‌కి పార్థసారధికి గల చుట్టరికం ఎవరికీ తెలియదు, ఇది రెండో పాయింటు. ఒకవేళ తెలిసినా ఇంటర్‌వ్యూకి 3 పాయింట్లు పెట్టి రమణన్‌కి ఉద్యోగం ఖచ్చితంగా వచ్చే ఏర్పాటు చేయకుండా 4 పాయింట్లుంచిన పార్థసారధి ధర్మ బుద్ధికి సంతోషించాలి వాళ్లుండరు, ఇది మూడో పాయింటు. ఒక వేళ ఎవరయినా పార్థసారధి ప్లాన్ పోల్చుకున్నా, ఆఫ్టరాల్ ఇది టెంపరరీ ఉద్యోగమే



**నం. 79: 16 క్లూలు (తెలుగు తర్జుమా)**

1. పనితనంలో సాధారణంగా మానవీయగుణ రహితమైన ఖచ్చితం/కళాత్మకత అయివున్నది.
2. ప్రపంచంలో మనము నిజంగా ఏది సాధించితిమో/పొందయోగ్యమో దానికి సాటిగా మనము నిలుపుకొనవలసింది లేక సహింపవలసింది ఏమియునూలేదు.
3. ప్రేమ సర్వదాక్షమించుట మాత్రమే కాదు కాని శక్యమైనప్పుడల్లా నిర్దోషత ప్రకటింప/ ప్రాయశ్చిత్తం చేయగోరును.
4. జనవ్యాప్తమైన సూచన ప్రవృత్తి/ ఫేషన్‌ని సృష్టిస్తుంది. అని మనమెరుగుదుము తుదకు ఇది అనృతమైన యెడల ఇంకప్రచారం, లోక ప్రసిద్ధ మరియు విజ్ఞాపనం వృధా కల్పిత బూటకములే.
5. గొప్ప నటుడు / లేఖకుడు జీవనం యొక్క అపూర్ణత యొక్క చిహ్నమే.
6. యుక్తముగానియమితమైన ఏ సమాజములోనైనా మహత్వాకాంక్ష / కళ ఒక ముఖ్యమైన సామాజిక సొత్తు అని ఏ బుద్ధిమంత వ్యక్తియైనా తెలిసికొనగలిగి యుండవలెను.
7. అన్ని సాధారణ ప్రమాణములందునూ చాలా వెనుకబడియున్న / చెడ్డవారైన తలిదండ్రుల మమకార బద్ధులైన పిల్లలకు సహాయము చేయగోరువారికి తత్పరిస్థితి నిరంతర ఆశ్చర్య జనకమూలమై యున్నది.
8. యువ్వనము మార్పుకు కాలము, కాని అది విభేధములకు / దృఢనిశ్చతములకు మరియు అసంగతములకునూ కాలమై యున్నది.
9 మృత్యువు / ఇచ్ఛ మానవజాతికి అన్నిటినీ మించిన అతిగొప్ప శత్రువు అయినప్పటికీ అది కేవలం ఒక కల్పిత శత్రువే., ఎందుకనగా నిజానికి దాని అస్తిత్వం లేనేలేదు.
10. రొమాన్స్, ఉచ్చయోచనలు, ఆదర్శ కల్పన ఇవన్నియు మనస్సును సమృద్ధ పరచుటకు మరియు బావసలను/ ప్రేరక శక్తులను మిశ్రిత చిక్కు పరచుటకు అనుకూలించుచున్నవి.
11. జ్ఞానం, ఏమాత్రమైనా సర్వ శ్రేష్టత/ అస్తిత్వముకు ఆవశ్యక షరతు అయివున్నది.
12. ఘనమైన / సదాచార కార్యములను నిర్వర్తించేవారు తమ కార్యకాలమందుఅత్యున్నత దశకు చేరుదురు.
13. స్వతంత్రత / వివేకము మరియు సృజనశీల ప్రవృత్తి కాలము, మరియు స్థానములసంబంధంలో మనకు కానరాని భావములు.
14. క్రికెట్ విధులు ఆకస్మికభీతి / వ్యవహారరీత్యా సర్వదా దిద్దుబాటు చేయబడుచుండును.
15. ఈనాడు, కార్యనిర్వహణకు, సహాయమొనర్చుటకు, అన్యులసహాయమును పొందుటకు, మంచిపౌరుడుగా నుండుటకు సమయానుకూలంగా / కలిసిమెలిసి వుండి తీరవలెను.
16. తమ కర్మయందు నమ్మిక, నిగూఢరూపంలో అత్యంత తీవ్రత కవులను/ఉపదేశకులనుజీవింపజేయును అనేది ప్రత్యక్ష నిదర్శనం.

**No. 79 : 16 CLUES**

(1) Craftsmanship has generally a dehumanised **Accuracy / Artistry.**

(2) Nothing that we have to endure or put up with in this world is anything in comparison with what we really **Achieve / Deserve.**

(3) Love always seeks, not only to forgive, but wherever possible to **Acquit / Atone.**

(4) We know that mass suggestion creates **Action / Fashion**, ultimaedly. If this be untrue, then propaganda, publicity advertising are myths !

(5) The great **Actor / Writer** is the very symbol of life, of the non-perfect.

(6) Any intelligent person ought to be able to see that in any properly composed community **Ambition / Art** is an important social asset.

(7) The attachment of children to parents who, by all ordinary standards, are very **Backward / Bad** is a never-ceasing source of wonder to those who seek to help them.

(8) Adolescence is a time of change but it is also a time of **Contrasts / Convictions** and contradictions

(9) Though **Death / Desire** is the greast enemy of mankind, it is only an imaginary enemy, because in reality it does not exist.

(10) Romance, lofty ideas and ideals, imagination, all contribute to enrich the mind and to complicate the **Emotions / Motivations**

(11) Knowledge is rather the essential condition of all **Excellence / Existence**

(12) Those who perform **Fabulous / Virtuous** deeds rise higher in the course of their career

(13) **Freedom / Wisdom** and creative activity are not ideas which we encounter as relations in time and space

(14) The laws of cricket have always been modified by **Panic / Practice**

(15) Today to get on, to be helpful, to induce help from others, to be a good citizen, one must be **Pliable / Sociable**

(16) It is evident that a faith in their vocation, mystical in intensity, sustains **Poets / Preachers.**

---

లిట్‌క్విజ్ క్లోటేషను అన్నియు రచయితల రచనల నుండి గ్రహింపబడినవి. అవి పేనికనే పూర్తి అర్థములు గలవి. ఒక్కొక్క క్లూకు మారు పదములు అక్షర క్రమమున యేర్పాటు చేయబడినవి. మొదటి మారు పదముల యొక్క అక్షరక్రమమున క్లూలన్నియు యేర్పాటు చేయబడినవి. లిట్‌క్విజ్ వీక్లీ అఫిషియల్ సొల్యూషనుతో రచయితల పేర్లు, వారి రచనల పేర్లు ప్రకటింపబడును.

## వడ్డించే మనవాళ్ల కథలు

కదా అని కొంచెం నిర్లిప్తంగా వూరుకుంటారు. ఇది నాలుగో పాయింటు. ఇన్ని పాయింట్లు పార్థసారథి ఆలోచించాడు.

ఇంటర్‌వ్యూనాడు కమిటీలో పార్థసారథి నోరు విప్పలేదు. సెలక్షన్ బోర్డుకున్న స్వేచ్ఛ నాలుగు పాయింట్లకి పరిమితం కనుక పార్థసారథి తను నోరు విప్పకపోయినా పరవాలేదని నోరుమూసుక్కూర్చున్నాడు. పాయింట్ల సూత్రావళి సెలక్షన్‌బోర్డు అనుసరించేలా చూసుకున్నాడు. దాంతో ఇంటర్‌వ్యూలో కడివెడు ఖరముపాలు, గరిటెడు గంగగోవు పాలు కంటేను చెంబుడు మేకపాలకంటేను మేలని బుజువైంది.

ఉద్యోగం వేయించిన పార్థసారధి అండాళమ్మను పిలిపించి పక్కవీధిలో కాపురం పెట్టించాడు రమణన్ తనతో ఉంటే చూసేవాళ్లు గుసగుసలు మొదలు పెడ్తారని పార్థసారధికి తెల్సు, రమణన్ ఉద్యోగం లేనప్పుడు అతన్ని ఆఫీసులో కొందరు పార్థసారధింట్లో చూసినా శ్రద్ధగాచూసి గుర్తుంచుకోలేదు. 'అయినా రమణన్‌కి క్యాలిఫికేషన్స్ లేకపోతేగా, గంపెడన్ని ఉన్నాయి.' అని చూశాయగా గుర్తున్నవాళ్లు మనస్సుకు నచ్చచెప్పుకున్నారు. కొన్నాళ్లకి రామనాథన్ పర్మనెంటుగా పై ఊళ్లోనేఉండే ఏర్పాటు చేసాడు. దీనికి అమాత్యవరుల అంతరంగికులు సహాయం చేసారు. ఇది రోగికి వైద్యుడికి నచ్చిన పథ్యం కనుక రామనాథన్ నోరెత్తలేదు. కింద మెట్టు ఖాళీ పర్మనెంటు కాగానే రమణన్‌ని అందులో కన్‌ఫర్మ్ చేసారు.

ఒకసారి ప్రభుత్వపు పరంపదం నిచ్చెనలో ఎల్లాగో అల్లాగ చోటు సంపాదిస్తే ఆ పైన పై మెట్టు ఖాళీ అయినప్పుడల్లా పైకి పోవడమే. పాము వాత పడకుండా చూడ్డానికి పార్ధసారథి ఉండనే ఉన్నాడు. రమణన్ ఉద్యోగం ఖాయమైన మూడు నెలల్లో అలమేలు మెళ్లో రమణన్ మూడు ముళ్లు వేసాడు.

(పైవారం విష్ణుగుడెందనివిక్రమార్కుడికథ)

Rs. 60,000 NO. 79

1 ST PRIZE Rs. 25,000 | UPTO 4 ERRORS Rs. 15,000 | MINIQUIZ A Rs. 7,500 B Rs. 7,500 | MERIT BONUS Rs. 5,000 WHO WINS IN BOTH MINI A & B SHARES IT

మిని "ఏ" మరియు మిని "బి" రెండూ గెలుపొందిన పోటీదారు రు 5000/— విలువ గల మెరిట్ బోనసులో వాటా పొందగలరు.

## లిట్ క్విజ్ నెం. 79 అధికార ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి రు. 60,000/— ఆఖరు ముగింపు తేదీ 17—3—71 బుధవారం

ADDRESS: LITQUIZ No. 79, ALANKAR BALARAM STREET BOMBAY-7.

గమనిక: 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి 2) ఒక కూపన్ మాత్రం ఎంపిక చేసి ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపిస్తే, పోస్టాఫీసునుండి పొందిన M.O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడను. (4) I. P. O. క్రాస్ చేయునపుడు, అది లిట్ క్విజ్ నెం. 79, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| ✿ | Re. 1 | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACCURACY | ARTISTRY | ACCURACY | ARTISTRY | ACCURACY | ARTISTRY | ACCURACY | ARTISTRY |
| 2 | ACHIEVE | DESERVE | ACHIEVE | DESERVE | ACHIEVE | DESERVE | ACHIEVE | DESERVE |
| 3 | ACQUIT | ATONE | ACQUIT | ATONE | ACQUIT | ATONE | ACQUIT | ATONE |
| 4 | ACTION | FASHION | ACTION | FASHION | ACTION | FASHION | ACTION | FASHION |
| 5 | ACTOR | WRITER | ACTOR | WRITER | ACTOR | WRITER | ACTOR | WRITER |
| 6 | AMBITION | ART | AMBITION | ART | AMBITION | ART | AMBITION | ART |
| 7 | BACKWARD | BAD | BACKWARD | BAD | BACKWARD | BAD | BACKWARD | BAD |
| 8 | CONTRASTS | CONVICTIONS | CONTRASTS | CONVICTIONS | CONTRASTS | CONVICTIONS | CONTRASTS | CONVICTIONS |
| 9 | DEATH | DESIRE | DEATH | DESIRE | DEATH | DESIRE | DEATH | DESIRE |
| 10 | EMOTIONS | MOTIVATIONS | EMOTIONS | MOTIVATIONS | EMOTIONS | MOTIVATIONS | EMOTIONS | MOTIVATIONS |
| 11 | EXCELLENCE | EXISTENCE | EXCELLENCE | EXISTENCE | EXCELLENCE | EXISTENCE | EXCELLENCE | EXISTENCE |
| 12 | FABULOUS | VIRTUOUS | FABULOUS | VIRTUOUS | FABULOUS | VIRTUOUS | FABULOUS | VIRTUOUS |
| 13 | FREEDOM | WISDOM | FREEDOM | WISDOM | FREEDOM | WISDOM | FREEDOM | WISDOM |
| 14 | PANIC | PRACTICE | PANIC | PRACTICE | PANIC | PRACTICE | PANIC | PRACTICE |
| 15 | PLIABLE | SOCIABLE | PLIABLE | SOCIABLE | PLIABLE | SOCIABLE | PLIABLE | SOCIABLE |
| 16 | POETS | PREACHERS | POETS | PREACHERS | POETS | PREACHERS | POETS | PREACHERS |



FREE AFTER 2 COUPONS

**MINI A**

| | |
|---|---|
| ACCURACY | ARTISTRY |
| ACHIEVE | DESERVE |
| ACQUIT | ATONE |
| ACTION | FASHION |
| ACTOR | WRITER |
| AMBITION | ART |

**MINI B**

| | |
|---|---|
| EXCELLENCE | EXISTENCE |
| FABULOUS | VIRTUOUS |
| FREEDOM | WISDOM |
| PANIC | PRACTICE |
| PLIABLE | SOCIABLE |
| POETS | PREACHERS |

BOTH FREE AFTER 4 COUPONS

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఒప్పుకొనుచున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈ పూర్తి ఎంట్రీ ఫారము [4 కూపనులకు] ఫీజు రు. 4/— M. O. రసీదు / I P O. / లిట్ క్విజ్ క్యాష్ రసీదు / ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం. ..................... .......

నెం. 80 ఫారములు పొందుటకై దీనిని పూర్తి చేయండి

IN ENGLISH · CAPITAL LETTERS

| | | |
|---|---|---|
| FULL NAME .................................... | 79 (ASVP) | FULL NAME .................................... |
| .................................... | | .................................... |
| ADDRESS .................................... | | ADDRESS .................................... |
| .................................... | | .................................... |
| .................................... | | .................................... |
| POST .................. DIST .............. | | POST .................. DIST .............. |

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

గమనిక. ఇన్స్టాయు కొత్త సినిమా నిరికి చదువుతూ పాడిన పదములే ఎరియైన జవాబులు. అఫిషియల్ సొల్యూషన్ తేది 21-3-71 గల సండే స్టాండర్డ్ సిటీ ఎడిషన్ క్రమవటి పేజీ సరదన్ను. బహువరూల పట్టి లిట్ క్విజ్ రీక్లీ అర్హ్వాన్స్— 28-3-71 యుందును పూర్తిగా కుదించబడి తేది 4-4-71 సండే స్టాండర్డు పందున ప్రకటింపబడగలదు. 30 పైసలు పంపి 9 భాషలలో, అనగా తమిళము, తెలుగు, కన్నడ భాషలందుగల తర్జుమాలను పొందండి. మీ ఎంట్రీలతో 10 పైసల పోస్టు కార్డు పైన మీ అడ్రసు వ్రాసి జతపర్చి పంపండి. అఫిషియల్ సొల్యూషన్ పంపగలము. లిట్ క్విజ్ వీక్లీ ఉచిత కాపీని కూడా వ్రాసి పొందండి.

కుని వచ్చింది. ఇక ఆగలేకపోయాను. 'నా దత్తు ... నా బంగారుదత్తు, ఇంతదీనంగా ఇక్కడ పడుకున్నావా? నా బంగారు తల్లీ! నా వరహాలదత్తు, నా మొహిరీల దత్తు!' అంటూ పొంగివచ్చే ప్రేమవాహినికి అడ్డుకట్ట వేయలేకపోయాను. దత్తుని ఎత్తుకుని భుజంపైన పడుకో బెట్టుకుని, కాసేపటికి, తనివితీరా హృదయానికి హత్తుకుని అలా వుండిపోయాను.

ఈ హ ఠా త్ సంఘటనకి తెలివివచ్చి, నిద్రమంచిలేచి కళ్ళుతెరచి, నన్ను చూసిన దత్తు 'అమ్మా, అమ్మా!' అంటూ నన్ను మరింతగా హత్తుకుని పోయింది. నా మెడ చుట్టూ చేతులువేసి, నన్ను పెనవేసుకుంది.

రెండేళ్ల దత్తుకి వూ హ లు తెలుస్తున్నాయిగదా! మీ అమ్మదగ్గరకి పో! అని సువర్చల కసిరిందికదా! అందుకే కాబోలు...నా కోసం మా భాగంవేపుకివచ్చి, తలుపులు వేసి వుండడంవల్ల ఏడిచి ఏడిచి సొమ్మసిల్లి పూలచెట్లల్లో ప డు కు ని నిద్రపోయింది. అయ్యో! కన్నతల్లిగనుక వుంటే, ఈ చంటి దానికీగతి పట్టేదా! కన్నతల్లి అయితే, ఇంత సేపు పిల్ల కనిపించకపోతే వూరుకో గలదా! హు, సవతితల్లి అన్నపేరుని సార్థకపరుచుకుంది...సువర్చల, ఎంత కఠినాత్మురాలు!...

పోనీ, ఇంకనుంచీ, ఏమైనాసరే ఎవ్వరేమన్నాసరే, మమ్మల్ని ఎవ్వరూ విడదీయలేరు. తల్లిలేని దత్తుకి నేనే తల్లిని. పిల్లలులేని నాకు ఈ దత్తే, నా బిడ్డ ... అంతే, మున్ముందుటికీ అంతే, ఇక ఒక్క క్షణమన్నా దత్తుని విడిచి నేనుండలేను' అని నాలో నేనే గట్టి నిర్ణయానికి వచ్చేశాను.

ఇంతలో మావారుకూడా నిద్ర మెలకువ వచ్చింది కాబోలు లేచివచ్చి, మాకు చేరువలోనే నిలబడి, సంతోష ఆశ్చర్యములను మేళవిస్తూ మమ్మల్ని చూస్తూ నిలబడ్డారు. మరి కాసేపటికి మూర్తి, సువర్చల లాంతరు పుచ్చుకుని వస్తున్నారు 'ఎక్కడ వుందో, ఎ టు పో యి ం దో, ఏ రోడ్డు మీదకు పోయిందో, ఈ రాత్రివేళ, ఏ బండి క్రిందన్నా పడుతుందేమో అని, వెధవ పీడ అయిపోయింది!'అనిఅంటోందిసువర్చలవిసుగ్గా.

'వత్సలా! ఏమన్నావ్?' అని గట్టిగా ఒక్క కేకపెట్టేడు మూర్తి. 'నీ కడుపులో వున్న కసినంతా కలబోసి, నా బంగారు తల్లిని మాయం చేశావు...ఇంకా, ఇలాంటి

# నువ్వే నాకు...

(15 వ పేజీ తరువాయి)

కారు కూతలు కూయకు. జాగ్రత్త! ఫో, అవతలికి. నా తల్లిని వెతికి తీసుకుని వచ్చే వరకూ, నేను ఈ గడప తొక్కను ... అసలు నీవు ఆడదానివా? రాక్షసీ!' అని తిట్టి కోపంతో రెండంగల్లో వాకిట్లోకివెళ్లి పోతున్నాడు మూర్తి. ఇదంతా వింటున్న మావారు, చ క చ క వా కి ట్లో కి వెళ్లి మూ ర్తి ని గ ట్టి గా, కౌగలించుకుని 'మూర్తీ! బాధపడకు. నీబిడ్డ ఎక్కడికీ పోలేదు, ఏమీ అయిపోలేదు, రావల్సిన చోటికే వచ్చింది. చేరవలసిన నీడనే చేరింది. అదిగో, అటు చూడు పరస్పరాను రాగాలతో ఒకరినొకరు పెనవేసుకునిపోయిన, ఆ తల్లిలేని పసికందుని బిడ్డలులేని అమాయకురాలునీ చూడు...ఒకరినొకరు బాహువుల్లో ఇముడ్చుకుని, ఎటువంటి మధురానుభూతిని పొందుతున్నారో చూడు, మూర్తీ! ...వారిద్దరినీ...ఆ అమాయకపు జీవుల్ని, మనం వేరు చేయకూడదు...ఇది నా కోరిక. కాదనకుండా తీరుస్తావు కదూ!...మూర్తీ!' అన్నారు ఆయన ప్రాధేయపూర్వకంగా మూర్తిని చూస్తూ.

ఇదంతా చూస్తున్న మూర్తికి అంతా అగమ్యగోచరమైపోయి, అయిదు నిమిషాలకి తేరుకుని, సంతోషంతో వుక్కిరి బిక్కిరి అయిపోయాడు. 'సార్ ! సార్ !... ఏమిటి మీరంటున్నది...నా దత్తుని...నా చిట్టి తల్లిని మీరు, మీరు ... పెంచుకుంటారా ? దానికి తల్లిలేని కొరతని తీరుస్తారా? మహా భాగ్యం...నాకు అంతకంటే ఇంకేం కావాలి! నేను ఎన్నడూ కాదనను, నేను ఎంతగా కాపాడుకోవాలనుకున్నా...ఆ...అదే ఆ సవతి తల్లి ప్రేమనుండి ఎలాగూ తప్పించలేను... కనుక, నా చిట్టితల్లి భవిష్యత్‌కి బంగారు పునాది ఇదే! పసితనంలోనే అమ్మని పోగొట్టుకున్న నిర్భాగ్యురాలనుకున్నాను. కానీ, అది నిజం కాదు. అది చాలా గొప్ప అదృష్టవంతురాలు. మీలాంటి ఉదారవంతుల ఇంట పెరగటం, నిజంగా దాని పూర్వజన్మ సుకృతం. అంతకంటే, నేనింకేమీ చెప్పలేను ...మధురమ్మగారి అలనా పాలనలోనూ, కనుసన్నలలోనూ, క్రమశిక్షణలోనూ పెరిగి పెద్ద అయే అదృష్టం, ఆమె ఒడిలో తల దాచుకునే భాగ్యం కలగటం, నా దత్తు యొక్క పుణ్యమే!...తప్పకుండా మీరు తీసుకోండి...మీ దగ్గిర దత్తుని వుంచితే నాకు నిశ్చింతగా వుంటుంది...వుంటాను. మీకూ, ఆమెకీ నా నమస్కారములు. నా—మన దత్తుకి, ముద్దులు, ఆశీస్సులు ... ఏదీ, దత్తూ! ఒక్క ముద్దు ఇవ్వమ్మా' అంటూ నా చేతుల్లో వున్న దత్తు బుగ్గల్ని పుణికి ఒక్కసారి ముద్దు పెట్టుకుని, చేతుల్లోకి తీసుకుని, ఒక్కసారి హృదయానికి హత్తుకుని, మళ్లీ నాకు అందించి, వెనుదిరిగి వెళ్లిపోయాడు మూర్తి, దత్తుని కన్నతండ్రి!

ఈ లోపల దత్తు, తన తండ్రిని చూసి తీసికెళ్లటానికి వచ్చేడేమోనని భయంతో వణికిపోయింది. మూర్తి వెళ్లిపోగానే 'అమ్మయ్య' అనుకున్నట్టుగా 'అమ్మా ! అమ్మా!' అంటూ నా భుజంపై వాలిపోయి, నన్ను కరుచుకునిపోయింది.

దత్తుని మరింతగా కౌగలించుకుని, ఆపాల బుగ్గల్ని నా ముద్దులతో తడిపేశాను... దత్తు కేరింతలుకొడుతూ, నన్ను చూసి నవ్వసాగింది. మధ్య మధ్య 'అమ్మ' అంటూ.

దత్తుని ముద్దులతో ముంచెత్తుతూ, 'ఏమమ్మా ! ఏం కావాలి ? అమ్మ, అమ్మ అంటావెందుకు?' అన్నాను అమితానందంతో మురిసిపోతూ.

వెంటనే ఎవరోఅనమన్నట్టుగా 'అమ్మా ! వూ...వువ్వు, అకు కా ఆ అమ్మా!' అంది చిన్ననోరుని మెలికలు తిప్పుతూ వచ్చీరాని బుడి బుడి మాటలతో.

ఆమాట వినేసరికి నామనస్సులో ఏమిటో తెలియని తీయని తలపులు సముద్రపు అలలవలే ఒకదానివెనుక ఒకటి పొర్లుకు రాసాగాయి. నా గుండెల్లో కోటికోయిలలు ఒకేసారి మధుమోహనరాగాన్ని గానంచేశాయి. నాలోని స్త్రీ మూర్తి మాతృస్థానం లభించినందుకు పరవశించిపోయింది. పెల్లుబికిన ప్రేమవాహిని వెల్లువలై విరియగా, పరిమళాలు వెదజల్లే సన్నజాజుల పందిరిక్రింద, చ ల్ల ని జాబిల్లిమామ కాంతిలో, ఒళ్లు తెలియని ఆనందపారవశ్యంలో 'అవునమ్మా! నాదత్తు, నీవు నాకు కావలమ్మా! నీకూ నాకూ కావలమ్మా!' అని ఆలేత గులాబి మొగ్గల్లాంటి ఆ బుగ్గల్ని త నివి దీ రా ముద్దు పెట్టుకున్నాను. ●



# "నాకు రాజకీయ పరిజ్ఞానం అంతగా లేదు" --కాంచన

■ ఎయిర్‌హోస్టెస్‌గా వుండి, సినిమా రంగానికి వచ్చిన నటి కాంచనతో నేను జరిపిన యింటర్వ్యూ మీ కందిస్తున్నాను.

ప్ర: మీరు ఈ చిత్రసీమకు ఎలా వచ్చారు ?

జ: నేను ఎయిర్ హోస్టెస్‌గా పనిచేసేదాన్ని. ఒకరోజు ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీధర్ నన్ను చూచారు. 'వుడ్ యు మైండ్ యాక్టింగ్' అని అడిగారు. ఆయన అడుగుతున్నది నన్నేనా అని సందేహించాను నిజమే. —నన్నే అని తెలిసింది: 'విత్ ప్లెషర్' అన్నాను.

## ఫస్టు టేక్...ఓ కే.

ప్ర: మీరు నటించిన మొదటి చిత్రంలోని మొదటి దృశ్యం గురించి జ్ఞాపకముందా ?

జ: శ్రీధర్ 'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలో నన్ను నాయికగా బుక్‌చేసారు. మొదటిదృశ్యం డాన్స్ చెయ్యడం. చిత్రాలయ ఆఫీసులో రిహార్సల్ పెట్టారు. శ్రీధర్ 'నాకు డాన్స్ రాదేమో' అని భయపడ్డారు. తీరా రిహార్సల్‌చూచి ఆయన విస్తుపోయారు. 'రొంబ అరుమయాగ యిరికి' అని ప్రశంసించారు. పబ్లిక్ సందోహమైన 'మెరీనాబీచ్' వద్ద లొకేషన్ అన్నారు. కాస్త జంకాను. అయినా తప్పదుగా. జనాన్నిచూచి వుక్కిరి బిక్కిరి అయినాను. కానీ మొదటి 'టేక్' ఓ. కే. అయింది. ఆ దృశ్యం నాకు యింకా కళ్ల ముందు మెదులుతూనే వుంది.

## జీతం కరారు

ప్ర: ఎయిర్‌హోస్టెస్ జీవితానికి, నట జీవితానికి గల తేడా ఏమిటి ?

జ: ఎయిర్ హోస్టెస్‌గా వున్నప్పుడు ప్రతినెలా జీతం కరారుగా వచ్చేది. వివిధ రకాలయిన మనుష్యులతో పరిచయం యేర్పడేది. ప్రముఖ నాయకులు, సంఘ పెద్దలు, విభిన్న ఆచారాలుగల వ్యక్తులతో స్నేహం వుండేది. అక్కడే నేను 'ఓర్పు, బాధ్యత'లను అలవరచుకున్నాను. అక్కడకూడా 'యాక్టింగ్' కావాలి. నటిగా స్థిరపడిన తర్వాత, ఆ స్థానాన్ని కాపాడుకోవడం చాలా అవసరం. అందరికీ మంచిగావుంటూ, యిచ్చిన పాత్రపట్ల శ్రద్ధ ఆసక్తిని చూపిస్తూ నటిస్తేనే, ప్రేక్షకుల ఆదరణ లభిస్తుంది. ఇక్కడకూడా ఓర్పు చాలా అవసరం. కానీ ఒకే సమయంలో నలుగు రయిదుగురికి సమాధానం చెప్పాలి యిక్కడ డబ్బువిషయం అంటారా — ఏమో, నాకే తెలియదు యెప్పుడు, యెంత వస్తుందని.

## తప్పుకుంటాను

ప్ర: మిమ్మల్ని వాంప్‌రోల్ వెయ్యమని ఎవరయినా అడిగితే ?

జ: నాకు ధైర్యం చాలదు. నన్ను హీరాయిన్‌గానే వుండనివ్వండి. మరొకరికి ఆ పాత్రను అప్పగించండి అని తప్పుకుంటాను.

## వెరైటీ రోల్స్

ప్ర: మీకు ఎలాటి పాత్ర అంటే యిష్టం ?

జ: వెరైటీ కనిపించాలి. అప్పుడే డ్యూటీలో శ్రద్ధ ఎక్కువ అవుతుంది.

ప్ర: 'నటి'కి స్పెషల్ క్వాలిఫికేషన్స్ కావాలా ?

జ: అదృష్టం వుంటే అన్నీ కలిసి వచ్చినట్టే.

ప్ర: సినిమా తారల్లో కొంతమంది తమ చేతిగోళ్లను పెంచుతుంటారు? మీరు కూడా ...

జ: నా చేతివ్రేళ్లు చూడండి. (మామూలుగానే వున్నాయి) నాకు అలాంటి అలవాట్లు లేవండి.

ప్ర: మీకు దేముడిమీద నమ్మకముందా?

జ: మనస్సే దైవం. నామీద నాకు నమ్మకముంది. నాకు తెలిసి నేను యే కీడు యెవ్వరికీ చెయ్యలేదని నాకు తెలుసు.

## ఆడంబరంగా డ్రస్ చేస్తేనే...

ప్ర: సినిమాతారలు ఆడంబరంగా డ్రస్ చేస్తారని ప్రతీతి ? మీ వ్యాఖ్య ?

జ: ప్రతి స్త్రీ కాస్త ఆడంబరంగా వుంటేనే బాగుంటుంది. వుదాహరణకి ఒక తమాషా సంఘటన చెపుతాను. నేను 'ధర్మదాత' శతదినోత్సవానికి వెళ్ళాను. నేను వున్న కంపార్టుమెంటు దగ్గర వందమంది జనం మూగి, 'కాంచన రాలేదా' అని నన్నే ప్రశ్నించారు. 'వస్తుందేమో కాస్సేపు ఆగండి' అన్నాను. ఆ గుంపులో ఒక వ్యక్తి 'ఈమెను చూస్తే అచ్చం కాంచన లాగా వుందిరా' అన్నాడు. అంతే, అందరూ 'ఏమిటి, యింత సింపుల్‌గా వున్నారే' అని ప్రశ్నించారు. ఆ రోజు నేను చాలా సింపుల్‌గా వుండడం వల్ల నన్ను గుర్తుపట్టలేక పోయారు. అప్పట్నుండి, కాస్త ఆడంబరంగానే డ్రస్ చేసుకుంటాను.

ప్ర : స్త్రీలు లుంగీలు ధరించడం తప్పా? ఒప్పా? మీరు...

జ : నేను కూడా యింట్లో వున్నప్పుడు లుంగీతోటే వుంటాను. చాలా ఫ్రీగా ఫీలవుతాము లుంగీతో వుంటే. ఇందులో తప్పు, ఒప్పుల ప్రసక్తే లేదు. వాళ్ల వాళ్ల టేస్టును బట్టి జరుగుతుంటుంది.

ప్ర : 'కుటుంబనియంత్రణ' పై మీ అభిప్రాయం?

జ : మనదేశానికి ప్రస్తుత పరిస్థితుల్లో చాలా అవసరం.

## విదేశానుభవం

ప్ర : మీరు విదేశాలకు ఎప్పుడయినా వెళ్ళారా?

జ : శ్రీధర్‌గారి 'శివందమన్'కు

(64వ పేజీ చూడండి)

# ఒక వారం విపరీతం — ఫాలాక్షుడు

## రెండేళ్లు దాగిన రహస్య ప్రేమాయణం!

ఆర్కోణానికి చెందిన కావేరీ పాకంలో 60 ఏళ్ళ మురుగేశ పండితుడు అనే ఆయన రెండో భార్య 35 ఏళ్ళ ఎల్లమ్మ అదే వూరుకు చెందిన పాండురంగన్ అనే అతనితో రహస్య ప్రేమాయణం పెట్టుకుందట. ఈ విషయం పండితునికి తెలిసేసరికి రెండేళ్ళు పట్టిందట. దాంతో అతను, వూరిపెద్దలు కొంతమంది చేరి పాండురంగానికి హితవు చెప్పి చూశారట. ఎంత చెప్పినా అతను ఎల్లమ్మను కలుసుకోడం మానకపోయేసరికి పండితునికి కోపం వచ్చి నిద్రపోతున్న పాండురంగాన్ని పొడిచి చంపేశాడట.

## ఇంటిలోని పోరు

తన సంపాదనతో పైసాకూడా యింట్లో యివ్వకపోడమేగాక, పాడు స్నేహాలు పెట్టుకుని, వూరొదిలేసి, వో రెండు రోజులాగి తిరిగి రావడం 2 ఏళ్ళ నుంచి బందు అనే అతను అలవాటు చేసుకున్నాడు. అతని తండ్రి వెంకటస్వ




నాయుడు జ్వరంతో పడుకుని వుండగా వార్త బంధు ఆయన్ను కొట్టాడట. దాంతో నాయుడు గారికి కోపంవచ్చి అడవి జంతువులకు వేటాడి పొలం కాపాడుకోడానికి అట్టేపెట్టుకున్న తుపాకీతో తనయుణ్ణి కాల్చి చంపేశాడట. ఇది ఉత్తర ఆర్కాటుకు చెందిన పుట్టకుండా అనే గ్రామంలో జరిగింది.

## బంగళాలో నాలుగు శవాలు

బొంబాయి దోబీ తలావోలో ఓ బంగళాలో వాళ్ళవ తేదీన పోలీసులు నాలుగు శవాలను కనుగొన్నారట. రెండో తేదీనుంచి వారిల్లు తాళం వేసి వుందని తెలిసిన ఒకాయన రిపోర్టిస్తే, పోలీసులు కలుగ జేసుకున్నారట. చని పోయిన నలుగురూ 50 ఏళ్ళ పైవారేనట. కారణం తెలీలేదు.

## స్కూటరు ఆపి నడిబజార్లో బలాత్కారం!

దిల్లీ కాల్కాజీ ప్రాంతంలో 3వ తేదీ ఆదివారం రేయాంత్రం చోప్రా అనే ఆయన తన భార్యతో స్కూటరు మీద వెళుతుండగా పెద్దన్ లో ఒకరు, మూసా అనే అతనూ ఉయన స్కూటరునాపి, చోప్రా భార్యను స్కూటరు మీంచి క్రిందికి లాగి బలాత్కారించ బోయారట. కానీ ధైర్యంతో చోప్రా వాళ్ళని ఎదుర్కొని, గోల చేసేసరికి నలుగురూ వచ్చి విషయం గ్రహించక ముందే పరుగెత్తారట. స్వాతంత్ర్య మంటే ఎవరే పని చెయ్యాలనుకుంటే అది చేయడమేనా!

## ఆత్మహత్యలు!

బెంగుళూరులో పోలీసు రికార్డు లెక్కల ప్రకారం 1970 సంవత్సరంలో 237 ఆత్మహత్యలు జరిగాయట. పోయిన 1971 నిష్పత్తి పెరగవచ్చని, అందులో 132 మంది ఆడవాళ్లని పోలీసు కమిషనర్ సిరక్రర్య అన్నారట.

## అప్పు - ముప్పు

కొల్లప్పటి అనే గ్రామంలో కరియన్ అనే రకులు అనే స్నేహితుడు, కుందన్‌కు వో 12 రూపాయలు అప్పు ఇచ్చాడట. ఎన్నాళ్లయినా తన బాకీ తీర్చక పోయేసరికి కుందన్ యింటికి వెళ్ళి, పోట్లాట వేసుకున్నాడట. దాంతో కుందన్‌కి కోపం వచ్చి కొడవలితో బుజాల కరియన్‌ని నరికి చంపేశాడట.

## రాకూడని, రాని జబ్బులు వచ్చిన ఒకే వ్యక్తి!

బ్రెజిల్‌లో పట్నాన రెండు పదులైనా నిండని జోమర్ హెన్రి కాస్టా అనే వ్యక్తికి ప్రపంచంలో ఏ వ్యక్తి కూడని, రాని, జబ్బులు వచ్చాయట. అతనికి ఆరో నెలలో పళ్ళు విరిగి పోయాయి. పై మాంసం వచ్చిపోయిందట. రెండేళ్ళు నిండక ముందే జుట్టు పండిపోయి, వూడిపోనారంభించిందట. పదో ఏడు వచ్చేసరికల్లా శరీరమంతా ముడతలు పడి, రక్తనాళాలు గట్టిపడ నారంభించాయట. అతను యీ వ్యాధులతో జనవరి 26వ తేదీన చనిపోయాడట. అతనికి వచ్చినన్ని వ్యాధులు కోటికి ఒక్కనికి కూడా రావేమో నన్నారట డాక్టర్లు.

## ఉస్మానియా ఉపాధ్యక్షుని నిరాహార దీక్ష

విశ్వవిద్యాలయ ఆర్థిక పరిస్థితి బాగులేనందుకు స్తోమతున్నా కొంతమంది విద్యార్థులు పోస్టలు ఫీజులు కట్టనందుకు, ఎన్నికలకోసం పరీక్షలను వాయిదా వెయ్యమని కొంతమంది విద్యార్థులు గొడవ చేస్తున్నందుకు, క్రమశిక్షణ లేకుండా కొంతమంది విద్యార్థులు అల్లర్లు చేస్తున్నందుకు గాను ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ శ్రీ ఆర్. సత్యనారాయణ నిరాహార దీక్ష జనవరి 24న ఆరంభించారట.

## కారుని ఢీకొన్న విమానం!

14వ తేదీన టెక్సాస్‌లో రాయ్ మెల్టన్ గ్రిఫ్ అనే 20 ఏళ్ళ యువకుడు కారులో వెళుతుండగా ఆయన కారును వో విమానం వచ్చి ఢీ కొన్నదట. ఆయనకు స్వల్పంగా గాయాలయ్యాయట. తనవెదురుగా ఒకే లైటు కనబడడంవల్ల అది బహుశా మోటారు సైకిలయ్యుంటుందని తాననుకున్నానని ఆయనన్నారట. ఆకాశంలో ఎగరాల్సిన విమానం గతి తప్పి భూమ్మీద గంతులేస్తుందని ఎవరైనా కల గంటారా!!

## లోకాన్ని నమ్మించిన స్త్రీ

పొట్టమీద రేపురికార్లు చుట్టుకుని, అందులోంచి వచ్చే చంటిపిల్లడి ఏడుపును, ఊరేగుతూ నాస్తి శ్రోతలకు వినిపించి, ఇది నా గర్భస్థ శిశువు గొంతు అని లోకాన్ని ఏమార్చిన 33 ఏళ్ళ జహారి ఫోన్సాను జకార్తా పట్టి జైల్లో పడేసిందట. పైగా కనుక అత్యధిక దివ్య శక్తులుగల శిశువును ప్రసవించకపోతే నా తల నరికివేయండి అని ఆమె జైలులోంచి మరో ముఖ్య ప్రకటన చేసిందట.

## డబ్బుకి బదులు కార్డులు!

భావనగర్‌లో వారి టీవల టీ త్రాగి డబ్బులకు బదులు పోస్టుకార్డులు యిచ్చిపోతున్నారట. ఇలా ఆ జిల్లాకు చెందిన కొన్ని గ్రామాలలో వో టీ ఖరీదు ఒక పోస్టు కార్డుగా మారిపోయిందట.



## 200 గ్రాముల కోడి గుడ్డులో మరో గుడ్డు !

కాలూరు [కొచ్చిన్] లో ఒక అమెరికా మహిళ మిస్ గ్రేస్ పెట్టిన కోళ్ళ ఫారంలోని అమెరికా జాతి కోడిపెట్ట యీ మధ్య రివాజా సైజు కోడి గుడ్లను పెట్టడం మాని, వారానికోసారో, రెండుసార్లో పెద్ద సైజు గుడ్లు పెడుతూ వచ్చిందట. నెల నుంచీ యీ చర్య ద్వారానూ ఎక్కువైమన్న 200 గ్రాముల బరువు వున్న వో గుడ్డును పెట్టిందట. అసలు గుడ్డు నాలుగురెట్లు బరువున్న యీ గుడ్డులో మరో గుడ్డు వున్నదట.

## జోకులు కానివి !

స్వతంత్రపార్టీ మినోమసానీభార్య, ఆయన కుమారుడూ కలిసి [ఆయనకు వ్యతిరేకంగా] కొత్త కాంగ్రెసు తరపున పని చేస్తున్నారట తన పనిపూర్తి అయినాక తన భర్త తరపున కూడా తాను పని చెయ్యదల్చుకున్నట్టు మసానిభార్య వ్యక్తపరచారట. ఎన్నికలకు నిలబడితే అనక తగు సమయంలో తగ్గిపొమ్మని, అందుకైనా ఎన్నికల కయ్యే ఖర్చులు నేనే యిస్తానని తనకు వో పెద్ద మనిషి మాట యిచ్చి అనక పోస్టర్ల ఖర్చు 26 రూపాయలు కూడా యివ్వలేదని, కనుక తనను ఎన్నికలకు కూపం నుంచి బయట పడేస్తే ఎవరికోసమైనా తాను తొలగిపోవడానికి సిద్ధమేనని రాజస్థాన్‌కు చెందిన శికార్‌లో రామ్‌బల్లభ్ పాలియా అన్నారట.




## లైట్స్ ఆన్ !

13వ తేదీన బరీషత్ లోని మీర్జాపూరులో సైకిలు మీద ఇంటికి వెళ్తున్న 40 ఏళ్ళ బిజయ్ క్రిష్ణ బిస్వాస్ అనే పోలీసు కానిస్టేబుల్ని ఎవరో పొడిచి చంపేశారట. ఈ సందర్భంలో అరెస్టయిన తొమ్మండుగురిలో కాలేజీ ప్రొఫెసరు కూడా వున్నారట. అక్రితోం అనే చోట హోటల్‌లో భోజనం చేస్తున్న ఇమాంఅలీ అనే ఆయన్ను ఎవరో కొందరు గుమ్మిగూడి పొడిచి చంపి పారిపోయారట. షేర్‌బజార్ రైల్వేస్టేషను ప్రాంతంలో వో గోడమీద ఎన్నికల ప్రచార విషయాన్ని రాస్తున్న నిర్మల్‌సముద్దార్ అనే ఆయన్ను ఎవరో పొడిచి చంపేశారట. 14వ తేదీన 24 పరగణాలకు చెందిన హౌబ్రా పోలీసు స్టేషను ప్రాంతంలో తలలేని వో శవం దొరికిందట. 13వ తేదీన ఇంటికి తిరిగి వస్తున్న 45 ఏళ్ళ కుముద్ సైనియా అనే కాంగ్రెసు వ్యక్తిని దిపోటా [బెజుపూరు ప్రాంతం]లో ఎవరో చంపేశారట. 15వ తేది మొత్తంమీద కనీసం 10 మందైనా హత్యచేయబడి వుంటారని, వో 15 మంది గాయపడి వుంటారని వీరిలో 13 మంది పోలీసువారే వున్నారని అధికారులన్నారుట. రాధామాధవ్‌గార్డెన్‌సందు ప్రాంతంలో నక్సలైటులంతా చేరి వో మీటింగు పెట్టుకున్నారని తెలిసిన పోలీసులక్కడికి వెళ్ళేసరికి వారు వీరికి బాంబులతో ఘనస్వాగతం ఏర్పాటు చేశారట. ఆ స్వాగతానికి పోలీసులు తట్టుకోలేక కాల్పులు చేసేసరికి వో నలుగురు నక్సలైటులు చనిపోయారట. ●

# సినిమా

## తమ్ముడే దర్శకుడు!

'విజయంమనదే' నిర్మాత నందమూరి సాంబశివరావు తన మిత్రులు కొందరితో కలిసి చిత్రకళ ఫిలిమ్స్‌ను స్థాపించారు. సి. ఐ. టి. కాలనీలోని వారి ఆఫీసుకు వెళ్లాను. అప్పుడు వుదయం ఎనిమిది మాత్రమే. అప్పటికే ఆఫీసు రూములో కథాచర్చ జరుగుతూ వుంది. 'ఎంకి—నాయుడు బావ'ను గురించేనా మీ చర్చ అని ప్రశ్నించాను. కాదు ఇప్పుడు ఒక క్రయిమ్ థ్రిల్లర్‌ను తీయడానికి నిర్ణయించాము. 'ఎంకి—నాయుడు బావ'ను భారీయెత్తున నిర్మించాలను కోవడంవల్ల ప్రస్తుతానికి ఆ కథను వాయిదా వేశాము' అన్నారు. 'మరి షూటింగు, ఈ చిత్రంయొక్క కాస్టింగు చెప్పగలరా' అని అడిగాను. 'షూటింగు మార్చి 29 నుండి వుంటుంది. నాయకుడు శోభన్‌బాబు; నాయికలు చంద్రకళ, విజయలలిత, హాస్యనటుడు రాజబాబు; ప్రతినాయకుడు సత్యనారాయణ. కథను ఆర్. కె. ధర్మరాజు యిచ్చారు. మాటలను మహారథి వ్రాస్తున్నారు. సంగీతాన్ని చలపతిరావు, ఛాయను వెంకటరత్నం, శిల్పాన్ని కృష్ణారావు నిర్వహిస్తారు. నా తమ్ముడు నందమూరి రమేష్ డైరెక్టు చేస్తారు. అన్నట్లు చెప్పడం మరిచా. ఇది పూర్తిగా కలర్‌లో నిర్మించబడుతుంది,' అని చెప్పారు.

## రంగుల్లో రెండుపాటలు

సి. ఐ. టి. నుండి వాహిని స్టూడియోకి వెళ్లాను. రికార్డింగ్ థియేటర్లోకి అడుగెట్టాను. అక్కడ ఎడిటర్‌కమ్ డైరెక్టర్ అక్కినేని సంజీవిని చూసాను. 'బాగున్నారా' అని అడిగి శివరామ్ (సౌండ్ ఇంజనీరు) రూములోకి వెళ్లాను. అక్కడ సంగీత దర్శకుడు చలపతిరావును, కల్పనా రామారావు, భూషణ్‌లను చూచాను 'పాట వినిపిస్తారా' చలపతిరావుగారూ' అని అడిగాను. 'నిరభ్యంతరంగా' అంటూ రికార్డు చేసిన లల్లబీపాటను వినిపించారు. ఎంత మధురమయినబాణీ, ఎంత హాయిని గొలిపే గొంతుక! ఆపాటను కవి నారాయణరెడ్డి వ్రాసారు. సుశీల కమ్మగా పాడింది.

'చిట్టిబాబు...చిన్నిబాబు
కలలుపండగా నిదురించరా'—ఈపాట ఏ చిత్రంలోనిదో చెప్పాలిగా. రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'సిసింద్రీ చిట్టిబాబు' చిత్రంలోనిది. పాటవిని వస్తుంటే, నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి కనిపించారు. 'పాట చాలా బాగావచ్చింది సార్ 'మీ పిక్చర్‌కి సంబంధించిన వివరాలు చెప్పగలరా' అని అడిగాను. 'చిత్రంపేరు 'సిసింద్రీ చిట్టిబాబు'; కథ, మాటలను పినిసెట్టి వ్రాసారు. అక్కినేని సంజీవి దర్శకత్వంలో తయారయ్యే ఈ చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. శోభన్‌బాబు కథానాయకుడు. గుమ్మడి, శారద, సూర్యకాంతం, 'బాలరాజుకథ' ఫేం మాస్టర్ ప్రభాకర్ ప్రధాన పాత్రధారులు. రెండుపాటలుకలర్‌లో చిత్రీకరించబడుతాయి' అన్నారు. 'హీరో నాగేశ్వరరావు పిక్చర్‌ను యెప్పుడు స్టార్టు చేస్తారు?' అన్న నాప్రశ్నకు 'జూన్‌నుండి పూర్తి రంగుల్లో నిర్మించదలిచాను. అంతే గాదు. మా అబ్బాయి టి. ఎల్. బాబు ఆ పిక్చరును డైరెక్టుచేస్తాడు కూడా' అన్నారు.

## సుభాషిణీ ఆర్టుపిక్చర్స్ ప్రారంభం

వాహినినుండి ప్రసాద్‌కు వెళ్లాను. అక్కడ సుభాషిణీ ఆర్ట్‌పిక్చర్స్‌వారి సాంఘిక చిత్రానికి మధ్యాహ్నం గంటే—50 లకు ప్రారంభోత్సవం జరిగింది. ముఖ్య నటుడు ఎన్. టి. రామారావు కొబ్బరికాయ కొట్టడంతో షూటింగు స్టార్టు అయింది. 'అమ్మా, శారదా' అంటూ రామారావు యింట్లోకి వచ్చే షాటును దర్శకుడు హేమాంబరధరరావు, చక్కగా చిత్రీకరించారు. శారద పాత్రను (హీరో చెల్లెలు) సుమ పోషిస్తోంది. పూజకు భూతాలరాజా కర్తగా వ్యవహరించారు. పూర్ణా కామరాజు, తాతినేని చలపతిరావు, 'కథానాయకుడు' చిత్రనిర్మాత గోపాలకృష్ణ, జయలక్ష్మి నాగేశ్వరరావు, నిర్మాత దర్శకుడు హేమాంబరధరరావుకు శుభాకాంక్షలు అందచేసారు.

పై చిత్రంలో రామారావు, వాణిశ్రీ, నాగభూషణం, రామకృష్ణ, సుమ, పద్మనాభం, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, రావికొండలరావు, రాధాకుమారి, రమాప్రభ, బేబీ శ్రీదేవి, మాస్టర్ ఆదినారాయణ ముఖ్యభూమికలను ధరిస్తున్నారు. బాలమురుగన్ కథకు—నూరి, ఆచార్య



ఇది ఎక్కడో పసిఫిక్ సముద్రంలో ఒక చిన్నద్వీపంమీద దృశ్యమా? 'అమాయకురాలు' చిత్రంలో కాంచన, నాగేశ్వరరావు.

నరసింహామూర్తి జాయింటుగా సంభాషణలను సమకూర్చారు. సంగీతాన్ని చలపతిరావు, ఛాయను శేఖర్—శింగ్, శిల్పాన్ని బి. ఎన్. క్రిష్ణ, నిర్మాణ నిర్వహణను మహేంద్ర, సహాయ దర్శకత్వాన్ని కత్తులగోపాలక్రిష్ణ నిర్వహిస్తున్న యీ చిత్రం పూర్ణాపిక్చర్స్‌ద్వారా ఆగస్టు 6 న విడుదలవుతుంది.

## అవధుల మేరకి కొత్త నాయకీ నాయకుల నటన

ప్రసాద్ నుండి విజయాగార్డెన్స్‌కు వెళ్ళాను. రికార్డింగు థియేటరు ముందు కాస్సేపు ఆగాను. ఎందుకో తెలుసా? హాస్యనటుడు పద్మనాభంని 'మిడతంభొట్లు విశేషాలను అడగడానికే. చిత్రం షూటింగు పూర్తయినట్లు చెప్పారు. ఈ చిత్రంలో కొత్త కథానాయిక, నాయకుడ్ని పద్మనాభం పరిచయం చేసారుగదా, వాళ్లిద్దరూ పాత్రల అవధుల మేరకు బాగా నటించారని దర్శకుడు పద్మనాభం వెల్లడించారు.



'వింత సంసారంలో'' సావిత్రి.

## డి. వి. ఎస్. లోని తమాషా డ్యూయెట్

ఆయనతో పదినిమిషాలు ముచ్చటించి, థియేటర్లోకి ప్రవేశించాను. నిర్మాత డి. వి. ఎస్. రాజు, సంగీతసారథి టి. వి. రాజు అండ్ విజయా కృష్ణమూర్తి పాటలో పూర్తిగా నిమగ్నులై వుండడాన్ని చూచాను. నేనూ విందామనే ఆపేక్షతో, ఖాళీగా వున్న ఓ కుర్చీలో కూర్చున్నాను. 'ఏం మాష్టారూ. టేక్ చేద్దామా' అన్నారు టి. వి. రాజు.

## సినిమా

'షయ్ ఆర్ రెడీ' అని రెండుగొంతులు వినిపించాయి. ఒకటి ఘంటసాల గొంతు, మరొకటి సుశీలది. స్వామినాథన్ రెడీ అనడం, సుశీల, ఘంటసాలగార్లు పోటాపోటీగా పాడడం నాలుగు నిమిషాల్లో జరిగిపోయింది. ఫస్టు టేక్ వో. కే. అయింది. కవి నారాయణరెడ్డి వ్రాసిన ఆ యుగళగీతం యొక్క కొంత భాగాన్ని మీకూ చవి చూపిస్తాను.

'ఇక్కడే... ఈ గదిలోనే
అప్పుడే... ఒకటయినప్పుడే
అలివేణి సిగపూలు ఏమన్నవో
తొలిరేయి తెలవార లేనన్నదో
చెప్పనా... మళ్ళీ చెప్పనా'—

ఈ పాటను డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి తాజా సాంఘిక చిత్రంలో రామారావు—దేవిక మీద చిత్రీకరిస్తారట. చిత్రంలో వినిపించే ఏడుపాటలను నారాయణ రెడ్డి వ్రాసారు. పాటలన్నీ రికార్డు చెయ్యబడ్డాయి కూడా. షూటింగు ఫిబ్రవరి 15 వ ప్రారంభం, అన్నారు నిర్మాత రాజుగారు.

డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని కాశీనాథుని విశ్వనాథ్ నిర్వహిస్తున్నారు. మాటలను సముద్రాల, సంగీతాన్ని టి. వి. రాజు, శిల్పాన్ని కళాధర్, ఛాయను లాల్ చేపట్టారు. ముఖ్యపాత్రలను ఎన్. టి. రామారావు, శోభన్‌బాబు, జగ్గయ్య, రాజనాల, అల్లురామలింగయ్య, రాజబాబు, వాణిశ్రీ, దేవిక, శాంతకుమారి, రమాప్రభ పోషిస్తున్నారు. విజయరిలీజ్.

## సుందరకాండలో శ్రీరాముడు

గార్డెన్స్‌లో సుశీల, ఘంటసాల పాడిన డ్యూయెట్టును విని, అక్కడినుండి వీనస్ స్టుడియోకి బయల్దేరాను. స్టుడియోసెట్టు బయట హరనాథ్‌ను కలిసాను. 'సుందర కాండ'లో శ్రీరాముడిగా నటిస్తున్నట్టు తెలుసుకున్నాను సెట్లోకి వెళ్లాను.

## సరోజాదేవిపై హరనాథ్ అలుక?

సెట్లో ఒక విశాలమయిన వీధిని ఆర్ట్ డైరెక్టరు రాజేంద్రకుమార్ అత్యంత సహజంగా నిర్మించారు ఆ వీధిలో ఒక అంబాసిడర్ కారు వచ్చి ఒక యింటి గుమ్మం ముందు ఆగింది కారును డ్రయివ్ చేసిన సరోజాదేవి హారన్ కొట్టింది ఇంట్లో నుండి సావిత్రి బయటకు వచ్చింది.

సావిత్రి రా, లక్ష్మీ లోపలికి రా యిదీ నీ యిల్లే

సరోజ వారి కొకసారి పిలుస్తారా' (హరనాథ్‌ని)

సావిత్రి. వాడు యీరోజు రాలేదమ్మా.

## సినిమా డైరీ

● సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ వారి షూటింగు ఫిబ్రవరి 11వ ప్రసాద్ స్టూడియోలో ప్రారంభమయి, 14 వరకు జరిగింది ఎన్ టి ఆర్, సుమ, రాధాకుమారి పాల్గొన్న దృశ్యాలను హేమాంబరధరరావు చిత్రీకరించారు

● విశ్వభారతి ప్రొడక్షన్స్ వారి షూటింగు ఫిబ్రవరి 8 నుండి 15 వరకు సారథి స్టుడియోలో జరిగింది. నాగేశ్వరరావు, జమున, గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు పాల్గొన్న దృశ్యాలను కె. ప్రత్యగాత్మ చిత్రీకరించారు

● రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ వారి సిసింద్రీ చిట్టిబాబు పాటల రికార్డింగ్ చలపతిరావు అధ్వర్యములో ఫిబ్రవరి 12 నుండి 17 వరకు వాహినిలో జరిగింది ఘంటసాల, సుశీల, ఈశ్వరి పాడారు

● విశ్వజ్యోతి పిక్చర్సు వారి మొదటిపాట రికార్డింగు ఫిబ్రవరి 11వ గార్డెన్స్‌లో జరిగింది పెండ్యాల సంగీత దర్శకుడు గాయని సుశీల

● సాగర్ ఫిలింస్ వారి చివరిపాట రికార్డింగు ఫిబ్రవరి 11వ వాహినిలో జరిగింది టి వి రాజు అధ్వర్యంలో ఘంటసాల పాడారు.

● అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి అమాయకురాలు అని పేరు పెట్టినట్టు నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు యిటీవల జరిగిన పత్రికా విలేఖరులు గోష్ఠిలో వెల్లడించారు

వాడి కోసమే నేనూ యెదురు చూస్తున్నాను.

సరోజ: అత్తయ్యా. మీరు పెద్దవారు. వారేదో ఆవేశంలో అలిగి వస్తే, సర్దిచెప్పి పంపాలిగాని అగ్నిలో ఆజ్యం పోస్తారా!

సావిత్రి: సరోజా! ఏమిటమ్మా నువ్వనేది. మీ యిద్దరి శ్రేయస్సును కోరే తల్లినమ్మా నేను.

సరోజ: కాని, నేను జీవితమే వారి పాదాల వద్ద వుంచి, బ్రతికినంతకాలం వారి సుఖదుఃఖాలు పంచుకునే భార్యను. నా బాధను కూడా కాస్త ఆలోచించండి.

సావిత్రి: సరోజా, సరోజా.

సరోజ: నేను వచ్చి వెళ్లానని కూడా చెప్పనక్కరలేదు...వస్తా—అంటూ కారును స్టార్ట్ చేసింది. 'కట్' అన్నారు దర్శకుడు మానాపురం. ఈ సన్నివేశం విశ్వజ్యోతి పిక్చర్స్ వారి మొదటి చిత్రంలో కనిపిస్తుంది. హరనాథ్, సరోజాదేవిల మధ్య అలుక యేర్పడడానికి కారణమేమిటి? హరనాథ్ యింటికి రాకుండా యెక్కడికి వెళ్లాడు? అనేది ప్రశ్నలకు నిర్మాతలు రాజేంద్రకుమార్, సత్యనారాయణలే తమ

# సినిమా

చిత్రం ద్వారా మీకు తెలియచేయాలి.

## వాణిశ్రీ విదేశీయాత్ర

స్టూడియో సంచారం పూర్తిచేసుకుని, నుంగంబాకం వీరభద్రయ్య అయ్యర్ వీథిలోని వాణిశ్రీ యింటికి చేరుకున్నాను. ఆమె అప్పుడే 'ఇద్దరమ్మాయిలు' తమిళ షూటింగు నుండి 'లంచ్'కు వచ్చింది. 'హల్లో, మేడమ్. మరీ బిజీ అయినట్టు వున్నారే. కొన్నాళ్లు అలా విదేశాలకు వెళ్లి రెస్టు తీసుకోరాదా?' అన్నాను. 'ఎక్కడ కుదురుతుంది. ఆగస్టు వరకు ఒక్కరోజు కూడా తీరిక దొరికే అవకాశమే లేదు. సురేష్, డి. వి. ఎస్, సుభాషిణి, విజయలక్ష్మీ సంస్థలకు ఆగస్టు వరకు కాల్‌షీట్లు యిచ్చాను. ఇవిగాక పద్మశ్రీ, పూర్ణిమా పిక్చర్స్‌లో కూడా నేనే నాయికను. అందరికీ మంచిగా, మర్యాదగా పనిచేసి పెట్టాలిగా. నాకు ఫారిన్ వెళ్లాలనే కోరిక గత సంవత్సరమే కలిగింది. గాబట్టి త్వరలోనే పోయేందుకు ప్రయత్నిస్తాను. 'ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నేను బ్యాటరీ పరిశ్రమను స్థాపించనున్నట్టు మీరు వ్రాసారుగా. ఆంధ్రా నుండి చాలామంది తమకు ఏజెన్సీ యిమ్మని వుత్తరాలు వ్రాస్తున్నారు.' అంది వాణిశ్రీ. 'మీరు విద్యాలయ భవన నిర్మాణానికి 30వేలు యిచ్చే వుద్దేశ్యం ఎలా కలిగింది'? అని అడిగాను 'నేను స్కూల్ ఫైనల్ కూడా చదవకుండా నటినయ్యాను. నేను చదువుకోనందుకు నాలో నేను యెంతో బాధపడుతున్నాను. అందుకే ఆ గ్రామస్తులు వచ్చి కోరగానే సంతోషంగా యిచ్చాను. రెండింటికి షూటింగు వుందండీ. భోంచేసి వెళ్లాలి' అని చెప్పి లోపలికి వెళ్లింది.

## రోజుకి రెండు పాటలు

గాయని సుశీల గర్భవతిగా వుంది. అందుకే నిర్మాతలందరూ తమ చిత్రంలోని పాటలన్నింటినీ త్వరత్వరగా రికార్డ్ చేయిస్తున్నారు. ఫిబ్రవరి 1 నుండి 22 వరకు సుశీల రోజుకు కనీసం రెండుపాటల చొప్పున పాడిందంటే నమ్మండి. ఒకప్రక్క తెలుగు, మరొకప్రక్క తమిళం వాళ్ళు సుశీలతప్ప మరొకరిచేత సాధ్యమైనంత వరకు పాడించుకోవడానికి సుముఖులుగా లేరు



'బంగారుతల్లి'లో జగ్గయ్య. జమున.

అని బాగా తేలిపోయింది. నిజంకూడా అంతే. ఎందుకంటే ఆమె నిండు మాసాలుగా వుండి కూడా మధురాతి మధురంగా, చక్కటి ఎక్స్‌ప్రెషన్‌నిస్తూ పాడుతుందంటే, ఆమెకు ఆమే సాటి అని చెప్పక తప్పదు. నేను ఆమె పాడిన పదిపాటలను యీ పది రోజుల్లో విన్నాను. 'గంధర్వగానమా' అనిపించింది, వింటుంటే.

## కలిసివచ్చిన కాలం

దేనికయినా కాలం, కర్మం కలిసి రావాలంటారే—అది నిజమేనని చెప్పింది రామక్రిష్ణకు. మంచిపొడుగు, చక్కటి ముఖం, స్పష్టమయిన గొంతుక, మితంగా నటించే నటనాశక్తి వుండికూడా రామక్రిష్ణకు అదృష్టం ఇంతకుముందు కలిసి రాలేదు. ఇప్పుడు రామక్రిష్ణకు మంచి సీజన్ వచ్చింది. ఇప్పుడు రామక్రిష్ణ 'అరుణ్ పిక్చర్స్. కామాక్షి ఏజన్సీస్, పి. ఎన్. ఆర్' సంస్థల్లో నాయకుడు. సుభాషిణీలో రామారావుతో, నవభారత్ మూవీస్‌లో నాగేశ్వరరావుతో రామక్రిష్ణ మంచిపాత్రలను పోషిస్తున్నాడు.

## బీదలపాట్లు నాయకుడి డ్రస్ డిజైన్లు

వరశువాకంలోని విశలాచార్య యింటికి వెళ్లాను. నేను వెళ్లినప్పుడు ఒక గాయని, నటించడానికి ఆసక్తివున్న అందగత్తెలు ఇద్దరు వచ్చి, తమ అడ్రస్‌ను యిచ్చి వెళ్లారు. ఇలా ప్రతిరోజూ పదిమంది దాకా విఠలాచార్యను కలుసుకుంటూ వుంటారట. నేను వెళ్లగానే 'బీదలపాట్లు'కు హీరో

నాగేశ్వరరావుకు తయారుచేసిన డ్రస్ ట్రైన్లను చూపించారు. ఎనిమిది వెరైటీలు చూచాను. ఒకదాన్ని మించి మరొకటి వుంది. షూటింగు యెప్పట్నుండీ అని అడిగాను. 'హైదరాబాదుకు వెళ్లివచ్చి చెప్తాను. స్టోరీ బ్రహ్మాండంగా వచ్చింది' అని చెప్పి, తను సేకరించిన రెఫరన్స్ పుస్తకాలను నాకు చూపించారు. డి. వి. నరసరాజు నవరస భరితంగా కథను మలిచినట్లు చెప్పారు. 'బీదలపాట్లు' చిత్రాన్ని నాగేశ్వరరావుగారి సహాయ సహకారాలతో వీ వర్ణ చిత్రంగా రూపొందించడానికి ప్రయత్ని



'రంగేళీ రాజా'లో ఏగటి వేషాలా? కాండాని ఎక్కిన ఎవరు?

ప్తాను.' అని చెప్పారు, విశాలాచార్య.

## హుషారైన అమ్మాయికి క్లిష్టమైన పాత్ర

నందిని ఫిలింస్ 'అత్తలూ కోడళ్లు' చిత్రంలో రాజబాబుకు జంటగా ఒక హుషారయిన అమ్మాయి నటించడాన్ని చూచాను. ఆమె పేరు లీలారాణి అని పాఠకులకు తెలిపి

# సి ని మా

వున్నాను. 'పిండుదంపతులు' చిత్రంలో కనిపించేది కాస్సేపయినా, మన కళ్లంట నీళ్లు తెప్పించే విధంగా బాల వితంతువు పోషించినది. ఇప్పుడు లీలారాణికి విజయలక్ష్మి మూవీస్‌లో మరొక క్లిష్టపాత్ర దొరికింది. శోభన్‌బాబు చెల్లెలిగా, రాజబాబుకు ప్రేయసిగా కనిపిస్తుంది లీలారాణి. జి. వి. ఎస్. రాజా నిర్మించే చిత్రానికి పి. రామచంద్రరావు దర్శకుడు, భమిడిపాటి కథకుడు. సావిత్రి. వాణిశ్రీ, నాగభూషణం, సత్యనారాయణ, నాగయ్య ప్రధాన పాత్రధారులు.

## జగత్ మొనగాళ్ళు

యుగంధర్ ఆర్ట్స్ నిర్మించు 'జగత్ మొనగాళ్లు' చిత్రం పూర్తయింది. క్రైం, సెంటిమెంట్ యుతవృత్తంగా గల యీ చిత్ర కథను ఎ. ఎల్. ఎ. నాయుడు

## మీకు తెలుసా?

నటి చంద్రకళ 'ఫూల్—గులాబ్—కా' హిందీ చిత్రంలో నాయికగా బుక్ అయింది. టి. ఎస్ నారాయణ దర్శకుడు.

నటుడు శివాజీగణేశన్ సిండికేటు కాంగ్రెసుకు వోట్లు వెయ్యమని అడుగుతూ రోజుకు పదివూళ్లు తిరుగుతున్నారు. నెలరోజులు షూటింగు ఆపు చేశారు.

నటి భారతికి గుండెల మీద వున్న పుట్టు మచ్చ పుట్టుకతోనే వచ్చిందట. ఆమె అదృష్టానికి ఆ మచ్చ కూడా ఒక కారణం అని ఆమె చెబుతూ వుంటుంది.

నటి సరోజాదేవి బెంగుళూరులో నివసిస్తూ, షూటింగు వున్నప్పుడల్లా మద్రాసుకు విమానంలో వస్తుంటుంది. అడయారులో ఆమెకు చక్కటి బంగళా కూడా వుంది.

యాపొందించగా మాటలు ఆవిసెట్టి వ్రాశారు. ఇటీవల శ్రీశ్రీ రచించిన దేశభక్తిని ప్రబోధించేగేయాన్ని వసంత మధురంగా ఆలాపించగా సత్యం వీనులవిందుగా స్వరకల్పన చేశారు. కల్పన, ఉదయకుమార్, బాలకృష్ణ, సుదర్శన్ నటించు యీ చిత్రానికి ఎడిటింగ్ బి. హరినారాయణ, నిర్మాత వై. సుశీల్ చౌదరి.

* * *

'ధర్మదాత', 'బంగారుగాజులు' లాంటి విజయవంతమయిన చిత్రాలను నిర్మించిన రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ అధినేత శ్రీ తమ్మా



'విచిత్ర దాంపత్యం'లో సావిత్రికి గుమ్మడి ఎదురుతున్నట్టుందా?

రెడ్డి కృష్ణమూర్తి కుమారుడు చిరం జీవి లెనిన్‌బాబుకు, చిలుమూరు వాస్తవ్యులు కీ. శే. నూతక్కి బావయ్యపుత్రిక చి సౌ పూర్ణిమకు హైద్రాబాదు షాపూర్ వాడిలో జనవరి 28 న వైభవోపేతంగా వివాహం జరిగింది. వెండితెర అతిరథ మహారథులుగాక ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఖండుబాయ్‌దేశాయ్, అమాత్య శేఖరులు, హైకోర్టు న్యాయాధిపతి ఎ సాంబశివరావు, అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి చండ్ర రాజేశ్వరరావులు వివాహానికి విచ్చేసి వధూవరులకు శుభాకాంక్ష లంద చేసారు.

—శ్రీనివాస్ ●



నవదంపతులు చి. లెనిన్‌బాబు, చి సౌ పూర్ణిమలతో వటి పూర్ణకాంతం.

<u>చిత్రసమీక్ష:</u>

# జానీ మేరా నామ్

అంతర్జాతీయ దొంగలముఠా నాయకుడు రంజీత్‌సింగ్ (ప్రేమ్‌నాథ్) — తమ కార్యకపాలకు అడ్డువస్తున్న పోలీసు ఇన్స్‌పెక్టర్ని హత్య చేయిస్తాడు ఆ దారుణ హత్యాకాండను, పసివయసులో వున్న ఇన్స్‌పెక్టర్ ఇద్దరు కొడుకులూ చూస్తారు అందులో పెద్దవాడు మోహన్‌లో పగ రగులుతుంది. తన తండ్రిని చంపిన వాడిని వెంబడించి పొడిచి చంపి, రంజీత్‌సింగ్ కారు డిక్కీలో దాక్కుంటాడు రంజిత్ ఆ అబ్బాయిని చేరదీసి తన చెప్పుచేతల్లో ఉండేట్టు పెంచి పెద్ద చేస్తాడు

మోహన్ (ప్రాణ్) తమ్ముడు (దేవానంద్) పోలీస్ ఇన్స్‌పెక్టరయి, జానీ అనే పేరుతో ఈ స్మగ్లర్ల ముఠాని పట్టుకోవడం కోసం వల పన్నుతుంటాడు. రంజిత్‌సింగ్ బృందంలో చొరబడి తాను వారి కూటమిలో చేరినట్టు నాటకమాడుతాడు మోహన్ — జానీ పోలీసు ఇన్స్‌పెక్టరనీ, తమని పట్టుకోవటానికి వచ్చాడనీ పసిగట్టి కలియబడతాడు. తామిద్దరం అన్నదమ్ములం అని తెలుసుకున్న జానీ మోహన్‌లు—రంజిత్‌సింగ్ బృందాన్ని నేర్పుగా ఎదుర్కొని బంధించటంతో కథ సుఖాంతం అవుతుంది. జానీ ప్రియురాలిగా హేమమాలిని నటించింది.

ఫాలీమిస్త్రీ ఛాయాగ్రహణం కల్యాణ్ జీ—ఆనంద్‌జీల సంగీతం, సెంటిమెంట్, ఎంటర్‌టెయిన్‌మెంటు విందుగా వున్న చిత్రానికి స్క్రీన్‌ప్లే, మాటలు, కూర్పు, దర్శకత్వం: విజయానంద్.

—మోహన్‌కుమార్ ●

<u>అవీ ఇవీ:</u>

శ్రీ విడియాల చంద్రశేఖరరావుకి ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం రాష్ట్ర కమిటీ సభ్యునిగా, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ నాటకరంగ కళాకారుల సంఘ కార్యదర్శిగా, ఆంధ్రప్రదేశ్ వృత్తి కళాకారుల సంఘం కార్యవర్గ సభ్యునిగా ఎన్నికైన సందర్భంలో బందరు పురమందిరంలో ఇటీవల మచిలీపట్నం ఆర్టిస్ట్సు అసోసియేషను ఆధ్వర్యంలో ఘనసన్మానం జరిగింది. [పిడుగు రామలింగయ్య.]



'జానీ మేరా నామ్'లో హేమమాలిని, దేవానంద్.

# జి. కామరాజ్



కాస్ట్ ఆఫ్ ప్రొడక్షన్ జాగా పెరగటంవల్ల రిస్క్ ఎక్కువవుతోం దీనాడు — అన్నారు, పంపిణి రంగంలో పాతికేళ్ల అనుభవం కలిగిన పూర్ణా పిక్చర్స్ అధినేత శ్రీ జి. కామరాజు.

మీరు ఎదుర్కొంటున్న రిస్క్ ఎలాంటిది?

డిస్ట్రిబ్యూషన్ అడ్వాన్సు ఇవ్వటం ద్వారా... ఇవాళ స్టార్ వాల్యూ ఉన్న నలుపు తెలుపు చిత్రానికి ఎనిమిది లక్షలవుతోంది ఖర్చు. కలర్ పిక్చర్‌కి పదిన్నర నుంచి పదకొండు లక్షలు అవుతోంది. చిత్రం బాగా ఉండకపోతే, ప్రొడ్యూసర్‌కే కాదు, డిస్ట్రిబ్యూటర్‌కీ డబ్బు రావటం కష్టమే! 53, 54 ప్రాంతాల్లో లక్షరూపాయలు డిస్ట్రిబ్యూషన్ అడ్వాన్స్ యిచ్చే వాళ్లం ఒక చిత్రానికి. ఇపుడు పెరిగిన ఖర్చు ననుసరించి, అడ్వాన్సులు యివ్వవలసి వస్తుంది. అన్నారాయన.

1946 లో బి. కాం. పూర్తి చేసి; పంపిణి రంగంలోకి అడుగు పెట్టారు కామరాజు. తండ్రి మంగరాజుగారి శిక్షణలో—యీ వ్యాపారంలో, ఎంతో అనుభవం అనతికాలంలోనే సంపాయించారు.

ఇపుడు విడుదలవుతున్న చిత్రాలలో అధిక శాతం దెబ్బతింటున్నాయి, ఎందువల్ల? అని నే నడిగిన మరో ప్రశ్నకు శ్రీ కామరాజు సమాధానం చెబుతూ చిత్రాలు ఎక్కువ కావటం వల్ల... 65 నుంచి 70 వరకూ విడుదల అవుతున్నాయి. పిక్చరు మీద పిక్చరు ఒకే వారంలో పడుతున్నాయి. పూర్వం తక్కువగా వచ్చేవి. తక్కువ కాబట్టి ఎక్కువగా చూసేవారు. ఇపుడు ఎక్కువగా రావటం వల్ల—ప్రేక్షకులు సెలక్ట్ చేసుకు మరీ చూస్తున్నారు కనుక ఎక్కువ పే చేసే అవకాశం తక్కువ. అనుభవంలేక డబ్బు వృథా చేయటం, బడ్జెట్ ప్లానింగ్ లేకపోవటం, ఒక చిత్రానికి డబ్బు బాగా వస్తే— అదేరకం చిత్రాలు వరుసగా రావటం వంటివి కూడా యిందుకు కారణాలు. అన్నారు.

కొత్తవాళ్లను తీసుకురావటం ద్వారా ప్రొడక్షన్ ఖర్చు కొంత తగ్గే అవకాశం ఉంది. అయితే ఈ పని బేనర్ వేల్యూ ఉన్న సంస్థలు చెయ్యాలి. సాంకేతిక నిపుణులు, కథానాయికలు లభ్యమవుతున్నారు గాని—హీరోకి కావలసిన అరహతలున్న కొత్తవాళ్ళు రావటంలేదు. కథ చిత్రానికి ప్రాణం వంటిది. చక్కని కథను ఎన్నుకుని ప్రతిభ కలిగిన కొత్తవారితో చిత్రాలు నిర్మిస్తే విజయం లభిస్తుంది. అనికూడా శ్రీ కామరాజు చెప్పారు.

కన్సిస్టెంట్ టర్నోవర్ ఉన్న కంపెనీ పూర్ణా పిక్చర్స్ ఆంధ్రదేశంలో ఏ పంపిణి సంస్థా విడుదల చెయ్యనన్ని చిత్రాలు విడుదల చేసింది. కిందటి సంవత్సరం 14 చిత్రాల విడుదల చేసి అని రికార్డ్‌ను మరోసారి రుజూ చేసుకుంది సంస్థ. తెలుగువారిచే ప్రారంభించబడిన తొలి పంపిణి సంస్థ కూడా ఇదేనని తెలిసిన వాళ్లు చెబుతారు.




మోహన కుమార్

# శా ర ద



అగ్నిరేఖ హిందీ చిత్రం షూటింగ్ ముగించుకొనికిందటి వారమే బొంబాయి నుంచి వచ్చిన నటి శారదను — వాళ్ల యింటి దగ్గర కలిసినపుడు శారదగారూ, ఊర్వశికి ముందూ, వెనకా — ఏమిటి మీరు? అని అడిగాను.

శారద నవ్వి చాలా మంచి ప్రశ్న. దీనికి సమాధానం చాలా పెద్దదిగా చెప్పవలసి వచ్చినప్పటికీ— క్లుప్తంగా అడిగారు గనుక, క్లుప్తంగానే చెబుతాను. అన్నారు. అరటి చెట్టును తీసుకోండి. గెల వెయ్యక ముందూ, వేసిం తర్వాతా ఏమిటి తేడా?.. అంతే ఇదీ.. అంటే గెల వెయ్యక ముందు అరటి చెట్టు నిగనిగలాడుతూ ఎంతో పొగరుగా కనిపిస్తుంది. వేసిం తర్వాత బరువు అధికమయి వంగుతుంది.

దక్షిణాది భాషల్లో, ఇంతవరకూ సుమారు 75 చిత్రాలలో నటించిన శారద— సమాజుకో బదల్ డాలో [మనుషులు మారాలి] అన్న హిందీ చిత్రంలో కూడా నటించారు. ఇపుడు అగ్నిరేఖ, ముకుల్‌దత్ దర్శకత్వంలో నిర్మింపబడుతున్న మరొక హిందీ చిత్రంలోను నటిస్తున్నారు. మొదటి చిత్రంలో సంజీవకుమార్, రెండవదాన్లో అమితాబ్‌బచన్ నాయకులు.

ఇన్ని రకాల భాషా చిత్రాలలో నటిస్తూ ఎలా అడ్జస్టు కాగలుగుతున్నారు?

ముందు నిజ జీవితంలో నటించవలసి వస్తుంది. తెలుగు, తమిళ, మళయాళ, హిందీ భాషా చిత్రాలలో నటిస్తూ, ఆయా ప్రాంతాలకు అలవాటు పడటం, అక్కడి వాతావరణంలో సరిపెట్టుకోవటం— ఈ భాష నుంచి గబుక్కుని ఆ భాషకు మారిపోవటం— ఇన్నిరకాల మనుషుల మనస్తత్వాలకు అడ్జస్టు కావటం మహా విసుగు పుడుతోంది ఒక్కోసారి. ఊర్వశి తర్వాత పడుతున్న బాధలివన్నీ...

ఆరు సంవత్సరాల తర్వాత ఇటీవల కె. ఆర్. ...న్ తమిళ చిత్రంలో నటిస్తున్న శారద—ఇపుడు అపూర్వ..., జీవితచక్రం, సతీఅనసూయ, సింహద్రి చిట్టిబాబు తెలుగు, చిత్రాలలో ముఖ్యభూమికలు పోషిస్తున్నారు.

నటుడు చలం ను వివాహం చేసుకుని శ్రీమతి అయిన శారద వివాహితం ... దొరికినా సంసార జీవితానికి యింపార్టెన్స్ యిస్తాను. ... నుంచి ... మాస్తాను అంటారు శ్రీమతి శారద. ●

# ...కాంచన

(53 వ పేజీ తరువాయి)

వెళ్లాను. నాకు రోమ్, లండన్ బాగా నచ్చాయి. మనం చరిత్రలో చదివే పురాతన సంస్కృతిని 'రోమ్'లో యిప్పటికీ చూడగలము.

ప్ర : మీరు ఎక్కువగా సంతోషించే సమయం...బాధపడే సమయం...ఎప్పుడు?

జ : నవ్వులోనే బాధను యిముడ్చుకునే తత్వం నాది. లోపల బాధపడుతున్నా, పయికి సంతోషంగానే కనిపించే మనస్తత్వం నాది.

ప్ర : మీ అందాన్ని సంరక్షించుకోవడానికి మీరేదయినా ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారా?

జ : శుభ్రంగా తింటాను. హాయిగా కాలక్షేపం చేస్తాను.

ప్ర : మీకు నవలలు, పత్రికలు చదివే అలవాటుందా?

జ : నా పడక గదిలో ఒక గ్రంథాలయమే వుంది.

ప్ర : ఇందిరాగాంధి ప్రభుత్వంపై మీ అభిప్రాయం?

జ : నాకు రాజకీయ పరిజ్ఞానం అంతగా లేదు. నేను భారతదేశపు పౌరురాలిని. ఏది మంచో, యేది చెడో నిర్ణయించేది మన దేశ ప్రజలు. వస్తున్నాయిగా ఎన్నికలు అప్పటికిగాని తెలియదు.

—ఇంటర్ వ్యూ : శ్రీనివాస్ ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



ఐడేటి ఫిలిమ్సు" ప్రొడక్షన్ నెం. 1" లో విజయనిర్మల.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# అశోకా శాండల్ వుడ్ ఫేస్ పౌడరు

మీకు సదా యౌవన శోభ కావలెనా? అయితే మీరు ఎల్లప్పుడు అశోకా శాండల్ వుడ్ ఫేస్ పౌడరునే ఉపయోగించండి. అది మీ ముఖమున, దేహమునగల ముడతలు, మచ్చలు, గుల్లలు మొదలగు వాటిని నివర్తించి ముఖమునకు, చర్మమునకు ఒక కాంతులను కలిగించి యౌవన శోభ నొసగును. గాన సదా అశోకా శాండల్ పౌడరునే ఉపయోగింపుడు. దీని చందన పరిమళము మిమ్ములను దినమంతయు ఉత్సాహ భరితులుగా జేయును.




విజయా కెమికల్స్, మద్రాసు-7.